3.2.04

# చతుర ప్రపంచం

## వింత శిలావిగ్రహాలు

ప్రముఖుల గౌరవార్థం రోడ్లమీద శిలావిగ్రహాలని నెలకొల్పడం మామూలే. అయితే అవి ఎక్కువగా రాజకీయ నాయకులవే అయి వుండడం ఇండియాలో సహజం. కానీ విదేశాలలో ఇతరుల గౌరవార్థం కూడా అనేక శిలా విగ్రహాలను ఏర్పాటు చేస్తుంటారు. మనుషులకేకాక, జంతువులూ, ప్రాణంలేని వస్తువులూ కూడా ఈ విగ్రహాల్లో చోటు చేసుకోవడం ఆశ్చర్యం.

టోక్యో పొలిమేరల్లోని ఓ సబ్‌వే రైల్వే స్టేషన్‌కి బయట ఓ కుక్క శిలా విగ్రహాన్ని 1973లో ఏర్పాటు చేశారు. అది ఒకతని పెంపుడు కుక్క. అతనికి ఆ కుక్క తప్ప మరెవరూ లేరు. రోజూ అతడు ఆఫీసుకి వెళ్లేప్పుడు అది అతనితో కూడా లోకల్ రైల్వే స్టేషన్ దాకా వెంట వచ్చేది. తిరిగి సరిగ్గా అతను ఆఫీసునుంచి వెనక్కి వచ్చే ...ముకి మళ్లీ వచ్చి స్టేషన్‌లో అతను దిగ...నే అతనితో కూడా మళ్లీ ఇంటిదాకా వెళ్లేది. ఓ రోజు సాయంత్రం అది ఎంత ...పు ఎదురు చూసినా అతను రాలేదు. ...న్ వచ్చి వెళ్లిపోయింది. ఆఫీసులో ...తను గుండెపోటు వచ్చి మరణించాడు. ...తే... ఆ కుక్క అతనిమీద ప్రేమతో ... నుంచి కదల్లేదు. నిద్రాహారాలు ... అతని కోసం పధ్నాలుగు రోజుల...టు ఎదురు చూసిచూసి అక్కడే ప్రాణాలు వదిలింది. విషయం తెలుసుకున్న పౌరులు దాని గౌరవార్థం ఆ స్టేషన్ బయట, అది మరణించిన చోట దాని శిలా విగ్రహాన్ని ఏర్పాటు చేశారు.




యుగోస్లేవియా రాజధాని బెల్‌గ్రేడ్‌లోని ఓ పార్క్‌లో 'అమ్మమ్మ'ల గౌరవార్థం ఓ శిలా విగ్రహాన్ని ఏర్పాటు చేశారు. అమ్మమ్మలు, నానమ్మలు తమ మనవలని, మనవరాళ్లని ప్రతి సాయంత్రం చుట్టుపక్కల ఇళ్లనుంచి ఆ పార్క్‌కి తీసుకువచ్చి ఆడించడం, తమ పిల్లలు ఆఫీసులకు వెళితే పసి పిల్లలను ఇంట్లో చూసుకోవడం చేసేవారు. ఆ ఏరియాలోని ఆఖరి వృద్ధురాలు కూడా మరణించాక ఆ ప్రాంతం పౌరులంతా కలిసి ఓ వృద్ధనారి విగ్రహాన్ని వాళ్ల గౌరవార్థం పార్క్‌లో నెలకొల్పారు.

కెనడాలోని వేంకోవర్ అనే పట్టణంలో ఓ ప్లేగ్రౌండ్ ప్రవేశద్వారంలో పెద్ద సైజు హాకీ బాట్ విగ్రహాన్ని నెలకొల్పారు. ఆ ప్లేగ్రౌండ్‌కి నిత్యం వచ్చి ఆడే హాకీ ప్రియులంతా తలా కాస్త వేసుకుని దాన్ని ఏర్పాటు చేసుకున్నారు.

సౌత్‌ఆఫ్రికాలోని ఓ గ్రామస్థులు ప్రభుత్వ అసమర్థతని ఎత్తిచూపుతూ పెద్ద దోమ శిలావిగ్రహాన్ని నెలకొల్పారు. ఆ గ్రామం

కవర్ పేజీ మోడల్ : కరుణ ✦ ఫొటోగ్రాఫర్ : మధు

లోని దోమలను ప్రభుత్వం కంట్రోలు చేయనందుకు నిరసన చిహ్నంగా దానిని ఏర్పాటు చేశారు.

అమెరికాలోని టెక్సాస్ రాష్ట్రానికి చెందిన ఓ వ్యక్తికి డబ్బంటే మహా ఇష్టం. నిజానికి అందరికీ ఇష్టమే. కానీ అతని ఇష్టం ఎంత వరకూ వెళ్లిందంటే తానుండే పట్టణం సెంటర్‌లో ఓ డాలర్ నోటు విగ్రహాన్ని తన ఖర్చుతో ఏర్పాటు చేశాడు. దానికి మునిసిపాలిటీ అనుమతికోసం కూడా భారీ మొత్తమే ఖర్చుపెట్టాడు.

"ఒక్క అమెరికానేకాదు, ప్రపంచమంతా గౌరవించే డాలర్‌కి గౌరవచిహ్నం లేకపోవడం బాగా లేదు కనుక నేనలా చేశాను" అన్నాడతను అడిగిన వాళ్లతో.

---

## బతికిన లేఖా సాహిత్యం

కెనడాలోని వేంకోవర్ అనే ఊళ్లోని లైబ్రరీలో లైబ్రేరియన్‌గా పనిచేసే జాన్‌మార్టిన్ అనే అతను ఓ రోజు తమ వద్దనున్న పుస్తకాల జాబితాను తిరగేస్తూంటే ఓ విషయం స్ఫురించింది. గత పదేళ్లుగా ప్రేమలేఖలకి సంబంధించిన పుస్తకం ఒక్కటీ రాలేదు. వెంటనే అతను ఓ పుస్తకాల షాపుకి ఫోన్




చేసి ప్రేమలేఖల మీద ఎన్ని రకాల పుస్తకాలున్నాయని అడిగితే ఒక్కటీ లేదని తేలింది. ప్రచురణ కర్తలు ఆ సబ్‌జెక్ట్‌మీద పుస్తకాలని ప్రచురించడం మానేశారు. అసలు లేఖా సాహిత్యమే వెలువడటం ఆగిపోయింది.

అతను కొద్ది రోజులపాటు ఇందుకు కారణాలను అన్వేషించాడు. లేఖలు రాసే అలవాటు కొత్తతరం వారిలో పూర్తిగా అణగారిపోయిందని తేలింది అందుకు కారణం అనేక సందర్భాల్లో అభినందనలు తెలిపే ఉత్తరాల స్థానంలో తక్కువ సమయంలో ఉత్త సంతకంతో పంపే అనేక రకాల గ్రీటింగ్ కార్డులు ప్రజలకి అందుబాటులో వుండటం ఓ కారణంగా గుర్తించాడు. సమయాన్ని నగదుగా మార్చుకునే స్వభావం గల యువతకి ఇది తేలిక మార్గంగా తోచడం అలాంటి కార్డులు అందకునే వారికి అది ఉత్తరాల కన్నా ఆకర్షణీయంగా కనిపించడం, ధర హెచ్చయినా అందమైన దళసరి కాగితం మీద రంగుల్లో ముద్రించిన నవ్వించే లేదా సెంటిమెంటల్‌గా తోచే మెసేజ్‌లుండటం వగైరా అనేక కారణాలు లేఖా రచన తలుపులను మూసి వేశాయి.

అతని అన్వేషణలో మరికొన్ని కారణాలు కూడా బయటపడ్డాయి. దూరప్రాంత ఫోన్‌లో మాట్లాడ్డం తేలిక. ఉత్తరం రాసే సమయంలో ఫోన్‌లో మరింత ఎక్కువ మాట్లాడచ్చు. సమాధానం కూడా వెంటనే లభిస్తుంది. దాంతో అతడు లేఖలు రాయడం మీద ఓ ఉద్యమాన్ని మొదలెట్టాడు. 'ఉత్తరం రాసే కళని మీ తరం చంపేయకూడదు' అనే నినాదంతో అతను కాలేజీలకి వెళ్లి స్పీచ్‌లు

ఇవ్వసాగాడు. పుస్తకబద్ధం అయిన లేఖా సాహిత్యంలోని మంచి ఉత్తరాలని చదివి వినిపించి 'ఇలాంటి భావాలు టెలిఫోన్ చేతిలో వుంటే రావు. చేతిలో కలం వున్నపుడే హృదయంలోంచి కాగితం మీదకు మీ భావాలు మీకు తెలియకుండానే దొర్లుతాయి' అని చెప్పసాగాడు.

నాలుగైదేళ్లలో అతని ప్రయత్నాలు ఫలించాయి. టీవీ దీనికి బాగా ప్రచారం కల్పించింది. దాంతో కెనడా పోస్టాఫీసులు మళ్లీ బిజీ అయ్యాయి. ఇప్పుడు కెనడాలో ఉత్తరం అందుకోవడం స్టేటస్ సింబల్‌గా మారింది.

---

# అమెరికన్ పోస్టల్ శాఖ ఔదార్యం

ప్రభుత్వోద్యోగులతో మామూలు ప్రజలు పడే పాట్లు అందరికీ తెలిసిందే. ప్రతి చిన్న పనికీ పదే పదే తిప్పించడం, లంచం చూపించందే కొంచెం కూడా కనికరం చూపించకపోవడం, వయసుకైనా ప్రాధాన్యతివ్వకుండా వృద్ధుల పట్ల కూడా నిర్లక్ష్య వైఖరి చూపించడం మొదలైనవి మనం తరచూ వింటూనే వుంటాము.

ఈమధ్య అమెరికాలో ఓ పోస్టల్ శాఖ అందుకు భిన్నంగా వ్యవహరించి, మానవత్వ విలువలు పెంచడానికి ఓ ప్రయత్నం చేసింది.

బ్రెస్ట్ కేన్సర్ నివారణకి పరిశోధనలు జరపడానికై 35 లక్షల డాలర్లని ప్రజలనుంచి వసూలు చేసి ఓ ఆర్గనైజేషన్‌కిచ్చింది. ఇందుకోసం 'ఫండ్ ది క్యూర్' అనే ప్రత్యేక తపాలా బిళ్లను విడుదల చేసింది. అమెరికాలో ఓ కవరు మీద అతికించాల్సిన తపాలా బిళ్ల విలువ 37 సెంట్లు. ఈ ప్రత్యేక తపాలా బిల్ల విలువ 40 సెంట్లు. దీనిని ప్రజలు కొని ఉపయోగించినప్పుడల్లా ప్రతీ స్టాంప్ అమ్మకం నుంచీ 3 సెంట్లు ఈ ఫండ్‌కి వెడుతుంది.

అమెరికన్ ప్రజలకి దానగుణం, పరోపకార గుణం సహజంగా ఎక్కువ కాబోలు. తమ ఉత్తరాలకి మామూలు తపాలా బిళ్లల్ని కాదని, ప్రత్యేక స్టాంప్‌ల పై అధిక శాతం ప్రజలు మక్కువ చూపుతున్నారు.

ఈ స్కీమ్ చాలా సత్ఫలితాల్నిచ్చింది. దానికి ముఖ్యకారణాలు... మూడు సెంట్లు పెద్ద ఎక్కువ ఖర్చు కాకపోవడం, ప్రభుత్వ ఆధ్వర్యంలో ఈ చందాలు పోగుపడడంతో అది సక్రమంగా ఫండ్‌కి వెడుతుందన్న నమ్మకం వుండటం, అమెరికాలో ఏ రకమయిన క్యాన్సర్ వ్యాధి అన్నా ప్రజలకి భయం వుండటం మొదలయినవి.

ఇలాంటి స్కీమ్‌ని మంచి కార్యాల కోసం భారత ప్రభుత్వ తపాలాశాఖ కూడా నిర్వహించవచ్చు. బీద విద్యార్థులకి చదువు, కూటికి లేనివారికి అన్నదానం లేదా ఉచిత వైద్య సదుపాయంలాంటి వాటికి ఈ రకం ప్రత్యేక తపాలా బిళ్లలని విడుదల చేయచ్చు.




అమెరికాలోని ఈ తపాలా బిళ్లని మేరీలాండ్‌కి చెందిన ఎథెల్ కెస్లర్ రూపొందించింది.



# చతుర

సంపుటి: 27
సంచిక: 1
ఫిబ్రవరి: 2004

"అమ్మా! సమాజసేవకులుగా అందరిలోనూ మంచి పేరు తెచ్చుకున్న నాన్నగారి వెంట నువ్వు ఎప్పుడూ ఏ సభలకీ ఎందుకు రావమ్మా? ఇంటి నాలుగ్గోడల మధ్యనే వుండాలని ఆయనేమీ నీకు ఆంక్ష విధించలేదుగదా!" అడిగింది కూతురు.

"లేదమ్మా! మీ నాన్నగారు నన్నెప్పుడూ అలా శాసించలేదు. ఇది నాకు నేను విధించుకున్న శిక్ష" అంది తల్లి.

"ఎందుకూ?"

"నాకు ఒక వింత జబ్బు వుంది. ఒక మనిషి ముఖాన్ని చూసి అతని అంతర్ముఖాన్ని అంచనా వెయ్యడమే ఆ జబ్బు. చాలాసార్లు నా అంచనాలు తప్పుకాలేదు. అందుకే సాధ్యమైనంత వరకూ మనుషుల ముఖాలు చూడకుండా పరదాల్లోనే గడుపుతున్నాను"

అంటున్న ఆ స్త్రీ అంతరంగంలో ఎలాంటి జీవితానుభవాలున్నాయి? చివరికి ఆమె జబ్బుకి లభించిన చికిత్స ఎలాంటిది? మానవ మనస్తత్వ మనోజ్ఞ విశ్లేషణ హోతా పద్మినీదేవి రచన 'గెలుపు' ఈ నెల చతుర సమగ్ర నవల.



ఆకాశం మేఘావృతమై వుంది. అంధకారం నిర్భాగ్యురాలైన ఆడపిల్ల భవిష్యత్తులా భయపెడుతోంది. వుండి వుండి ఉరుముతున్న మేఘాలు రాబోయే ప్రళయానికి సంకేతంలా వున్నాయి.

తల ఎత్తి ఆకాశంవైపు చూస్తూ 'వర్షం వస్తుందేమో' అనుకుంది దుర్గ. "ఇంకా ఎంత దూరం మేనేజరు బాబూ? " అనడిగింది.

ఆమెకి నాలుగడుగుల ముందు వడివడిగా నడుస్తున్న సదాశివం క్షణం ఆగి "వచ్చేశాం, త్వరగా నడు. వర్షం వస్తే ఇద్దరం తడిసిపోతాం" అన్నాడు.

ఆమె నడక వేగం హెచ్చించింది.

"నాకీ ఉద్యోగం తప్పకుండా వస్తుందా? " అడిగింది. ఆమె స్వరంలోని ఆశని, ఆత్రుతని గమనించిన అతను నవ్వుకున్నాడు.

"అయ్యగారు తలచుకుంటే ఎందుకు రాదు? " అన్నాడు.

"అదికాదు మేనేజరు బాబూ! ఈ ఉద్యోగానికి వందలమంది దరఖాస్తు చేసుకుంటే ఆ ఫ్యాక్టరీవాళ్ళు వాళ్లందరినీ కాదని నాకీ ఉద్యోగం ఇస్తారా? "

"ఎమ్.పి. గారు రికమండ్ చేస్తే ఇవ్వక చస్తారా? "

"అదికాదు..." ఆమె ఏదో అడగబోయింది.

"ఇంతకీ నీ సర్టిఫికెట్లు తెచ్చావా? "

"తెచ్చాను" పైటచాటున పెట్టుకున్న కవరు తీసి చూపించింది.

"సరేలే జాగ్రత్తగా పట్టుకో. అవి చాలా ముఖ్యమైనవి. ఎమ్. పి. గారు అడిగితే చూపించాలి" నడక వేగం పెంచుతూ అన్నాడు. దుర్గ పరుగులాంటి నడకతో అతన్ని అనుసరిస్తోంది.

"వచ్చేశాం. అదుగో... ఆ కనిపించే బంగ్లాయే" అన్నాడు సదాశివం.

ఆమె చాలా దూరం నడిచిరావడం వలన వచ్చిన వగర్పుతో మాట్లాడలేకపోయింది.

రాత్రి పదిగంటలవేళ వచ్చిన ఆ ఇద్దరినీ చూసి ఆ గెస్ట్‌హౌస్ వాచ్‌మేన్ గేటు తెరిచాడు. ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

"నువ్విక్కడే వుండు. నేను ఇప్పుడే వస్తాను" అని సదాశివం లోపలికి వెళ్లాడు.

దుర్గ వరండాలో నిలబడింది. వాచ్‌మెన్ ఆమె వైపు దొంగచూపులు చూస్తున్నాడు.

రెండు నిముషాల తర్వాత తిరిగి వచ్చిన అతను "అయ్యగారు నిన్ను లోపలికి రమ్మంటున్నారు. వెళ్ళు" అన్నాడు.

"మీరూ నాతో రండి బాబూ! నాకు భయం" అంది దుర్గ.

ఏదో జోక్ విన్నట్టు పగలబడి నవ్వాడతను.

"ఏమిటి, నేను నీకు తోడు రావాలా? ఇంకా నయం, ఉద్యోగంలో చేరాక కూడా ప్రతీరోజూ తోడు రమ్మనేలా వున్నావు. వెళ్ళు. ఎమ్. పి. గారు నిద్రపోయే వేళవుతోంది. ఆలస్యంగా వచ్చినందుకు చిర్రుబుర్రులాడుతున్నారు"

"నేను వచ్చేవరకూ మీరిక్కడే వుంటారు కదూ? " బతిమాలే ధోరణిలో అంది.

"సరేలే!"

దుర్గ ధైర్యాన్ని కూడదీసుకుంటూ ఆ గదిలోకి అడుగుపెట్టింది. ఎదురుగా సోఫాలో కూర్చున్న ఎమ్. పి. గారు గది గుమ్మంలోనే ఆగిపోయిన ఆమెని చూసి, "ఆ తలుపు మూసేసి లోపలకి రా దుర్గా" అన్నారు.

ఆమె అదిరిపడింది.

"మరేంలేదు. ఇది ఎ. సి. రూమ్‌కదా. తలుపుతీసి వుంటే చల్లదనం బయటకి పోతుంది. అందుకని..."

దుర్గ ఆమాత్రం కనీసపు తెలివితేటలు తనకి లేనందుకు సిగ్గుపడుతూ ఆయన తలుపు ముయ్యమనగానే మరేదో ఊహించుకున్నందుకు తననితాను నిందించుకుంటూ తలుపు మూసి లోపలికి వచ్చి ఆయనకి నమస్కరించింది. ఆయన హుందాగా తల పంకించి అడిగారు.

"నీ సర్టిఫికెట్ ఏదీ? "

ఆమె చేతిలోని కవరులోనుంచి తన సర్టిఫికెట్స్ తీసి అందించింది.

"నేను టెన్త్‌క్లాస్ పాసయ్యానండి. టైపు లోయర్ పూర్తి అయింది. హయ్యర్‌కి వెళ్తున్నాను" గబగబా చెప్పింది.

"ఏమిటి టెన్త్ క్లాసా? " నవ్వారాయన.

దుర్గ తల వంచుకుంది. తన విద్యార్హత లకి ఆ ఉద్యోగం రాదేమో. కానీ సదాశివం మాటలని బట్టి ఎమ్. పి. గారు తలచుకుంటే తనకి ఉద్యోగం వస్తుందనే ఆశ ఆమె నోరు తెరిపించింది.

"మీరు పెద్ద మనసుతో నాకీ ఉద్యోగం ఇప్పిస్తే..."

"ఈ ఉద్యోగానికి చదువు పెద్దగా అవసరం లేదులే" సర్టిఫికెట్లని పరిశీలించి అన్నారు.

"నీకు ఉద్యోగం వచ్చేసినట్టే దుర్గా"

ఆమె కళ్ళు కృతజ్ఞతతో కూడిన ఆనందంతో మెరిశాయి.

"మీ రుణం ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేనుసార్" అంది.

బయట చిరుజల్లుగా మొదలైన వర్షం ఉధృతమయింది.

★ ★ ★

ఉమెన్స్ కాలేజీ ప్రాంగణమంతా రంగు రంగుల దుస్తులు ధరించిన అమ్మాయిలతో విరబూసిన పూలతోటలా వుంది. కాలేజీ యానివర్సరీ హడావుడి అక్కడ పెళ్ళిసందడిని తలపిస్తోంది. ఆరోజు ఫంక్షన్‌కి ముఖ్య అతిథిగా ఆహ్వానితులైన హరిశ్చంద్రప్రసాద్ గారు సభాప్రాంగణంలోకి రాగానే కలకలం సద్దుమణిగి సూది కిందపడినా విన్పించేంత నిశ్శబ్దం అలుముకుందక్కడ. పచ్చని పసిమి ఛాయతో ఖద్దరు దుస్తులు ధరించి వున్న ఆయన కళ్ళు దయని, కరుణని వర్షిస్తున్నాయి. పెదవులపై చిరునవ్వు ఎదుటి మనుషుల కష్టాలని తను తీసుకుని తన సంతోషాన్ని వాళ్ళకి పంచుతానని భరోసా ఇస్తున్నట్టుంది.

సభ ప్రారంభమయింది. వేదికమీద హరిశ్చంద్రప్రసాద్ ఉపన్యసిస్తున్నారు.

"శక్తి స్వరూపిణిగా, జగజ్జననిగా కీర్తింపబడిన స్త్రీ అనాదిగా చీకట్లోనే మగ్గిపోతోంది. సృష్టిలో స్త్రీ పురుషులిద్దరూ సమానులే అని ఎందరు వాదించినా నాడు, నేడు మన సమాజంలో స్త్రీకి వున్న విలువ ఒక్కటే. స్త్రీ భోగవస్తువుగానే పరిగణింపబడుతోంది. అసలు సృష్టికర్తే స్త్రీకి అన్యాయం చేశాడు. శారీరకంగా దుర్బలురాలైన స్త్రీకి వెన్నలాంటి మనసుని అమర్చాడు. సాంప్రదాయాల పేరిట, కట్టుబాట్ల పేరిట ఈ స్వార్ధ సమాజం ఆమెని గుప్పిట్లో పెట్టుకుంది. రాజా రామమోహన్‌రాయ్, వీరేశలింగం పంతులు వంటి పుణ్యపురుషులు జన్మించిన ఈ గడ్డ మీద స్త్రీ వరకట్న దురాచారానికి బలవుతోంది. వితంతు పునర్వివాహాలు ప్రోత్సహింపబడాలన్న ఆ మహనీయుల ఆదర్శం ఆచరణలోకి రాలేకపోయింది.

"సంఘంలో వేళ్లూనిన ఈ దురాచారాలను రూపుమాపడానికి యువతరం నడుము కట్టుకోవాలి. ప్రతి స్త్రీ విద్యావంతురాలయి తన కాళ్ళమీద తను నిలబడగలిగినప్పుడు వరకట్న సమస్య వుండదు. కట్నం కోరే యువకుడిని పెళ్ళి చేసుకోడానికి ఏ యువతీ ముందుకు రాకూడదు.

"నేడు స్త్రీలు ఎన్నో రంగాలలో ముందంజ వేసి ఎన్నో ఉన్నత పదవులను అలంకరిస్తున్నారు. అయినా మన సమాజంలో స్త్రీకి రక్షణలేదు. స్త్రీలపై జరిగే అత్యాచారాలకి అంతులేకుండా పోతోంది.

యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః అన్నారు పెద్దలు.

స్త్రీ స్థితి మన సమాజంలో దయనీయంగా వుంది. స్త్రీ సౌందర్యానికి వెలకట్టి ఆమెని అంగడి బొమ్మనిచేసి వ్యాపారం చేస్తున్న దుశ్శాసనులున్న మన సమాజంలో విప్లవా

త్మకమైన మార్పు రావాలి. స్త్రీ అబలకాదు సబల అని రుజువు చేయాలి..."

ముందు వరుసలో కూర్చుని శ్రద్ధగా ఆయన ఉపన్యాసాన్ని వింటూ ఆయన్ని ఆరాధనగా, భక్తిగా చూస్తోంది ఒక యువతి. ఆమె పాలరాతి బొమ్మకి ప్రాణం వచ్చినట్టుంది. ఆమె చిరునవ్వు ప్రత్యూషంలా వుంది. పచ్చని చెంపలపై కర్ణాభరణములలోని కెంపుల కాంతులు ప్రతిఫలిస్తున్నాయి. వెన్నెల పొరలను వస్త్రాలుగా చుట్టుకున్న పసిడి బొమ్మలా వుందామె.

ఆమె పక్కనే కూర్చున్న సుజాత ఆమెని ఆరాధనగా చూస్తూ అంది.

"అంత గొప్ప వ్యక్తికి కూతురైనందుకు నిజంగా నువ్వు చాలా అదృష్టవంతురాలివే ప్రతిమా"

'నిజమే... తను అదృష్టవంతురాలు' మనస్ఫూర్తిగా అనుకుంది ప్రతిమ.



"ఎవరాయన? రాజకీయ నాయకుడా? ఆడవాళ్ళ ఓట్లన్నీ తనకే పడాలని కాబోలు స్త్రీ స్త్రీ అని గొంతు చించుకుంటున్నాడు" తన వెనక వరసలో కూర్చున్న ఒక అమ్మాయి పక్కన కూర్చున్న మరో అమ్మాయిని అడగడం ప్రతిమకి స్పష్టంగా వినిపించింది.

"హుష్! మెల్లిగా మాట్లాడు. నా క్లాస్‌మేట్ ప్రతిమావాళ్ళ నాన్నగారాయన."

"ఇంతకీ ఆయనెవరు? రాజకీయనాయకుడా? " మళ్ళీ అడిగిందామె.

"కాదు... పెద్ద కాంట్రాక్టర్. ఈ ఊళ్ళో ప్రియదర్శినీ అనాథ శరణాలయం ఆయన ఆధ్వర్యంలోనే నడుస్తోంది. ఎందరో అనాథలకి, ఆర్తులకి ఆశ్రయం ఇస్తున్న మహానుభావుడాయన" అంది.

వేదికమీద వందన సమర్పణ జరుగుతోంది.

కారు రాజప్రాసాదంలాంటి భవనం ముందు ఆగింది. ప్రతిమ, హరిశ్చంద్రప్రసాద్‌గారు కారు దిగగానే డ్రైవర్ పరుగున వచ్చి ఆమె చేతిలోని తాళాలను అందుకుని కారుని షెడ్‌లో పెట్టి వచ్చాడు.

ప్రతిమ చేతిలోని ఫ్లవర్‌బొకేని, పెద్ద పూలమాలని అందుకుంది పనిపిల్ల. అవి కాలేజీ వార్షికోత్సవ సభలో హరిశ్చంద్రప్రసాద్‌గారికిచ్చినవి.

"ఫ్రూట్ జ్యూస్ తెమ్మంటారా చిన్నమ్మగారూ? "

"వద్దుగానీ వేడిగా కాఫీ తీసుకురా" చెప్పి మేడ మెట్లెక్కింది. వరుసగా గదులు, ఒక్కొక్క గదిని గదిలోని అలంకరణని చూస్తే హరిశ్చంద్రప్రసాద్‌గారు ఎంత ధనవంతులో చెప్పచ్చు. ముఖ్యంగా ఆ ఇల్లు ఆయన కళాభిరుచికి దర్పణం పడుతోంది. ఆ మేడ ఎత్తైన సింహద్వారాలతో పాతకాలపు నగిషీలతో వున్న కిటికీలతో వున్నా లోపల అలంకరణ మాత్రం అధునాతనంగా వుంది. ఒకరకంగా చెప్పాలంటే ఆ భవంతి పాతకొత్తల మేలు కలయికలా వుంది.

ప్రతిమ కుడివైపు వున్న ఆ గదిముందు ఆగి కర్టెన్‌ని తొలగించి లోపలికి వెళ్ళింది. లోపల సోఫాలో దిండ్లకి ఆనుకుని కూర్చుని చేతులలోని పుస్తకాన్ని ఏకాగ్రతగా చదువుతోంది సుధేష్ణాదేవి.

ప్రతిమ పాదాలకి వున్న చిరుమువ్వల పట్టీల శబ్దంకానీ, 'అమ్మా' అని పిలిచిన ఆమె పిలుపుకానీ ఆవిడ ఏకాగ్రతని భగ్నం చెయ్యలేకపోయాయి. తల్లిని అలా

చూస్తున్న ప్రతిమలో ఒక చిలిపి ఆలోచన కలుగగా తల్లి వెనక్కి నడిచి రెండు చేతులతో ఆవిడ కళ్ళని మూసింది.

సుధేష్ణాదేవి ఉలిక్కిపడి అంతలోనే సర్దుకుని నవ్వుతూ ఆమె చేతులని విడిపించుకుంది.

"ఏమిటి ప్రీతీ ఈ అల్లరి? "

"పోమ్మా... నేను వచ్చి ఎంతసేపయిందో తెలుసా? " ప్రతిమ చిరుకోపంగా అంటూ తల్లిపక్కనే కూర్చుంది.

"ఈరోజు మా కాలేజీ యానివర్సరీ ఫంక్షన్‌లో నాన్నగారు ఎంత బాగా మాట్లాడారో నీకు చెబుదామని వస్తే నువ్వసలు పట్టించుకోనేలేదు"

"ఇది చాలా మంచిపుస్తకం. చదువుతుంటే పరిసరాలనే మర్చిపోయాను" ఆమె అలసటగా కనురెప్పలను రుద్దుకుని పుస్తకాన్ని మూసి అక్కడున్న టీపాయ్‌పై పెట్టింది.

"నాన్నగారు ఉపన్యాసంలో చెప్పిన విషయాలకంటే మంచి విషయాలున్నాయా ఆ పుస్తకంలో? అసలు ఆ ఫంక్షన్‌కి నువ్వు వస్తే బాగుండేది. నాన్నగారి ఉపన్యాసాన్ని విని చప్పట్లు కొట్టేదానివి. నువ్వు వింటావని రికార్డు చేయించాను" అంటూ ప్రతిమ టేప్ రికార్డర్‌లో కేసెట్‌ని పెట్టి ఆన్‌చేసింది.

"శక్తిస్వరూపిణిగా, జగజ్జననిగా కీర్తింపబడిన స్త్రీ అనాదిగా చీకట్లోనే మగ్గిపోతోంది. సృష్టిలో స్త్రీ పురుషులిద్దరూ సమానులే అని ఎందరు వాదించినా నాడు, నేడు మన సమాజంలో స్త్రీకి వున్న విలువ ఒక్కటే..."

సుధేష్ణాదేవి చప్పట్లు కొట్టడం మొదలుపెట్టింది. గది ప్రతిధ్వనించేలా టేప్‌రికార్డర్‌లో నుంచి వినవస్తున్న భర్త స్వరాన్ని అధిగమించి ఆమె చప్పట్లు చరుస్తోంది.

ప్రతిమ సంతోషంతో దీప్తివంతమైన ముఖంతో తల్లిని చూస్తూ అంది.

"ఇవాళ మా కాలేజీలో హాజరైన వందల మంది చేసిన కరతాళ ధ్వనులని నువ్వు విని వుంటే నాన్నగారి గొప్పదనం నీకు అర్థమైవుండేది"

"మీ నాన్నగారి గొప్పదనం నాకెప్పుడో అర్థమయింది ప్రీతీ" అంది సుధేష్ణాదేవి టేప్ రికార్డర్‌ని ఆపుచేస్తూ.

"నువ్వు పూర్తిగా విననిదే...? "

"మిగతాది నాకు తెలుసు ప్రీతీ! స్త్రీ సౌందర్యానికి వెలకట్టి ఆమెని అంగడిబొమ్మని చేసి వ్యాపారం చేస్తున్న దుశ్శాసనులున్న మన సమాజంలో విప్లవాత్మకమైన మార్పు రావాలి. అది వ్యక్తిపరంగా రావాలి. స్త్రీ అబలకాదు సబల అని రుజువు చేయాలి..."

"అరె! నాన్నగారి ఉపన్యాసాన్ని నువ్వు వినకపోయినా విన్నట్టే యధాతథంగా ఎలా చెప్పగలిగేవమ్మా? "

సుధేష్ణాదేవి చిరునవ్వు నవ్వింది. తనలో తను నవ్వుకుంటున్నట్టున్న సన్నని చిరునవ్వు. లోకం తెలియని పసిపాపని చూసి జీవితానుభవాలని, జీవితంలో ఎదురైన ఎదురుదెబ్బలని చవిచూసిన నవ్వు. పలుచని ఆమె పెదవులపై ఆ నవ్వు విరిగిన పాలలా కరిగిపోయింది.

"మరి నేను మీ నాన్నగారి అర్థాంగినికదా"

"కానీ నువ్వు అర్థాంగి అనే మాటకి పూర్తి న్యాయాన్ని చెయ్యలేదమ్మా. నువ్వు కూడా నాన్నగారితోపాటు సభలకి హాజరవ్వచ్చు కదా. ఘోషా స్త్రీలా ఎందుకిలా నాలుగు గోడలమధ్యా వుండిపోవడం. నిన్ను బయటకు రావద్దని నాన్నగారు ఆజ్ఞాపించారా? ఆయన అంత సంకుచిత మనస్కులని నేను అనుకోను"

"మీ నాన్నగారు ఎప్పుడూ నన్ను అలా ఆజ్ఞాపించలేదు ప్రీతీ! ఈ ఘోషా ఒకరకంగా నాకు నేనుగా విధించుకున్న శిక్ష!"

"ఎందుకని? " ప్రతిమ స్వరంలో నివ్వెరపాటు.

"నాకు ఒక వింత జబ్బు వుంది ప్రీతీ. ఒక మనిషి ముఖాన్ని చూస్తూ అతని

అంతర్ముఖాన్ని అంచనా వెయ్యడమే ఆ జబ్బు. చాలాసార్లు నా అంచనాలు తప్పుకా లేదు. నాలా ఆలోచించే ఏ మనిషీ ఎదుటి వ్యక్తిని గౌరవించలేడు. నేనూ అంతే. ఎవ రినీ గౌరవించలేను" ఆవిడ అక్కడనుంచి లేచి వెళ్ళిపోయింది.

ప్రతిమ అవాక్కయింది. 'తమ వంశంలో కట్టుబాట్లని తెంచుకుని, పరదాలను చీల్చు కుని బయటి ప్రపంచాన్ని చూస్తున్న మొదటి ఆడపిల్ల తను. తన తల్లి బాల్యం ఎలా గడిచిందో తనకి తెలియదు. కానీ ఆవిడ పెళ్ళయి అత్తవారింట్లో అడుగుపె ట్టాక మళ్ళీ వీధి గడప దాటలేదని చాలా మంది చెప్పుకోగా వింది. తల్లి అసూర్యంప శ్యగా పరదాలచాటున జీవితాన్ని గడపడా నికి కారణం ఇదా? ' ఆమె తల్లి వింత మన స్తత్వానికి ఆశ్చర్యపడింది.

★ ★ ★

"రవీ భోజనానికి రా" కాత్యాయని పెర ట్లోకి వచ్చి బిగ్గరగా పిలిచింది.

అవుట్ హౌస్‌లో కూర్చుని బాలగంగాధర తిలక్ 'అమృతం కురిసిన రాత్రి' చదువుతు న్నాడతను.

'అమృతం కురిసిన రాత్రి అందరూ నిద్ర పోతున్నారు... అలసి నిత్యజీవితంలో సొలసి...'

"రవీ!" మరింత బిగ్గరగా అసహనంగా వినిపించిన ఆ పిలుపుతో అతను ఉలిక్కిప డ్డాడు. పుస్తకం మూసి బయటికి వచ్చి అడి గాడు, "పిలిచారాండీ? "

"లేదు... అరిచాను" వ్యంగ్యంగా అంది.

"ఏం నాయనా? రెండుసార్లు పిలిచినా వినిపించలేదా? లోపల కూర్చుని ఏంచేస్తు న్నావు? "

"ఏదో పుస్తకం చదువుతున్నానండీ" సంజాయిషీ ఇస్తున్నట్టు మెల్లిగా అన్నాడు.

"పరీక్షకి చదువుతున్నట్లు లైటు వేసుకుని మరీ చదవాలా? ఈ నెల కరెంటుబిల్లు ఎంత వచ్చిందో తెలుసా? "

తప్పుచేసినవాడిలా తల దించుకున్నాడు.

"సరేలే... కంచం తెచ్చుకో. భోజనానికి రమ్మని వేరే పిలవాలా? " ముఖం చిట్లిస్తూ అంది.

రవి గభాల్న లోపలికి వెళ్ళి కంచం, గ్లాసు తెచ్చుకున్నాడు. వస్తూ అవుట్ హౌస్‌లో లైటార్పి మరీ వచ్చాడు.

వంటింటికి ఆనుకుని వున్న వసారాలో కంచం పెట్టుకుని కూర్చున్నాడు.

కాత్యాయని అన్నం, కూరా తెచ్చి కంచంలో ఎత్తిపడేసింది. రవి చల్లగా అయి సులా వున్న అన్నంలో అంతకంటే చల్లగా వున్న కూర కలిపి తినడం మొదలుపె ట్టాడు.

లోపలనుంచి ఆవిడ సణుగుడు వినిపి స్తోంది.

"దారినపోయే తద్దినాన్ని నెత్తికెక్కించుకు న్నాను. ధరలు చుక్కలనంటుతున్న ఈ రోజుల్లో ఒక మనిషిని నెలల తరబడి పోషించడం ఎంత కష్టం? "

తనకి అన్నం పెట్టడం వాళ్ళకి అదనపు ఖర్చని అతనికి తెలుసు. కానీ తన పరిస్థితి అలాంటిది. ఎమ్కాం డిస్టింక్షన్‌లో పాసైన తను ఉద్యోగ ప్రయత్నంలో విసిగి వేసారి పోతున్నాడు. ట్యూషన్లు చెప్పి సంపాది స్తున్న డబ్బు ఉద్యోగాలకి అప్లికేషను పంప డానికి, ఇంటర్వ్యూలకి హాజరవడానికి, తన కనీస అవసరాలకి సరిపోతోంది. కాత్యాయ నిగారు విసుక్కుంటూనో, బాధపడుతూనో ఈ అన్నమైనా పెట్టకపోతే తను పస్తులుం డవలసిందే.

"ఏం కావాలి? చారు పొయ్యనా? " కాత్యాయని వసారాలోకి వచ్చి అడిగింది.

"పొయ్యండి" అన్నాడతను మిగిలిన అన్నాన్ని ముందుకు లాక్కుంటూ.

ఆవిడ చారుపోసింది. అదీ ఫ్రిజ్ లోనుంచి తీసినదే. అతని భోజనం పూర్తవుతుండగా రామారావుగారు అక్కడికి వచ్చారు.

"రేపు కరెంటుబిల్లు కట్టాలి. బజారుకు వెళ్ళి సరుకులు తేవాలి. అలాగే బ్యాంకుకి వెళ్ళి డబ్బు పట్టుకురావాలి" అతను చెయ్య వలసిన పనుల జాబితాని చదివాడు.

"అలాగేనండి" అన్నాడతను కంచాన్ని ఎత్తి కుళాయి దగ్గరకి వెళ్తూ. కాత్యాయని ఇంట్లో అందరూ తినగా మిగిలిన కూర, అన్నం గిన్నెలని ఫ్రిజ్‌లో పెట్టింది. అది రోజూ జరిగే తతంగమే. రాత్రి మిగిలినవి మరునాడు మధ్యాహ్నం, మధ్యాహ్నం మిగిలినవి రాత్రికి రవికి వడ్డిస్తూంటుంది.

ఏడాది క్రిందట ఉద్యోగ ప్రయత్నం మీద ఆ ఊరికి వచ్చిన రవికి తమ అవుట్ హవుస్‌లో ఆశ్రయం ఇవ్వడానికి రామారావుగారు, కాత్యాయని సందేహించారు. ఇంట్లో పెళ్లీడు కొచ్చిన కూతురు వుండగా ముక్కూముఖం తెలియని వయసులో వున్న మగ పిల్లాడికి ఆశ్రయం ఇవ్వడమా అని సందేహించారు. కానీ స్వార్థం తప్పా ఒప్పా అనే వాళ్ల మీమాంసని జయించింది. పనిమనిషి ఇంటి పనులు చెయ్యడానికి వున్నా బజారు పనులు, బ్యాంకు పనులు లాంటివి రామారావుగారే చేసుకోవలసి వస్తోంది. నాలుగు రోజులు రవి పద్ధతి చూశాక అతనిలోని వినయ విధేయతలు, తప్పు పట్టడానికి వీల్లేని అతని ప్రవర్తనని గమనించాక ఆవిడ రవికి ఆశ్రయం ఇవ్వడంలోని లాభనష్టాలను బేరీజు వేసుకుంది. ఆ రకంగా అతను ఆ ఇంట్లో జీతం, బత్తెం లేని నౌకరుగా స్థిరపడ్డాడు.

కుళాయి దగ్గర కంచం, గ్లాసు కడుక్కుని అవుట్ హవుస్‌లోకి వచ్చిన రవి కేండిల్ వెలిగించి ఆ మసక వెలుతురులో తిరిగి పుస్తకాన్ని చదవడం మొదలుపెట్టాడు.

'అలసి నిత్య జీవితంలో సొలసి సుషుప్తి చెందారు. అలవాటునీ అస్వతంత్రతనీ కావలించుకున్నారు. అధైర్యంతో తమలో తాము ముడుచుకుపోయి పడుకున్నారు'

అతను తన్మయత్వంతో చదువుతున్నాడు.

★ ★ ★

ప్రియదర్శినీ అనాథ శరణాలయం. భోజనాల సమయం. వంటశాల దగ్గరున్న అరుగులమీద రెండు పెద్ద పెద్ద డేగిశాలలో అన్నం, సాంబారు వున్నాయి. అక్కడ క్యూలో నిలబడి వున్న వృద్ధులు, పిల్లలు... అందరి చేతులలో పళ్లేలున్నాయి. వాళ్ల కడుపులో కరకరమంటున్న ఆకలి కళ్లలో కనిపిస్తోంది. ఇద్దరు ఆయాలు పెద్ద గరిటలతో అన్నం, సాంబారు పళ్లేలలో వడ్డిస్తున్నారు. క్యూ మెల్లిగా కదులుతోంది.

"రోజూ వట్టి సాంబారన్నమేనా? కూర కోసం ముఖం వాచి పోయాము" అన్నాడొక వృద్ధుడు.

"నాకు ఆశ్రమానికీ నా కొడుకు ఇంటికీ పెద్ద తేడా ఏం కనిపించదు. అక్కడా పులుసన్నమే. ఇక్కడా పులుసన్నమే"

"వాళ్ల దయాధర్మం. కన్న పిల్లల చీదరింపులు పడలేక ఇక్కడ కొచ్చాం. వీళ్లు ఏది పెడితే అది తినాలి" అన్నాడు వృద్ధాప్యంలో అడుగు పెడుతున్న మరొకతను.

"ఏయ్ ముసలాడా! ఏమిటా పెళ్లి నడక? త్వరగా నడు," అదిలించాడు ఆశ్రమం మేనేజరు సదాశివం. యాభై ఏళ్ల వయసుంటుందతనికి. తెల్లటి పైజామా లాల్చీ ధరించి నుదుట ఎర్రటి కుంకుమ బొట్టుతో సాత్వికుడిలా కనిపించే అతని మాట మాత్రం కరుగ్గా వుంటుంది. ఆ వృద్ధుడు త్వరగా అడుగులు ముందుకేశాడు.

పన్నెండేళ్ల తులసి, పదేళ్ల రమ కంచాలలో సాంబారన్నం తెచ్చుకుని చెట్టు కింద కూర్చుని తింటున్నారు. తులసి అయిష్టంగానే అన్నం తింటోంది. "ఇక్కడైతే రోజూ సాంబారు, అన్నం తింటున్నాను కాని మా అమ్మ రోజుకో రకం కూర చేసి, మీగడపెరుగుతో అన్నం పెట్టేది"

"మీ అమ్మ చాలా మంచిది. మా అమ్మా మంచిదే. కాని మా పిన్నమ్మ మంచిది కాదు. నాకెప్పుడూ చద్దన్నమే పెట్టేది" అంది రమ.

# ఏరినముత్యాలు

- నీకిష్టమైనదేదో అది సాధించే ప్రయత్నం చేయి. లేకుంటే నీకు లభించిన దానితో తృప్తిపడు.

  – బెర్నార్డ్‌షా

- నిరాశ నిస్పృహలకు లోనుకాకుండా ప్రయత్నం కొనసాగిస్తే మనం ఏ పనైన సాధించగలం.

  – హెలెన్‌కెల్లర్

- నీలో ఉన్న శక్తిని నీవు తెల్సుకున్నప్పుడే గమ్యం చేరగలవు. ముందు నీ గురించి నీవే పరిశోధించుకో.

  – రామకృష్ణ పరమహంస

- మోసాలన్నింటిలోకీ ఆత్మ వంచనను మించిన మోసం మరొకటి లేదు. అదే అధమాధమం.

  – గోథె

- మీకు వీలయినంత వరకూ ఎప్పుడూ చిరునవ్వులు చిందిస్తూ ఉండండి. అదే సరైన ఔషధం.

  – బైరన్

- మనిషి వ్యక్తిత్వం అతని హోదాని బట్టికాక ప్రవర్తనుబట్టి తెలుస్తుంది.

  – కె.జానియస్

- దీపం తాను వెలుగుతూ ఉండకపోతే మరో దీపాన్ని వెలిగించలేదు.

  – చైనాసామెత

- తననుతాను జయించుకొనగల వ్యక్తి అన్నిటినీ జయించగలడు.

  – లాటిన్‌సూక్తి

- కష్టాలను చాలామంది ఎదుర్కొనగలరు. కానీ ద్వేషాన్ని ఎక్కువమంది తట్టుకోలేరు.

  – పుల్లర్

- శీలసంపద వుండి, జ్ఞానం లోపించినవాడు కడు బలహీనుడు. గుణవంతుడు కాని జ్ఞాని ప్రమాదభరితుడు.

  – స్వామి రామదాసు

- మనిషి తానొక పులిని వేటాడి చంపడం గొప్ప క్రీడగా చెప్పుకుంటాడు. అదే ఒక పులి తనను చంపబోతే అది భీభత్సంగా చిత్రిస్తాడు.

  – జార్జిబెర్నార్డ్‌షా

- తాత్కాలిక భద్రత కోసం స్వేచ్ఛను కుదువబెట్టేవారు భద్రతకూ అనర్హులే, స్వేచ్ఛకూ అనర్హులే.

  – లింకన్

సేకరణ: పద్మావతి

"అవును. మా అమ్మ చాలా మంచిది. మా నాన్న కూడా చాలా మంచివాడు. నాకు ఐస్‌క్రీమ్ కొని పెట్టేవాడు"

"మరి నువ్వీ ఆశ్రమానికెందుకొచ్చావ్? మా అమ్మలాగే మీ అమ్మ కూడా చచ్చిపోయిందా? మీ నాన్న ఇంకో పెళ్లి చేసుకున్నాడా? "

"మా అమ్మానాన్నలిద్దరూ చచ్చిపోయారు. రైలు ప్రమాదంలో మేము ఎక్కిన బోగీ తలక్రిందులయిపోయింది. నేను ఒక్కర్తినే బతికాను"

"మరి మీ తాతయ్య వాళ్లు నిన్ను తీసుకెళ్ల లేదా? "

"వాళ్లెవరూ మమ్మల్ని చూడ్డానికి రారు. మా నాన్న వాళ్లతో గొడవపడి ఇంట్లోంచి వచ్చేశాడుట. అందుకని. వాళ్లేగాని నన్ను వాళ్లింటికి తీసుకెళ్తే హాయిగా వుండేదాన్ని. మీగడ పెరుగు, హల్వా, రసగుల్లా అన్నీ తినేదాన్ని"

తులసి మాటలని వింటున్న రమ నోట్లో లాలాజలం అపరిమితంగా వూరిపోతోంది. వాళ్ల సంభాషణని వింటున్న సదాశివం నోట్లో కూడా లాలాజలం వూరుతోంది. అయితే తులసి చెబుతున్న పదార్థాల లిస్టు విని మాత్రం కాదు.

★ ★ ★

"నీ పేరు తులసి కదూ? " అడిగాడు సదాశివం.

"అవునంకుల్!"

"నీకు ఎన్నేళ్లు? "

"పన్నెండు"

"కాదు పదహారు" ఆమె గుండెలవైపు చూస్తూ అన్నాడు.

"కాదు పన్నెండే అంకుల్. నా డేట్ ఆఫ్ బర్త్ 1991 జూలై 6"

"పాప వయసు పన్నెండు, పరువం చూస్తే పదహారు" అని నవ్వేడు.

తులసికి అతనేమంటున్నాడో అర్థం కాలేదు.

"నిన్న అన్నం తింటూ రమతో ఏం మాట్లాడుతున్నావ్? "

తులసి భయంగా చూసింది. 'తను రోజూ సాంబారన్నమే అనడం అంకుల్ విని వుంటాడా? '

"నీకు ఇక్కడ భోజనం నచ్చలేదా? "

"నచ్చింది"

"రసగుల్లా, ఐస్‌క్రీమ్, హల్వా అన్నీ తినాలని వుందా? " గబగబా తల వూపింది.

"నేను కొని పెడతాను నీకు" తులసి కళ్లు మెరిశాయి.

"పాపం! రమకి కూడా అమ్మలేదు. మా ఇద్దరికీ కొని పెడతారా? "

"రమ కూడా నీ అంత పెద్దయ్యాక కొని పెడతాను" నవ్వేడు. అతను అలా చీటికీ మాటికీ నవ్వడం ఆమెకెందుకో నచ్చలేదు.

"రేపు సాయంకాలం నువ్వొక్కర్తివీ నా ఆఫీసు రూమ్‌కి రా. నేను నీకు స్వీటు పెడతానన్న విషయం ఎవరికీ చెప్పకే? "

"చెప్పను"

"చెప్పావంటే నీకు హల్వా కాదు, గరిట కాల్చి వాత పెడతాను"

"చెప్పను. ప్రామిస్ అంకుల్" భయంగా చూసింది. "వెళ్లు" అన్నాడు.

తులసి పరిగెట్టింది.

★ ★ ★

పోలీసు అధికారులకి,

నమస్కారం. నేను చనిపోయాక నా మృతదేహాన్ని పోస్ట్‌మార్టమ్ కోసం తీసుకెళ్తారని, నా శరీరాన్ని ముక్కలు చేసి నా చావుకి కారణాన్ని అన్వేషిస్తారని నాకు తెలుసు. కానీ మీరు నా శరీరాన్ని ముక్కలు చేసినా నా చావుకి అసలైన కారకులెవరో తెలుసుకోలేరు. అందుకే నా ఆత్మహత్య వెనుకవున్న కథని మీ దృష్టికి తెస్తున్నాను.

పెళ్లయిన రెండు నెలలకే విధవనై దురదృష్టజాతకురాలిగా అత్తింటి వారిచేత

పుట్టింటి వారి చేత కూడా నిందింపబడి అందరూ వుండి కూడా ఎవరూ లేని దానన్నై అనాథ శరణాలయంలో చేరాను. అది నాలాంటి అనాథలెందరికో చల్లని నీడనిచ్చే వటవృక్షమని భ్రమపడ్డాను. కాని అది అనాథ శరణాలయం కాదు ఆడ మాంసం అమ్మే అంగడి అని తెలుసుకునేప్పటికే ఆలస్యమయింది. ఆ అంగడిలో కన్నెపిల్లలు బంగారు బాతులు. కన్యాత్వ పరీక్ష జరిపాక కన్య అని డాక్టరు సర్టిఫికెట్ ఇచ్చిన అమ్మాయిలని వాళ్లు వెన్నపెట్టి పోషిస్తారు. పెళ్లయినా మగతనం లేని మగాడికి లోకం దృష్టిలో భార్యనైన నేనూ కన్యనే. ఆ శరణాలయపు అధికారి అయిన హరిశ్చంద్రప్రసాద్ నన్ను ఆర్ అనే అక్షరంతో మొదలయ్యే పేరు గల ఒక రాజకీయ నాయకుడికి ఒక రాత్రికి కానుకగా పంపి తన వ్యాపారాన్ని విస్తృతం చేసుకున్నాడు. తరువాత నేను చాలా మంది ఆకలి తీర్చవలసి వచ్చింది.

నా అందాన్ని ఎందరో ఆస్వాదించారు. ప్రతిఫలంగా భయంకరమైన రోగాలని నాకు అంటగట్టారు. నేను ఎయిడ్స్ వ్యాధిగ్రస్తురాలినని వైద్య పరీక్షలలో బయటపడగానే నన్ను శరణాలయం నుంచి తరిమేశారు. నాలో బతకాలనే ఆశ, బతుకుపై తీపి లేవు. వ్యాధి నన్ను మృత్యుకోరలలోకి నెట్టేసే ముందు నేనే మృత్యువుని ఆహ్వానించదలచుకున్నాను. అందుకే ఆత్మహత్య చేసుకుంటున్నాను. నా చివరి కోరిక ఒక్కటే. ఈ సంఘంలో ఆదర్శం ముసుగులో కుహనా సంస్కర్తగా నటిస్తున్న హరిశ్చంద్ర ప్రసాద్ నిజ స్వరూపాన్ని బయటపెట్టండి. మరే అభాగ్యురాలికీ నాకు పట్టిన దుర్గతి పట్టకూడదు.

సుమతి

పోలీస్ ఇన్‌స్పెక్టర్ విజయ్ ఆ ఉత్తరాన్ని చదవడం పూర్తిచేసి మడిచి జేబులో పెట్టుకున్నాడు. అరగంట తరువాత అతని మోటార్ సైకిల్ డి.ఎస్.పీ ఆఫీసు ముందు ఆగింది.

★ ★ ★

డి.యస్.పి ఓబుల్‌రెడ్డి విజయ్ తనకి అందించిన ఆ ఉత్తరాన్ని చదివాడు. ఆయన ముఖంలో రంగులు మారుతున్నాయి. చదవడం పూర్తయ్యాక ఆ ఉత్తరాన్ని పేపర్‌వెయిట్ కింద పెట్టి తల ఎత్తాడు.

"ఎవరీ సుమతి? "

"వేశ్య అని ఆమె ఉత్తరంలో రాసింది కదా సార్!"

"అవును. కానీ అనాథశరణాలయంలో చేరకముందు తను పతివ్రతనని, హరిశ్చంద్రప్రసాద్‌గారు తనని వేశ్యగా మార్చారని రాసింది చూడు, అది మాత్రం అబద్ధం. కల్పన. ఈ ముండలంతా బయట అనేక చేతులు మారి, రోగాలంటించుకుని ఆఖరిదశలో శరణాలయంలో చేరేవాళ్లే. మధ్య హరిశ్చంద్రప్రసాద్ గారిని ఇరికించడం ఘోరం కదూ? పుణ్యానికి పోతే పాపం ఎదురయినట్టు ఆయన జాలితో ఆశ్రయం ఇస్తే ఆయనకే ఎసరు పెట్టింది. బాడీని పోస్ట్‌మార్టమ్‌కి తీసుకెళ్లారా? "

"ఎస్ సార్!"

"హరిశ్చంద్రప్రసాద్ గారిని అన్‌పాప్యులర్ చెయ్యడానికి అది ప్లాన్ వేసింది. కేసు క్లోజ్ చేసెయ్యి"

విజయ్ కళ్లముందు సుమతి మృతదేహం మెదులుతోంది. శవంలో కూడా అంత అందాన్ని, ముఖంలో అమాయకత్వాన్ని చూడడం అతనికదే ప్రథమం.

"కానీ..." అతనేదో చెప్పబోయాడు.

"నోమోర్ ఆర్గ్యుమెంట్స్"

"యస్ సర్!" విజయ్ సెల్యూట్ చేసి బయటకి వచ్చాడు. అతని మనసంతా చేదు తిన్నట్టుంది.

సుమతి శరణాలయాన్ని గురించి అబద్ధం రాయలేదు అని అతనికి బలంగా అనిపించ సాగింది. ఒక సత్యం సజీవంగా సమాధి

అయిపోతున్నప్పుడు కలిగే బాధ అది. విజయ్ బయటకి వెళ్లగానే డి.ఎస్.పి సుమతి రాసిన ఉత్తరాన్ని సిగర్‌లైటర్ వెలిగించి కాల్చేశాడు. తరువాత ఫోన్ ఎత్తి నంబర్ డయల్ చేసి అవతల హరిశ్చంద్ర ప్రసాద్ లైన్‌లోకి రాగానే విషయం చెప్పాడు.

"ఆ ఉత్తరం మీ దగ్గర ఉందా?" ఏమాత్రం కంగారు లేకుండా అతి మామూలుగా అడిగాడాయన.

"కాల్చేశాను సార్!"

"గుడ్! మీ ఋణం తీర్చుకునే అవకాశం ఇవ్వండి. మీరే పార్టీ కావాలంటే అది ఇస్తాను"

డి.ఎస్.పి ఓబుల్‌రెడ్డి తనకే పార్టీ కావాలో చెప్పాడు.

"యువార్ మోస్ట్ వెల్‌కమ్ సార్"

"థాంక్యూ!" డి.ఎస్.పి ఫోన్ పెట్టేశాడు.

★ ★ ★

హరిశ్చంద్రప్రసాద్ అప్పటికి మూడో రౌండ్‌లో ఉన్నాడు. వెచ్చని ద్రవం గొంతులోకి జారి నరాలలో నిషాని నింపుతోంది. చలికాలం. రాత్రి పదకొండు గంటల సమయంలో ఆ మత్తుని మించి మరేదో కావాలనిపిస్తోంది. ఆయన ఖాళీ గ్లాసుని టీపాయ్ మీద పెట్టి భార్య గదివైపు నడిచాడు. దగ్గరగా వేసి ఉన్న తలుపులు తొయ్యగానే తెరుచుకున్నాయి.

గదిలో మంచంమీద సుధేష్ణాదేవి నిద్రపోతోంది. అందమైన ముఖం, నాజూకైన శరీరంతో నలభై అయిదేళ్ల ఆవిడ ముప్పై ఏళ్లదానిలా వుంది. పాదాలకి వున్న బంగారు పట్టీలు పచ్చని ఆమె శరీరచ్ఛాయ ముందు వెలవెలబోతున్నాయి. భార్యని ఒక క్షణం పరిశీలనగా చూసిన ఆయన కళ్లలో కాంక్షతో కూడిన ఎర్రజీర మెరిసింది. ఆయన అమాంతం భార్యపై పడ్డాడు.

అదిరిపడి కళ్లు విప్పిందామె. ముక్కుపుటాలని బద్దలు కొడుతున్న ఆల్కహాల్ వాసన, ఎర్రజీరలలుముకున్న కళ్లతో ఆకలిగొన్న పులిలా తన పైకి లంఘించిన భర్తని చూసి ఆమెలోని అణువణువూ తిరస్కార భావంతో ఎదురు తిరిగింది. ఒంట్లోని శక్తినంతటినీ చేతులలోకి తెచ్చుకుని బలంగా ఆయన్ని తోసేసి అదే ఊపుతో మంచందిగి దూరంగా నిలబడింది. హరిశ్చంద్ర తూలిపడబోయి నిగ్రహించుకున్నాడు.

"నేను నీ మొగుడినే! ఎవరో పరాయి వాడొచ్చి నిన్ను రేప్ చెయ్యబోయినట్టు నన్ను తోసేస్తావా? ఎంత పొగరే నీకు?" మండిపడుతూ చెయ్యెత్తి బలంగా ఆమె చెంపపై కొట్టాడు.

సుధేష్ణ సూటిగా ఆయన కళ్లలోకి ఒక క్షణం చూసి నవ్వింది. ఆ నవ్వులోని తిరస్కారానికి ఆయన మరింత మండిపడ్డాడు. ఆ నవ్వు తనని అపహాస్యం చేస్తున్నట్టు రెచ్చిపోయాడు. మళ్లీ చెయ్యెత్తి రెండో చెంపపై కొట్టాడు.

బాధకి కళ్లలో నీళ్లు తిరిగినా విరగబడి నవ్వింది. ఆ నవ్వు చూసిన ఆయనకేదో జంకుగా అనిపించింది. విసురుగా గది బయటకి వెళ్లిపోయాడు. కొన్ని నిముషాల తరువాత కింద కారు స్టార్టయిన శబ్దం వినిపించింది. ఆయన అంత రాత్రివేళ ఎక్కడకి వెళ్తాడో ఆవిడకి తెలుసు.

ఆమె చెంపలు మండిపోతున్నాయి. అంతకు మించి ఆమె మనసు మండిపోతోంది. కొద్దిసేపటి కిందట భర్త అన్న మాటలు గుర్తుకొచ్చాయి.

"ఎవరో పరాయివాడు నిన్ను రేప్ చెయ్యబోతున్నట్టు తోసేస్తావా?"

రేప్! అవును. పెళ్లయిన రెండవ రోజే భర్త చేత రేప్ చెయ్యబడిన దురదృష్టవంతురాలు తను!

ఆమెకి తన మొదటి రాత్రి గుర్తుకొచ్చింది. 'ఆ రాత్రి ఏదో తెలియని భయం, సిగ్గు సంకోచాలతో ఉద్విగ్నతతో సన్నగా కంపిస్తున్న తనని గదిలో వదిలి అమ్మల

# సచిత్ర విచిత్రం



## సూపర్ సోరెన్!

ఆ గెద్ద పేరు సోరెన్. బరువు 3 కిలోలు. ఆస్ట్రేలియాకు చెందినది. అది రెక్కలు పూర్తిగా విప్పితే 6 అడుగుల విస్తీర్ణం ఉంటుంది. ఈ మహా గెద్దగారిని బ్రిస్‌బేన్ నగరపు కార్పొరేషన్‌వారు పెంచుతున్నారు. ఆ కార్పొరేషన్లో పని చేసే అనేక మంది ఉద్యోగులతో పాటు సోరెన్ కూడా ఓ ఉద్యోగి.

రోజూ కార్పొరేషన్ ఆఫీస్ చుట్టూ, నగరంలోని కూడలి ప్రదేశాల్లో, పార్కులలో అనేక రకాల పక్షులు చేరి పౌరులకు అనేక ఇబ్బందులు కలిగిస్తున్నాయి. వాటి బెడద తప్పించడం కొరకు కార్పొరేషన్ వారు సోరెన్‌ను నియమించారు. అది రోజూ నగరంలో సంచరిస్తూ, పక్షులను తరిమివేస్తూ ఉంటుంది. సోరెన్ ఆ నగరానికి వచ్చే యాత్రీకులకు ఓ చిత్రమైన ఆకర్షణయింది. పిల్లలు దానిపట్ల ఎంతో మక్కువ కనపరుస్తున్నారు. ఆ గెద్దకు పిల్లలంటే చాలా ఇష్టం. వారికి ఏ అపకారం చెయ్యదు. ఓ బాలుడు సోరెన్ ముందు నిలబడి నవ్వులు గుమ్మరిస్తున్నాడు.

క్కలు బయటకి వెళ్లిపోయారు. గుండెవేగం అమాంతం పెరిగిపోయి చాలాసేపు తలవం చుకుని నిలబడి తనని సమీపించబోయే భర్తకోసం తన భుజంపై అతని సున్నిత మైన చేతివేళ్ల స్పర్శ కోసం నిరీక్షించింది. క్షణాలు నిముషాలుగా మారి కరిగిపో తున్నా అతను తన దగ్గరకి రాకపోవడంతో ధైర్యం తెచ్చుకుని తల ఎత్తి చూసింది. గదిలో అతను లేడు. అర్ధరాత్రి కావస్తున్నా అతను రాలేదు. అంతవరకు మొదటిరాత్రిని ఎలా ఎదుర్కోవాలా అని భయపడిన ఆమెకి మొదటిరాత్రే భర్త గదిలోకి రాకపో వడంతో నిరాశతో కూడిన భయం వేసింది. సిక్స్త్ సెన్స్ ప్రేరేపణతో మెల్లిగా గదిలో నుంచి బయటకి వచ్చి బెడ్‌రూమ్‌కి ఆను కుని వున్న వరండాలో నిలబడింది. అంతా నిశ్శబ్దంగా వుంది. అత్తవారింట్లో అందరూ గాఢనిద్రలో వున్నారు. 'అతను ఎందుకు రాలేదు? తనంటే ఇష్టంలేదా?' ఆలోచి స్తోంది.

అప్పుడు వినిపించాయి సన్నగా నవ్వులు. ఆ నవ్వులు పక్కగదిలో నుంచే వినిపిస్తు న్నాయని అర్థమైన ఆమె ఏదో తెలియని కుతూహలంతో సవ్వడి కాకుండా నడుస్తూ ఆ గది కిటికీ దగ్గరకి చేరుకుంది. బెడ్‌లైటు కాంతిలో లోపలవున్న ఆ ఇద్దరూ స్పష్టంగా కనిపిస్తున్నారు.

భర్త చేతులలో కరిగిపోతోంది ఆ ఇంటి పనిమనిషి!

"అయ్యగారూ! ఇంక వెళ్లండి. ఇవాళ మీ మొదటిరాత్రి. అమ్మగారు మీకోసం ఎదురు చూస్తుంటారు" అంటోందామె.

"పెళ్లాం ఎక్కడికెళ్తుందే పిచ్చిదానా? జీవి తాంతం నాకాళ్ల దగ్గరే పడివుంటుంది" అంటున్నాడతను.

ఆమె మనసు, తనువు ఆ క్షణమే గడ్డక ట్టుకుపోయాయి. గదిలోకి ఎలా వచ్చిందో ఆమెకే తెలియదు. కన్నీళ్లు రావడంలేదు. దుఃఖం కంటే బాధాకరమైన స్థితి ఆమెది.

'పెళ్లాం ఎక్కడికెళ్తుంది? జీవితాంతం నా కాళ్ల దగ్గరే పడివుంటుంది' అన్న భర్త మాటలతో ఆ ఇంట్లో తన స్థానమేమిటో తెలిసింది.

చెయ్యెత్తి వేలికి వున్న వజ్రపుటుంగరాన్ని చూసుకుంది. వజ్రం మింగి చచ్చిపోదామను కుంది. కాని ప్రాణంపై తీపి, బతుకుపై ఆశ ఆమెని ఆ పని చెయ్యనివ్వలేదు. పల్లెటూ రిలో పుట్టి పెరిగిన సుధేష్ణకి మగవాళ్లు భార్య వుండగానే మరో స్త్రీతో సంబంధం పెట్టుకోడం తెలుసు. ఆడవాళ్లు భర్తని మార్చే ప్రయత్నాలు చెయ్యడమూ తెలుసు. తను భర్తని మార్చుకోలేదా? ఆమెకి నాయనమ్మ ఇచ్చిన పతివ్రతల కథల పుస్త కంలో సతీసుమతి కథ గుర్తుకొచ్చింది. కుష్టురోగి అయిన భర్తని వేశ్య దగ్గరకి తీసు కెళ్లి పతివ్రతగా కీర్తింపబడింది సుమతి. తను స్త్రీ వ్యామోహంతో గుడ్డివాడైన భర్తని ఏకపత్నీవ్రతుడుగా మార్చుకోగలదు. అలా అనుకోగానే ఆమెకేదో ఊరట కలిగింది. ఆత్మ విశ్వాసం, భర్తలో మార్పు వస్తుందనే నమ్మకం ఆమెని ఆత్మహత్యా ప్రయత్నం నుంచి విరమింపచేశాయి.

మరునాడు రాత్రి ముత్తైదువలు ఆమెని అలంకరించి గదిలోకి పంపారు. హరిశ్చంద్ర గదిలోనే వున్నాడు. గది మధ్యగా నిలబడిపో యిన ఆమెని ఒక్కంగలో సమీపించి అమాంతం బాహువుల మధ్య బంధించాడు. ఆమె మనశ్శరీరాలు అతని స్పర్శతో అత్తిపత్తి ఆకులా ముడుచుకుపోయాయి. మగవాళ్లు మొదటిరాత్రి లాలనతో ప్రేమతో భార్యని దగ్గరకి తీసుకుంటారని పుస్తకాలలో చదివింది. అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్న భర్తపై తిరస్కార భావం కలిగింది. తన భర్తకి తను మొదటి స్త్రీ కాదు అనే వేదన ఆమె మనసుని మెలితిప్పుతోంది. ఆమె ప్రతి ఘటించబోయి చేతకాక నిస్సహాయురాల యింది. ఆమె మనసేమిటో తెలుసుకోకుండా అతను ఆమె శరీరంతో ఆడుకున్నాడు.



చతుర... 19

భార్యాభర్తలమధ్య కూడా రేప్ జరుగుతుందని ఏదో పుస్తకంలో చదివింది. అది తనకే అనుభవంలోకి వచ్చేప్పటికి ఆమె మనసు చితికి కన్నీరై స్రవించింది. ఆమె మనోభావాలని పట్టించుకోకుండా అతను పక్కకి తిరిగి పడుకున్నాడు.

ఇష్టంలేని సెక్స్ రేప్‌తో సమానం. తర్వాత చాలాసార్లు ఆమె భర్తవలన రేప్‌కి గురయింది. భర్తలో మార్పు తీసుకురావడానికి ఆమె చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. అతనిలోని స్త్రీ వ్యామోహం గడ్డిమొక్క కాదని, వేళ్ళూనిన మహావృక్షమని గ్రహించి ఆమె తన దురదృష్టానికి బాధపడటం మినహా ఏమీ చెయ్యలేకపోయింది. ఇద్దరు పిల్లలు పుట్టినా భర్త ధోరణిలో మార్పు రాకపోవడంతో పిల్లలపై అతని ప్రభావం పడకుండా జాగ్రత్త పడింది. వాళ్ళకి తెలిసిన తండ్రి ఒక ఆదర్శపురుషుడు, అనాథసేవా తత్పరుడు. అంతే! మానసికంగా అతనికి దగ్గర కాలేకపోయిన ఆమె శారీరకంగా అతనికి దూరమయిపోయింది. గదులు వేరయ్యాయి. ఆమెకి పుస్తకాలే ప్రపంచమయ్యాయి.

చాలా ఏళ్ళ తర్వాత భర్త స్పర్శతో తను అపవిత్రమయ్యాననే భావనతో ఆమె ఆ చలిరాత్రి తలారా స్నానంచేసి వచ్చింది. బెడ్‌రూమ్ తలుపు గడియపెట్టుకోకుండా భర్త తన గదిలోకి రావడానికి అవకాశం ఇచ్చినందుకు తననితాను నిందించుకుంది.

"రవీ! నువ్వు చలం మ్యూజింగ్స్ చదవాలనుకుంటున్నావు కదూ? " సుజాత అడగగానే అతను "అవును" అన్నాడు.

"నా దగ్గర వుంది" ఆమె చేతిలోని పుస్తకాన్ని అతనికి చూపించింది.

రవి కళ్ళలో వెలుగు "ఒకసారి ఇస్తారా? తిరగేసి ఇస్తాను" అన్నాడు.

"తిరగెయ్యడమేమిటి? చదివాక ఇవ్వు" అంటూ అతనికి ఆ పుస్తకాన్ని అందించింది.

"థాంక్యూ" అతను ఆ పుస్తకాన్ని అపురూపమైన పెన్నిధిలా చూస్తున్నాడు.

"ఏమైనా రాస్తున్నావా? "

"కథ రాస్తున్నాను, ఇంకా పూర్తికాలేదు"

"నేనూ రాస్తున్నాను. కానీ ముగింపు ఎలా రాయాలో తోచడంలేదు. స్క్రిప్టు నీకిస్తాను. చదివి ముగింపు ఎలా రాస్తే బాగుంటుందో చెప్పవా ప్లీజ్" చేతిలోని కాగితాలను ముందుకి జాపుతూ అడిగింది.



"అలాగేనండీ, చదువుతాను"

"ఎల్లుండి పోస్ట్‌లో పత్రికకి పంపుతాను. రేపటికల్లా ఇవ్వగలవా? "

"అలాగేనండీ"

సుజాత ఇంట్లోకి వెళ్ళిపోయింది. రవి అవుట్ హౌస్‌లోకి వెళ్ళి చాపమీద కూర్చుని, సుజాత రాసిన కథని చదవడం మొదలుపెట్టాడు.

నాలుగు వాక్యాలని చదవగానే అతనికి అర్థమయిపోయింది. సుజాతలో రాయాలనే తపన వుంది తప్ప రాయడం చేతకాదని. వాక్య నిర్మాణం సరిగ్గాలేదు. పైగా ఆమె ఎంచుకున్న ఇతివృత్తం బడుగుజీవుల జీవితాలకి సంబంధించినది. భూస్వామి చేతిలో మోసపోయిన పాలేరు కథ అది. అతను అసంపూర్తిగావున్న ఆ కథ చదువుతుండ

గానే ఆ కథని ఎలా ముగిస్తే బాగుంటుందో తెలిసింది. భావాలు కెరటాల్లా వస్తుంటే అతను పేపర్లు, పెన్ను తీసుకుని ఆ కథని మొదటినుంచి రాయడం మొదలుపెట్టాడు. గంట తర్వాత పెన్ను పక్కనపెట్టి వేళ్ళు విరుచుకుని రాసిన దాన్ని చదవడం మొదలుపెట్టాడు.

నవమాసాలుమోసి రక్తం చిందించి కన్న బిడ్డని, తన రక్తంలో రక్తమైన ప్రాణిని ఈ భూమి మీదకి తీసుకొచ్చిన స్త్రీ ఎంత అపురూపంగా చూసుకుంటుందో అంత అపురూపంగా చూస్తున్నాడా కథని.

తను ఆ కథకి న్యాయమైన ముగింపే ఇచ్చానని సంతృప్తితో అతని మనసు నిండిపోయింది. పేపర్లని బొత్తిగా పెట్టి సుజాతకిచ్చి వచ్చి చలం మ్యూజింగ్స్ చదవడం మొదలుపెట్టాడు.

★ ★ ★

మరునాడు సాయంకాలం తులసిని రహస్యంగా పిలిచాడు సదాశివం. అతని చేతిలోని స్వీట్ పేకెట్టుని చూడగానే ఆమె కళ్లు మెరిశాయి.

"ఇదుగో హల్వా, తిను" అన్నాడు. ఆమె ఆత్రంగా అందుకుంది.

"ఇదంతా నాకు ఒక్కర్తికేనా? "

"నేను కొంచెం తిననా? "

"తినండి అంకుల్"

"నీకోసమే తెచ్చాను. నువ్వు తిను. నాకు వద్దు"

తులసి పేకెట్టు విప్పి తింటోంది. అమ్మని చూసినంత ఆనందం. అమ్మ చేత్తో పెట్టిన రుచి గుర్తుకొచ్చింది. కళ్లల్లో తడి. చాలా రోజుల తర్వాత తనకిష్టమైన హల్వాని తింటున్న తృప్తి.

రెండే రెండు నిముషాలలో పావుకేజీ హల్వాని తిని, వేళ్ళకొసలకంటినదాన్ని నాకింది. సదాశివం ఆమె పెదవి అంచుని వేలితో తాకాడు.

"ఇక్కడ హల్వా అంటుకుంది"

తులసి అరచేతిని తిరగేసి పెదవులని తుడుచుకుంది.

"మీరు చాలా మంచివారంకుల్? మిమ్మల్ని చూస్తే మా నాన్న గుర్తువస్తున్నాడు"

"నాన్నా" అతనిముఖం ఆముదం తాగినట్టయింది. "గుర్తుకొస్తే గుర్తొచ్చాడుకాని, నన్ను మాత్రం నువ్వు అంకుల్ అనే పిలువు. అంటే నేను నీకు మామయ్య నన్నమాట. సరేనా? "

"సరే అంకుల్"

"గుడ్ గర్ల్! మరి నేను నీకిష్టమైన హల్వా తెచ్చిపెట్టాను కదా, నాకు ముద్దియ్యి"

తులసికి తండ్రి గుర్తొచ్చాడు. ఆయన తనకిష్టమైన స్వీట్లు, బొమ్మలు తెచ్చినప్పుడు 'మా నాన్న మంచివాడు' అని తను ఆయన బుగ్గపై ముద్దుపెట్టుకోవడం గుర్తువచ్చింది. ఆమె చప్పున వంగి సదాశివం బుగ్గపై ముద్దుపెట్టుకుంది. అతను అలవోకగా చేతిని ఆమె గుండెలకి తాకించాడు.

తులసికి ఇబ్బందిగా అనిపించి, చప్పున వెనక్కి జరిగింది. "నేను వెళ్తానంకుల్"

"రేపు రాత్రి అన్నం తిన్నాక రా. నీకోసం రసగుల్లా స్పెషల్‌గా చెయ్యమని షాపు వాడికి ఆర్డర్ చేసివచ్చాను"

"థాంక్యూ అంకుల్" అని వెళ్ళిపోయింది. ఆ రాత్రి తులసి కలల్లో మాయాబజారు సినిమాలోలాగ గుండిగలతో రకరకాల పిండి వంటలు ఘుమఘుమలాడుతూ నోరూరిస్తూ కనిపించాయి. సదాశివం అంకుల్ ప్రేమగా తనకి వడ్డిస్తున్నాడు. కడుపునిండా తినమని కొసరి కొసరి వడ్డిస్తున్నాడు.

★ ★ ★

పోస్ట్‌లో వచ్చిన ఆ కవరుని విప్పి చదివిన సుజాత ముఖం విప్పారింది. ఆనందాతిరేకంతో, "అమ్మా" అని అరుస్తూ వంటింట్లోకి వెళ్ళింది. వంటచేస్తున్న కాత్యాయని కూతురి సంతోషాన్ని విచిత్రంగా చూస్తూ

"ఏమిటిది? నీచేతిలో ఏమిటాకవరు? " అని అడిగింది.

"కథల పోటీలో నా కథకి ఫస్ట్ ప్రైజు వచ్చిందమ్మా"

"ఏమిటి నిజంగానే? " ఆవిడ సంభ్రమంతో ఉక్కిరిబిక్కిరయింది.

"నిజం. కావాలంటే పత్రికవాళ్ళు రాసిన ఉత్తరాన్ని చదువు" చేతిలోని ఉత్తరాన్ని అదించింది.

"మీ 'బాకీ' కథకి ప్రథమ బహుమతి లభించింది. బహుమతి మొత్తం మూడు వేల రూపాయలు. కథని ప్రచురించిన వెంటనే పంపగలము" ఉత్తరాన్ని చదివిన ఆవిడ కూతురి బుగ్గలను పుణికింది 'నాతల్లే' అంటూ.

"నేనెప్పుడు కథ రాద్దామని మొదలెట్టినా ఎందుకాపిచ్చి రాతలు? చదువుకో అంటూం డేదానివిగా? ఇప్పుడా పిచ్చిరాతలకే మొదటి బహుమతి వచ్చింది" చిరుకోపంగా తల్లిని చూస్తూ అంది సుజాత.

"తప్పే తల్లీ! నా కూతురు ఇంత పెద్ద రచయిత్రి అని తెలియక ఏదో వాగాను" మురిపెంగా కూతుర్ని చూస్తూ అందావిడ.

పెరట్లో బోరింగ్ దగ్గరనుంచి నీళ్ల తెస్తున్న రవితో సంబరంగా చెప్పింది.

"రవీ! నా కథకి ఫస్ట్ ప్రైజ్ వచ్చింది"

"కంగ్రాచ్యులేషన్సండీ" చిరునవ్వుతో అన్నాడు.

"నేను కాలేజీకి వెళ్ళొస్తాను, త్వరగా అయినదేదో పెట్టియ్యి"

"పొద్దుట ఒంట్లో బాగాలేదు, కాలేజీకి వెళ్ళనన్నావుకదా"

"ఇప్పుడు మనం చాలా సంతోషంగా వున్నాము. ఆ సంతోషాన్ని నా ఫ్రెండ్స్‌తో పంచుకోవాలి" సుజాత బాత్‌రూమ్‌లోకి నడిచింది.

అరగంటలో తయారయి చేతిలో పుస్తకాలతో బయలుదేరింది. పత్రికనుంచి తనకి వచ్చిన ఉత్తరాన్ని పర్సులో పెట్టుకోవడం మరచిపోలేదు. ఆమె కాలేజీకి వెళ్ళేసరికి లంచ్ బెల్లయింది. లంచ్ తింటున్న మోహిని, రూప, ప్రతిమ, విశాల ఆమెని చూసి కోరస్‌గా "సుస్వాగతం" అన్నారు.

"ప్రొద్దుట క్లాసులు డుమ్మా కొట్టి మార్నింగ్ షోకి వెళ్ళి వచ్చావా? " రూప అడిగింది.

"లేదు, ఇంట్లోనే వున్నాను. మీకో శుభవార్త" అంది వూరిస్తున్నట్టు.

"ఏమిటది? నీపెళ్ళి కుదిరిందా? " విశాల అడిగింది.

"ఛట్! నోర్మూయ్యండే" నవ్వుతూనే విసుక్కుంది.

"ఏమో, పొద్దుట కాలేజీకి రాలేదంటే పెళ్ళిచూపులు జరిగి వుంటాయి. శుభవార్త చెబుతానన్నావు. అంటే ఆ చూపులు ఫలించి పెళ్ళి కుదిరిందనుకుంటున్నాం" మోహిని అంది.

"మీకెంతసేపూ పెళ్ళి గొడవేనా? నేను చెప్పబోయే గుడ్ న్యూస్ విని మీ కళ్ళు తిరుగుతాయేమో? "

"అంత కళ్ళు తిరిగే వార్తా? " ప్రతిమ సాగదీసింది.

"అవును"

"అయితే త్వరగా చెప్పు మరి. ఎవరికైనా కళ్ళు తిరిగితే ముఖంమీద జల్లడానికి నా దగ్గర పెద్ద వాటర్ బాటిల్‌నిండా నీళ్ళున్నాయి"

"కథల పోటీలలో నా కథకి ఫస్ట్ ప్రయిజ్ వచ్చింది"

"వావ్! కంగ్రాచ్యులేషన్స్. హార్టీ కంగ్రాచ్యులేషన్స్"

అభినందనలతో అందరూ ఆమెని ఉక్కిరిబిక్కిరి చేశారు.

"గుడ్‌న్యూస్ చెప్పి ఊరుకోవడమేనా? పార్టీ ఇచ్చేదేమైనా ఉందా? " రూప వేళాకోళంగా అడిగింది.

"పత్రికనుంచి రెమ్యూనరేషన్ రానివ్వండి"

"ఓహో! ఈ కథ నా స్వంతమేగానీ దేనికీ అనువాదం, అనుసరణ కాదని పత్రికవారి కిచ్చే హామీ పత్రంలాగే ఈ పార్టీ ఇచ్చేది నా స్వార్జితమైన డబ్బుతోనే... మా నాన్నగారిని అడిగినదో లేక మా అమ్మగారి పోపుల డబ్బాలోంచి కొట్టేసినదో కాదని రుజువు చేస్తా వన్నమాట"

గొల్లున నవ్వులు.

సుజాతకి ఎవరేమని ఆటపట్టించినా కోపం రానంత సంతోషంగా ఉంది మనసు.

బెల్ మోగడంతో అందరూ క్లాసులకి వెళ్లారు.

సంతోషంతో దీప్తిమంతంగా ఉన్న సుజాత ముఖాన్ని చూస్తూ లెక్చరర్ అడిగింది "ఏమిటి సుజాతా! చాలా సంతోషంగా ఉన్నట్టున్నావే. శుభవార్త చెబుతావా? "

"యస్ మేడమ్!" అంటూ పర్సులోంచి తనకి పత్రికలవాళ్లు రాసిన ఉత్తరాన్ని తీసి ఆవిడకిచ్చింది.

లెక్చరర్ ఆ ఉత్తరాన్ని చదివి సంభ్రమంతో తలమునకలయి "కంగ్రాచ్యులేషన్స్ సుజాతా!" అంటూ ఆ విషయాన్ని క్లాసు అంతటికీ ఎనౌన్స్ చేసింది.

"మీ సహవిద్యార్థిని అయిన సుజాత రచయిత్రిగా ఆంధ్ర పాఠకలోకానికి పరిచయం కావడానికి చేసిన తొలి ప్రయత్నంలోనే అనూహ్యమైన విజయాన్ని సాధించింది. టి.వి. ఛానెల్స్ వెల్లువలో పత్రికలు కొట్టుకుపోయి పుస్తకాలు చదివే పాఠకులు దాదాపు కనుమరుగయిపోతున్న ఈరోజులలో ఒక ప్రముఖ పత్రిక కథల పోటీని పెట్టడం విశేషమైతే సుజాత రాసిన కథకి మొదటి బహుమతి రావడం అపూర్వం. ఆమెకి నా హృదయపూర్వక అభినందనలు. గివ్ హర్ ఎ బిగ్ హేండ్" అనగానే క్లాసంతా కరతాళధ్వనులు చేశారు.

"ఈ సందర్భంలో నేను సుజాతని మరో కథని రాసి మన కాలేజీ మేగజైన్‌కి ఇమ్మని అడుగుతున్నాను"

"ష్యూర్ మేడమ్" అంది చిరునవ్వుతో.

ఆమె కథకి బహుమతి వచ్చిన విషయం దాదాపు కాలేజీలో అందరికీ తెలిసిపోయింది. ప్రిన్సిపాల్, లెక్చరర్లు ఆమెని ప్రత్యేకంగా అభినందించారు.

తనొక అగ్రశ్రేణి రచయిత్రి అయిపోయినట్టు తన కథలని సినిమాలుగా తీస్తామని నిర్మాతలు తమ ఇంటిముందు కార్లేసుకుని క్యూ కట్టినట్టు ఆ రాత్రి కలలొచ్చాయి సుజాతకి.

★ ★ ★

భోజనం చేస్తున్న తులసితో చెప్పింది ఆయా.

"అన్నం తిన్నాక మేనేజరుబాబు నిన్ను ఆఫీసురూమ్‌కి రమ్మన్నారు"

నిన్న తిన్న హల్వా గుర్తుకొచ్చి తులసి నోట్లో నీళ్ళూరాయి. గబగబ రెండు ముద్దలు తిని చెయ్యి కడుక్కుని పరిగెట్టింది.

"అన్నం తిన్నావా? " ఆప్యాయంగా అడిగాడు సదాశివం.

"తిన్నానంకుల్"

"గుడ్" నవ్వాడు. ఆమె కళ్ళు అక్కడ టేబిల్ మీద ఆత్రంగా వెతకడం గమనించి మనసులోనే నవ్వుకున్నాడు.

"నీకిష్టమైన రసగుల్లా మరోగంటలో తెచ్చి పెడతానన్నాడు షాపువాడు. రాత్రి అందరూ పడుకున్నాక నువ్వు ఒక్కర్తివీ ఇక్కడికి వచ్చెయ్యి"

"అలాగే అంకుల్"

"సరే వెళ్ళు"

తులసి మెల్లిగా బయటకివచ్చి అక్కడ నుంచి పరిగెట్టుకుంటూ రమ దగ్గరకి వెళ్ళింది.

"అంకుల్ ఎందుకు పిలిచారు? " రమ అడిగింది.

"ఏమీలేదు, ఊరికేనే" అంది. రాత్రి అందరూ నిద్రకి ఉపక్రమిస్తుండగా సదా

శివం ఆఫీసు గదికి వెళ్ళింది.

"రా తులసీ! నువ్విక్కడకి వస్తున్నట్టు ఎవరికీ చెప్పలేదు కదా"

"లేదంకుల్! కానీ రమకి కూడా స్వీటంటే ఇష్టమే. ఒక్కటి... ఒక్కటంటే ఒక్కటి దానికీ పెడతాను"

"నీకు జాలి ఎక్కువనుకుంటానేం? రమకి నువ్వు స్వీటు పెడితే అది గీతకి పెడతానం టుంది. గీత మరో అమ్మాయికి... అప్పుడు నేను స్వీటుకాదు స్వీటుషాపునే ఇక్కడకి తీసుకురావాలి, వద్దుగాని నువ్వే తిను" చేతి లోని పెద్ద కప్పుని అందించాడు. అందులో నాలుగు తెల్లని బంతుల్లాంటి రసగుల్లాలు పాకంలో తేలుతూ నోరూరిస్తున్నాయి.

ఆమె ఆత్రంగా చెంచాతో ఒకదాన్ని ముక్కచేసి నోట్లో పెట్టుకుంది. జిహ్వ లేచి వచ్చింది.

మరచిపోయిన రుచి, మరుగునపడిన జ్ఞాపకాలు ఒక్కసారిగా నిద్రలేచాయి.

"అమ్మ తను స్కూలునుంచి రాగానే టిఫిన్‌తోబాటు రసగుల్లా పెట్టేది"

"ఏమిటి ఆలోచిస్తున్నావ్? స్వీటు బాగా లేదా? "

"మా అమ్మ గుర్తు వచ్చిందంకుల్" ఆమె కళ్ళలో తడి.

"ఇప్పుడు కుళాయి తిప్పకు, తిను"

ఆమె తినసాగింది. సదాశివం ఆమెనే చూస్తున్నాడు. అతని చూపు ఎక్కడుందో గమనించని ఆమె తృప్తిగా తింటోంది.

"నీకు రసగుల్లా అంత ఇష్టమా? " నాలుగు నిముషాలలో నాలుగూ తిన్న ఆ అమ్మాయిని చూస్తూ అడిగాడు.

తులసి సిగ్గుపడింది.

"నీకు రసగుల్లా ఎంత ఇష్టమో, నాకు నువ్వంటే అంత ఇష్టం. నాకు నువ్వు రస గుల్లావి" అతని చూపులలోని మార్పు ఆమెకి అర్థంకాలేదు.

"నీకు ఇష్టమైన స్వీటు పెట్టాను కదా! మరి నాకు ముద్దుపెట్టు"

తులసి ఈసారి సంకోచించలేదు. వంగి అతని చెంపపై ముద్దుపెట్టింది. ఆమెని అలాగే కదలనివ్వకుండా పట్టుకున్నాడు. అతని చేతులు తన శరీరంపై ఎక్కడెక్కడో తాకుతుంటే ఆమెకి కంపరంగా వుంది.

"వదలండి అంకుల్! వెళ్ళిపోతాను"

"వెళ్దువుగానిలే! ఒకగంట ఆగు"

ఆమె అతని భల్లూకపు పట్టునుంచి తప్పించుకోలేకపోతోంది. భయం, కంపరం, అసహ్యం. అతను తనని అలా ముట్టుకోవడం తప్పని తెలుసు. 'నవ్వుతూ మాట్లాడి తనకి ష్టమైన స్వీటు తినిపించిన అంకుల్ ఇప్పు డిలా ప్రవర్తిస్తున్నాడేమిటి? '

"వదలండి అంకుల్" అంటున్న ఆమె పెదాలని అతని బండ పెదవులు బలంగా మూసేశాయి.

నెప్పి, బాధ, అసహ్యం, ఏమవుతోందో తెలియని అయోమయం... తులసి కన్యాత్వం కోల్పోయిందనడానికి చీకటే సాక్ష్యం.

ఆకలి తీరిన మృగంలా లేచాడు సదా శివం. "నిజంగా రసగుల్లాలాగే వున్నావు. నిన్ను ఈ రాత్రి వదలాలనిలేదు, చచ్చిపోతా వని వదిలిపెడుతున్నాను. రేపు రాత్రి ఇదే టైముకి రా" అతని స్వరం కర్కశంగా వుంది.

"నేను రాను" ఉక్రోషంగా అంది. "ఛ! మీరు మంచివారుకాదు. మీరిలా చేస్తారని తెలిస్తే, నేనసలు మీ దగ్గరకి వచ్చేదాన్ని కాదు. మీతో అసలు మాట్లాడేదాన్నికాదు"

"నేను మంచివాడినికాను. కాని, నువ్వు మాత్రం చాలా మంచిదానివి. నేను నిన్ను ఇలా చేశానని ఎవరికీ చెప్పకేం? "

"అందరికీ చెబుతాను. మీరు బాడ్ అని అందరికీ చెబుతాను"

"చంపేస్తాను" తొడపాశం పెడుతూ అన్నాడు.

"అబ్బా" గిలగిలలాడింది.

"చెప్తే గేటు దగ్గరవుండే వాచ్‌మేన్ చేత

కూడా నిన్నిలాగే చేయిస్తాను"

తులసికి వాచ్‌మేన్ గుర్తువచ్చాడు. ఆర డుగుల ఎత్తు, పోతపోసిన కంచు విగ్రహం లాంటి శరీరం, గారపట్టిన పళ్ళు, ఎర్రటి కళ్ళు, స్ఫోటకం మచ్చలతోనిండిన ముఖం... వణికిపోయింది.

"నేను నిన్ను ఇలా చేశానని ఎవరితోనైనా చెప్పినా, రేపు రాత్రి నా దగ్గరకి రాకపోయినా, నిన్ను వాడికి అప్పగిస్తాను, జాగ్రత్త' ' బెదిరింపుగా అన్నాడు.

తులసి కళ్ళలో నీళ్ళు కమ్ముకొస్తున్నాయి. అసహాయత, భయం, ఆగ్రహం, ఆవేదన కలగలిసిన భావం ముఖంలో ద్యోతకమవుతుండగా దీనంగా అంది.

"వస్తానంకుల్! కాని, రేపు నన్నేం చెయ్యకండి. నాకు స్వీటు కూడా వద్దు"

"రేపు నిన్నేం చెయ్యద్దా? రేప్ కూడా చెయ్యద్దా? " తోడేలులా చూస్తూ నవ్వాడు.

తులసికి రేప్ అనేమాట ఎక్కడో విన్న గుర్తువచ్చింది. అమ్మ నాన్నలతో తను చూసిన సినిమాలో విలన్ హీరోయిన్‌ని పట్టుకుని బలవంతంగా బట్టలు ఊడదియ్యబోతుంటే హీరో వచ్చి విలన్‌ని కొట్టి హీరోయిన్‌ని రక్షిస్తాడు. "ఎందుకమ్మా హీరో విలన్‌ని కొడుతున్నాడు" అని తనడిగితే "హీరోయిన్‌ని వాడు రేప్ చేయబోయాడు అది చెడ్డపనికదా" అంది అమ్మ.

"రేప్ అంటే? " అని అడిగింది తను. కానీ అమ్మ చెప్పలేదు.

అంకుల్ కూడా తన బట్టలు ఊడదీసి ఎక్కడెక్కడో ముట్టుకున్నాడు తనని. రేప్ అంటే ఇదేనా? తులసి సిగ్గుతో, అవమానంతో ఏడుస్తోంది.

"బట్టలు తొడుక్కుని వెళ్ళి పడుకోపో! ఎవర్ికైనా చెప్తే ఏంచేస్తానో గుర్తుందిగా? రేపు ఇదే టైముకి రా"

తులసికి అంతసేపూ తను అతనికెదురుగా నగ్నంగా వున్నానని స్ఫురించి ప్రాణం పోయినట్టయింది. ఆమె బట్టలు తొడుక్కుని అక్కడనుంచి పరుగుతీసింది.

★ ★ ★

రవి వారపత్రికలో ప్రచురింపబడిన ఆ కథని చదువుతున్నాడు. మొదటి వాక్యం చదవగానే అతనికి అర్థమైపోయింది అది తను రాసిన కథేనని, సుజాత ఒక్క అక్షరం కూడా మార్చలేదని. కేవలం ఇతివృత్తం మాత్రమే ఆమెది, ముగింపు ఎలా రాయాలో తెలియని అసంపూర్తి చిత్రమది. ఆ చిత్రానికి తనెన్ని రంగులద్దాడు? తన కథకి పత్రికవాళ్ళు మొదటి బహుమతినిచ్చారు. కాని రచయితగా తనపేరు లేదు. ఆ రచనకి వచ్చే కీర్తి, డబ్బు తనవి కావు. తనలాంటి వాళ్లని ఏమంటారు? 'ఘోస్ట్‌రైటర్'. అతనికి బాధగావుంది. 'సుజాత తన అసహాయతని, పరాధీనతని ఎంత నాజూగ్గా కేష్ చేసుకుంది? ' అతనికి తనమీద తనకే జాలివేసింది.

తలుపు చప్పుడయింది. అతను తలుపు తెరిచాడు. సుజాత.

"మేగజైన్ ఇస్తావా? " చెయ్యిజాపింది.

"కథ చాలా బాగుంది. వన్స్ ఎగైన్ కంగ్రాట్స్" మేగజైన్‌ని ఆమెకి అందిస్తూ అన్నాడు.

"థాంక్యూ! నువ్వు నేను రాసిన కథని దిద్దిపెట్టకపోతే నాకు ప్రైజ్ వచ్చేదే కాదు"

రవి చిరునవ్వు నవ్వాడు.

అప్పుడు అందించిందామె తనచేతిలోని కాగితాలని.

"కాలేజీ మేగజైన్‌కి నన్ను ఒక కథ రాయమని మా మేడమ్ అడిగారు. మొదలుపెట్టాను, కాని పెన్ను ముందుకి కదలడం లేదు. మనసులోని భావాలకి అక్షరరూపం ఇవ్వలేకపోతున్నాను"

"బాగా పుస్తకాలు చదవండి, కష్టపడండి"

"ఏంచదువో ఏమిటో! లైబ్రరీలో మెంబర్‌షిప్ వుందికాని తెచ్చిన పుస్తకాలను చదివే ఓపికే లేదు. ఈ ఒక్క ఏడాది కష్టపడితే

డిగ్రీ చేతికొస్తుంది. తరువాత చదవడం మొదలుపెడతాను"

నవ్వాడు రవి. "ముందు చదువు, తరువాతే రచన అనుకుంటే కొన్నాళ్లు రచన ఆపండి"

"అమ్మో! అది నావల్లకాదు. మొదటి కథకే ఫస్ట్‌ప్రైజ్ రావడంతో మా కాలేజీలో నన్నెంత ఎడ్మైరింగ్‌గా చూస్తున్నారో తెలుసా? ఇప్పుడు నేను అస్త్రసన్యాసం చేస్తే నన్ను సులువుగా మరచిపోతారు.



ఈ ఒక్క కథని చదివి, లోపాలని సరిదిద్దవా ప్లీజ్"

రవి ఆమె అందించిన కాగితాలని చూశాడు. ఒక పేజీలో సినాప్సిస్ రాసింది. ఇతివృత్తమేమిటో అర్థమయింది. ఆమె కోరినట్లు దిద్దడానికి ఆమె కథ రాస్తేగా? ఒక్క పేరా రాసిందంతే. ఆ ఒక్క పేరాలోనే పది దిద్దుబాట్లు, డజను కొట్టివేతలు

"సరే" అన్నాడు.

"రేపటికల్లా పూర్తవ్వాలి"

"అలాగేనండి"

"థాంక్యూ స్టోమచ్" ఆమె వెళ్లిపోయింది.

రవి అవుట్ హౌస్‌లోకి వచ్చి కూర్చు న్నాడు. ఇతివృత్తాన్ని మరోసారి చదివాడు. పదినిముషాలు కళ్ళు మూసుకుని యోగిలా కూర్చున్నాడు. తరువాత పెన్ను తీసి రాయడం మొదలుపెట్టాడు. పెన్ను ఎత్త కుండా నిర్విరామంగా రాసి గంటలో కథ రాయడం పూర్తిచేశాడు. తను రాసిన దాన్ని చదివాడు. కథంతా బాగా వచ్చిందికాని, ముగింపు నచ్చలేదు. ముగింపు రాసిన కాగి తాన్ని తీసి చూశాడు. ఆలోచిస్తూ కథ రాసిన కాగితాలను ఒక పాత మేగజైన్‌లో పెట్టి తల దువ్వుకుని బయటికి వచ్చాడు.

"ఒకసారి లైబ్రరీకి వెళ్ళొస్తానండి" పెరటి గుమ్మంలో కూర్చుని కూర తరుగుతున్న కాత్యాయనితో చెప్పాడు. ఆవిడ ముఖం చిట్లించింది.

"మొక్కలకి నీళ్ళు పోశావా?" అతనికి ఆశాభంగమయింది. ఎప్పుడో తప్ప లైబ్రరీకి వెళ్ళే అవకాశం దొరకదతనికి. పొద్దుట అయిదుగంటలనుంచి ఏడు గంటలవరకు ట్యూషన్స్ చెబుతాడు. అదయ్యాక కాత్యా యనికి నీళ్ళు పట్టివ్వడం, బాయిలర్ వెలిగిం చడం వగైరా పనులు. తర్వాత బజారుకి వెళ్ళి సరుకులు తేవడం, కరెంటుబిల్లు, ఫోన్ బిల్లు కట్టడం, బ్యాంకుపని. సాయంకాల మైనా వెళ్దామంటే కాత్యాయని తను జీతా నికి కుదుర్చుకున్న నౌకరు పని ఎగ్గొట్టి సిని మాకి వెళ్తున్నంత తీవ్రంగా చూస్తుంది. మొక్కలకి నీళ్ళు పొయ్యాలని, పెరట్లో సన్న జాజి పందిరికి పూలు కొయ్యాలని అప్పుడే ఆవిడకి గుర్తు వస్తుంది.

అక్కడే వున్న సుజాత చప్పున కలుగచేసు కుంది.

"రవిని వెళ్ళనియ్యి. మొక్కలకి నీళ్ళు నేను పోస్తాలే" అంది సుజాత.

ఆమె అలా అనడానికి కారణం అతనిపై జాలికాదు. అతని చేతిలోని పాత మేగజైన్ లోని కాగితాలని చూసి. అవి తన కోసం అతను రాస్తున్న కథ అని ఆమెకి తెలుసు.

"నువ్వు ఇంట్లో పనులు చేస్తూ కూర్చుంటే ఎప్పుడు చదువుకుంటావే?" అంది కాత్యా యని. అక్కడకి ఒక్క నిముషం కూడా ఆమెకి చదువుకోడానికి తీరిక లేదన్నట్టు.

"మొక్కలకి నీళ్ళు రోజంతా పొయ్య నుగా?" అంది రవిని వెళ్ళమన్నట్టు సైగ చేస్తూ.

మరో నిమిషం అక్కడే వుంటే కాత్యాయని ఇంకేం పనులు పురమాయి స్తుందో అని రవి వడివడిగా గేటు దాటాడు. వున్నట్టుండి కూతురికి రవిపై అంత జాలి ఎందుకు కలిగిందా అని ఆలో చిస్తున్న కాత్యాయనికి ఏదో తట్టి గుండె గుభేల్‌మంది.

"ఏమిటి కథ? వున్నట్టుండి వాడిపై అంత జాలి పుట్టికొచ్చింది? కొంపదీసి వాడిని ప్రేమిస్తున్నావా?" అనుమానంగా చూస్తూ అడిగింది.

"ప్రేమా? అందంగా వున్నాడు కదా అని అతగాడిని ప్రేమిస్తే నేను ఎవరింట్లోనో వంటలక్కగా చేరాలి. నాకు కథ రాసిపెడ తానన్నాడు"

"నీకు రవి కథ రాసిపెట్టడమేమిటి? నువ్వు రాసుకోలేవా?" ఆశ్చర్యంగా అడి గింది.

"కథ నాదే! కాని ఎలా రాయాలో అర్థం కావడంలేదు. అందుకని అతనికి లైబ్రరీ బుక్స్ ఎరవేసి కథ రాయించాను"

"అంటే! మొన్న బహుమతి వచ్చిన కథ"

"అతను రాసినదే"

"ఛ! తప్పు కాదుటే! అతను రాసిన కథని నువ్వు రాసినట్టు పత్రికకి పంపడం"

"తప్పు లేదు. పప్పు లేదు. పెద్ద పెద్ద రచయితలకే ఘోస్ట్ రైటర్స్ వుంటారు?"

"నిజమా?"

"నూటికి నూరుపాళ్ళు నిజం"

"పోవే! ఇంతకీ నీకు పేరు వచ్చే యోగం వుంది. రవే కనుక ఆ కథ తన పేరుతో

పంపితే ఖచ్చితంగా తిరిగివచ్చేది. అసలే నష్టజాతకుడు. తల్లీ తండ్రీ లేరు. వున్న ఒక్కగానొక్క చెల్లెలు పెళ్ళయిన కొన్ని నెలలకే విధవ అయింది. పేరుకి ఎమ్‌కామ్ ప్యాసయినా ఉద్యోగం సద్యోగం లేదు. ఇంక వాడి బతుకు మన ఇంట్లో, ఆ చెల్లెలి బతుకు అనాథ శరణాలయంలోను తెల్లవారిపోవలసిందే" నిరసనగా అంది.

నిజంగా రవే కనుక కథలు రాస్తే అగ్రశ్రేణి రచయితలలో ఒకడుగా పేరు తెచ్చుకునేవాడని ఆ మూర్ఖురాలికి తెలియదు.

★ ★ ★

రవి లైబ్రరీలో ఒకపక్కగా కూర్చుని వున్నాడు. అతని చేతులలో ఆవాళ్టి దినపత్రిక వుంది. దాంట్లోని వాంటెడ్ కాలమ్స్‌ని చూస్తున్నాడతను. తన అర్హతలకి తగిన ఉద్యోగ ప్రకటన కనిపిస్తే వివరాలను కాగితంపై రాసుకుంటున్నాడు. తరువాత దినపత్రికని లైబ్రేరియన్‌కి ఇచ్చి పుస్తకాలున్న రేక్‌లవైపు నడిచాడు. వారం కిందట లైబ్రరీకి వచ్చినప్పుడు కొంతవరకు చదివిన శ్రీశ్రీ మహా ప్రస్థానం పుస్తకం కోసం వెతుకుతున్నాడతను. చేతిలోని మేగజైన్‌ని ఒక పక్కన పెట్టి తనకి కావలసిన ఆ పుస్తకం కోసం లైబ్రేరియన్‌ని అడగడానికి వెళ్ళాడు. అదే సమయంలో ప్రతిమ అక్కడికి వచ్చింది. శరత్ 'దేవదాసు' నవల కోసం వెతుకుతోందామె. ఆమె చెయ్యి తగిలి ఆ పాత మేగజైన్ కింద పడింది. ఆమె వంగి దాన్ని తీసి యథాస్థానంలో ఉంచబోతుండగా దానిలోని కాగితాలు కిందపడి ఫ్యాను గాలికి చెల్లాచెదురుగా పడ్డాయి.

'అరె!' అనుకుంటూ ఆమె వాటిని ఏరి బొత్తిగా పెట్టింది. యథాలాపంగా వాటివైపు చూసిన ఆమె కళ్ళు వెడల్పయ్యాయి. అది ఎవరో రాసిన కథ తాలూకు మ్యాన్‌స్క్రిప్ట్ అని తెలియగానే ఆమె కుతూహలంగా చదవడం మొదలుపెట్టింది. పరిసరాలను మరచిపోయి కథలో లీనమయిపోయింది. పది పేజీలున్న ఆ కథని చదవడానికి ఆమెకి అయిదు నిమిషాలు పైగానే పట్టింది. అసంపూర్తిగా వున్న ఆ కథ ఆమెలో అసంతృప్తిని కలిగించింది. రచయిత ఆ కథనెలా ముగించదలచుకున్నాడా అనే ఆసక్తి, అసలా రచయిత ఎవరా అనే కుతూహలం. ఆమె చుట్టూచూసింది. అక్కడ కాస్త దూరంలో రాక్ దగ్గర దేనికోసమో వెతుకుతున్న ఒక యువకుడు ఆమె దృష్టిలో పడ్డాడు.

కాగితాలని మేగజైన్‌లో పెట్టి అతని దగ్గరకి నడిచింది.

"ఎక్స్క్యూజ్ మి"

"ఎస్!" తల తిప్పి చూశాడతను.

"మీరు దేనికోసమో వెతుకుతున్నట్టున్నారు? "

"అవునండి. ఇక్కడొక మేగజైన్ బాగా పాతదే అనుకోండి, పెట్టి మరచిపోయాను. దాంట్లో కొన్ని ముఖ్యమైన కాగితాలున్నాయి"

"ఇదేనా? " చేతిలోని పత్రికని అతని ముందుకి జాపింది.

అతని ముఖంలో రిలీఫ్. "థ్యాంక్ యూ!"

"వెల్ కమ్" చిరునవ్వుతో అంది.

అతను ముందుకి సాగిపోయాడు. ప్రతిమ అతన్నే చూస్తూ నిలబడిపోయింది. ఒక రచయిత రాసిన కథనో, నవలనో అచ్చులో చదవడం వేరు. స్క్రిప్టు చదవడం వేరు. ఆ అక్షరాలు ఏరి కూర్చిన ముత్యాల సరాలు. వాటిల్లో భావం వుంది. ఆ భావంలో జీవం వుంది. అది ఆమె మనసుని కదిలించింది. 'భవిష్యత్తులో అతను గొప్ప రచయిత అవుతాడు, అనుకుంది ఎంతో నమ్మకంగా.

★ ★ ★

కాలేజీ మేగజైన్‌లో సుజాత రాసిన కథ 'ఆవేదన' పబ్లిష్ అయింది. ఆ కథ మేగజైన్‌కే హైలెట్ అని అందరూ ప్రశంసించారు. ప్రిన్సిపాల్ హైమావతిగారు సుజాతని తన ఆఫీసు రూమ్‌కి పిలిచి అభినందిం

చారు. ఆమెకి గాలిలో తేలిపోతున్నట్టుంది.

ప్రతిమ "కంగ్రాచ్యులేషన్స్" అంది.

"థ్యాంక్ యూ!' అంది చిరుగర్వంగా.

"కథ చాలా బాగుంది. నిజంగా నువ్వే రాశావా? "

"యూమీన్? ఘోస్ట్ రైటర్‌ని మెయింటెయిన్ చేసే స్థాయికి నేనింకా ఎదగలేదు"

"అహఁ! నా ఉద్దేశం పైకి మామూలు అమ్మాయిలా కనిపించే నీలో సమాజంపట్ల ఇంత సునిశిత పరిశీలన, అవగాహన వున్నాయంటే నేనే కాదు, ఎవరూ నమ్మరు. ఎనీహౌ ఇంత మంచి రచయిత్రివైన నువ్వు నా స్నేహితురాలివైనందుకు చాలా గర్వంగా వుంది"

సుజాత ఆ పొగడ్తతో ఉబ్బిపోయింది.

"అసలు ఆ కథని 'ఆంధ్రతేజం' వారపత్రిక నిర్వహిస్తున్న కథల పోటీకి పంపాలనుకున్నాను. పంపితే ఖచ్చితంగా ఫస్ట్ ప్లేసులో నిలబడేది. మేడమ్‌కి మాట ఇచ్చాను, బాగుండదని కాలేజీ మేగజైన్‌కి ఇచ్చాను"

"నిజం. ఆ కథకి తప్పకుండా ఫస్ట్‌ప్రైజు వచ్చివుండేది. అయితేనేం కాలేజీ అంతా నీ పేరు మార్మోగిపోతోంది. అదే పెద్ద బహుమతి నీకు. పోటీకి పంపడానికి మరో కథ రాయి"

"మంచి ప్లాటు దొరకాలికదా"

"మర్చిపోయాను. రేపు సాయంకాలం మన కాలేజీలో నీకు చిన్న అభినందన సభ ఏర్పాటు చేస్తున్నాం. నువ్వు తప్పక రావాలి"

"ఎందుకు ప్రతిమా? నాకిలాంటి ఆర్భాటాలు నచ్చవు"

"ఆర్భాటం కాదది. నీ ప్రతిభకి గుర్తింపు!" ప్రతిమ ఎక్కువ కన్విన్స్ చెయ్యకుండానే సుజాత ఒప్పుకుంది.

★ ★ ★

"రేపు సాయంకాలం మా కాలేజీలో నాకు అభినందన సభ ఏర్పాటు చేశారు. మీరు తప్పకుండా రావాలి నాన్నా! మీరు ఆఫీసు నుంచి నేరుగా కాలేజీకి వచ్చెయ్యండి. అమ్మ, నేను కలిసి వెళ్తాం" చెప్పింది సుజాత.

"ఓకేనమ్మా! నా కూతురు కీర్తిశిఖరాలనధిరోహించ బోతోందంటే నాకు మాత్రం గర్వం కాదూ? అలాగే వస్తాను" సంబరంగా అన్నాడు రామారావు.

సుజాత రవిని కూడా రమ్మని పిలిచింది.

"రేపు సాయంకాలం ట్యూషన్ పిల్లలు వస్తారండీ. రేపటినుంచి రెండు పూటలా చెబుతానని ఒప్పుకున్నాను" అన్నాడు.

"ఏమీ ఫర్వాలేదు. రేపు ఒక్కరోజుకీ ట్యూషన్ చెప్పనని చెప్పు!"

"అలాగేలెండి" అన్నాడతను.

సుజాత మరునాడు హాజరవబోయే సభకి ఏ చీర కట్టుకోవాలో, మేచింగ్‌గా ఏ నగలు ధరించాలో ఆలోచించసాగింది.

★ ★ ★

సభ కాలేజీ ఆడిటోరియంలో ఏర్పాటయింది. ముందు వరుసలో లెక్చరర్లు, వెనుక స్టూడెంట్లు కూర్చున్నారు. వేదికమీద ప్రిన్సిపాల్ గారు, వక్తగా తెలుగు లెక్చరర్ సుబ్రహ్మణ్యంగారు, గౌరవ పురస్కారం అందుకోబోతున్న రచయిత్రి సుజాత ఆశీనులయ్యారు.

సారస్వత సంఘ సెక్రటరీ అయిన ప్రతిమ సుజాతని సభకి పరిచయం చేసి ఆమె గురించి నాలుగు మాటలు మాట్లాడమని వక్తని కోరింది.

సుబ్రహ్మణ్యంగారు మైక్ ముందుకి వచ్చారు. చదువుకోడానికే సమయం చాలని ఈ పోటీ ప్రపంచంలో అటు చదువు, ఇటు రచనారంగంపై ఆసక్తి కనబరుస్తున్న సుజాత అభినందనీయురాలని, తొలి ప్రయత్నంలోనే ఆమె సాధించిన విజయం సామాన్యమైనది కాదని, రచయిత్రిగా ఆమె ఇంకా ఎత్తుకి ఎదగాలని తన ఉపన్యాసాన్ని ముగించారు.

ప్రతిమ మైక్ ముందుకొచ్చింది. "ఇప్పుడు వర్ధమాన రచయిత్రి సుజాతని కథ గురించి నాలుగు మాటలు చెప్పమని కోరుతున్నాను"

సుజాత సభలో మాట్లాడ్డానికి ప్రిపేరవలేదేమో కంగారుపడింది. కథ గురించి మాట్లాడాలని ముందుగా చెప్పని ప్రతిమపై పీకలదాకా కోపం వచ్చింది. ఆమె మైక్ ముందుకొచ్చింది. దూరంగా వెనుక వరుసలో కూర్చున్న రవిని చూసింది.

"సభకి నమస్కారం. కథ గురించి నన్ను మాట్లాడమన్నారు. నాకు తెలిసినది చాలా స్వల్పం. నేర్చుకోవలసినది అనంతం. నేను చెప్పదలచుకున్నది కథలోనే రాశాను. సెలవు. నమస్కారం" అని ముగించి తనకి కేటాయించిన కుర్చీలో కూర్చుంది. ఒకళ్ళో ఇద్దరో గట్టిగాను, మరో పదిమంది బాగుండదన్నట్టు చప్పట్లు కొట్టారు.

ప్రతిమ మైక్ ముందుకొచ్చింది. "రచయిత్రి సుజాత కథ గురించి నాలుగు మాటలు చెప్తారనే ఆశతో ఈ సభ ఏర్పాటు చేశాను. కాని ఆమె అభిమానులని నిరాశపరిచింది. రచయిత అయినంత మాత్రాన వక్త కాలేరు. అలాగే రాయడం చేతనైనంత మాత్రాన రచయిత కాలేడు. కథలు రాయాలనే ఉబలాటం వుండి రాయలేని వాళ్ళు, మంచికథలు రాసినా రచయితగా పేరు పొందక మరుగునపడిన వాళ్ళూ ఎందరో వున్నారు. మీలో కూడా రచయిత్రులున్నారు. మనసులో ఉప్పొంగిపోయే భావజాలానికి అక్షరరూపం ఇస్తే, మీరూ కథలు రాయచ్చు. భావి తరానికి మంచి రచయితని అందించవచ్చు. రాయాలనే తపన వున్న మీలో ఎవరైనా వేదిక మీదకి వచ్చి కథ గురించి మీకు తెలిసి వున్న నాలుగు మాటలు మాట్లాడవచ్చు. ఎవర్కైనా ఆసక్తి వుంటే వేదికమీదకి రండి"

సభలో గుసగుసలు. ఎవరికివారే పక్కవాళ్ళని మోచేత్తో పొడుస్తున్నారు. ముందు వరుసలలో కూర్చున్నవాళ్ళు తమ వెనుక వాళ్లెవరైనా ధైర్యంగా లేస్తారా అని తలలు తిప్పి చూస్తున్నారు.

అప్పుడు లేచాడు రవి. జనం మధ్యలో నుంచి నడిచివచ్చి వేదికమీదకి వచ్చాడు.

ప్రతిమ అతన్ని వెంటనే గుర్తుపట్టింది. ఆరోజు లైబ్రరీలో కనిపించిన అతనే!

"మిమ్మల్ని మీరు పరిచయం చేసుకుని అప్పుడు కథ గురించి మాట్లాడండి" అంది.

రవి ముఖంలో ఆమెని గుర్తుపట్టిన భావం కదలాడింది. అతను మైక్ ముందుకి వచ్చాడు.

"సభకి నమస్కారం. నా పేరు రవిశంకర్. ఎమ్కామ్ ప్యాసయి ఉద్యోగ ప్రయత్నంలో వున్నాను. పుస్తకాలు బాగా చదువుతాను. మంచి కథలు రాయాలనే తపన వుంది. కథ గురించి నాకు తెలిసిన నాలుగు మాటలు చెబుతాను" అతను క్షణం ఆగి చెప్పడం మొదలుపెట్టాడు.

"అక్షరం పుట్టకముందే కథ వుంది. మాటలు నేర్చుకోకముందే గుహకుడ్యాల మీద గీతల రూపాన తన వేట అనుభవాలని బొమ్మలుగా గీసుకున్నాడు ఆదిమానవుడు. సకల కళలకి కథ కేంద్ర బిందువయింది. చిన్నతనంలో అమ్మ చందమామని చూపిస్తూ గోరుముద్దలు తినిపిస్తూ చెప్పే కథలని వినడానికి అలవాటుపడిన మనం కథలు చెప్పే స్థాయికి మనకి తెలియకుండానే ఎదిగిపోతాం. ప్రేమలో పడిన అమ్మాయి తను కాలేజీనుంచి ఆలస్యంగా రావడానికి కారణాన్ని కాలేజీలో స్పెషల్ క్లాసు వుంది అనే థీమ్తో రసవత్తరమైన కథని అల్లి చెబుతుంది," సభలో నవ్వులు. అరగంటసేపు అనర్గళంగా ఉపన్యసించాడతను. కథ పరిణామక్రమం, సాహిత్యంలో కథకి వున్న స్థానం....

మంత్రముగ్ధుల్లా వింటున్నారందరూ. ఉపన్యాసం ముగిసింది. కరతాళధ్వనులు మిన్నంటాయి. అందరూ ఎడ్మైరింగ్గా చూస్తుండగా వేదిక దిగి వెళ్ళిపోయాడతను.

సుజాత అతన్నే చూస్తోంది. ఆ కళ్ళల్లో ఆరాధన వెనుక లీలగా అసూయ కూడా తొంగిచూస్తోంది.

విజయ్ మోటారుసైకిల్ ఇంటిముందు ఆపి బెల్ నొక్కిన రెండు నిమిషాల తరువాత తలుపు తెరుచుకుంది. తలుపు తీసిన తల్లి ముఖంలోని నిద్రమత్తుని గమనించి నొచ్చుకున్నాడతను.

హోటల్లో ఏదో తిని వచ్చి స్టేషన్‌లోనే పడుకోవలసింది. రాత్రి పదకొండు గంటలకి వచ్చి తల్లిని అనవసరంగా లేపాను అనుకున్నాడు.

"నువ్వెళ్ళి పడుకోమ్మా. నేను అన్నం పెట్టుకుని తింటానులే" అన్నాడు.

"ఫర్వాలేదు. నేను పెడతానుగానీ నువ్వు స్నానంచేసిరా" అంది శాంతమ్మ. అతను స్నానం చేసి వచ్చాడు.



"నువ్వెళ్ళి పడుకో. నేను భోజనం చేసి ఇవన్నీ సర్దేస్తాను" అన్నాడు అన్నం కలుపుకుంటూ.

"పగలంతా కష్టపడి వస్తావు. రాత్రి ఆలస్యంగా ఇంటికొచ్చి నీ కంచాన్ని నువ్వు తీసి కడుక్కుంటే నేను చూస్తూ వూరుకోగలనా? " ఆవిడ నెయ్యి వడ్డిస్తూ అంది.

"ఒక పనికుర్రాడిని పెట్టుకోమంటే వినవు. నేను ఏ వేళకి వచ్చినా నువ్వే లేచి తలుపు తియ్యాలి"

"పెళ్ళి చేసుకోమంటే నువ్వు వింటున్నావా? "

"వారంనుంచి చూస్తున్నాను. ఏం మాట్లాడినా సంభాషణని నా పెళ్ళిదగ్గరకే తీసుకొస్తున్నావు. మనం మాట్లాడుకోవడానికి అంతకంటే మరో టాపిక్ లేదా? " నవ్వుతూ అన్నాడు.

"నీ బాధ్యతని, ఈ ఇంటి బాధ్యతనీ తీసుకోవలసినది పనివాడుకాదు. నీ భార్య. అప్పటివరకూ నాకు రెస్టు దొరకదు"

"అప్పుడే నాకు పెళ్ళేమిటమ్మా? "

"ముప్ఫయి ఏళ్ళు వచ్చి ఇప్పుడు కాకపోతే ఇంకెప్పుడు పెళ్ళి చేసుకుంటావురా? షష్టి పూర్తినాడా? అయినా ప్రమోషన్ వచ్చాక పెళ్ళి చేసుకుంటానని నువ్వు, చదువు పూర్తయ్యాక పెళ్ళిచేసుకుంటానని జ్వాల ఇన్నాళ్ళూ పెళ్ళి వాయిదా వేస్తూనే వచ్చారు. నీకు ప్రమోషన్ వచ్చింది. దాని చదువు పూర్తయింది. ఇంకేమిటి పెళ్ళికి అభ్యంతరం? "

"మనిద్దరం అనుకుంటే చాలా? జ్వాల అనుకోవద్దూ? "

"ఎందుకనుకోదూ? "

"ఏమో! కొన్నాళ్లు ఉద్యోగం చేస్తానంటుందేమో!"

"దానిమొహం. అయినా ఆడపిల్ల తనంతట తానుగా బయటపడి నన్ను బావకిచ్చి చెయ్యి అత్తయ్యా అనడుగుతుందా? దానికి వయసు వచ్చిందని పెళ్లి చెయ్యాలని ఆలోచించడానికి మాత్రం దానికెవరున్నారు? అమ్మనైనా అత్తనైనా నేనే! దానికి ఇప్పుడే ఉత్తరం రాసి వచ్చెయ్యమంటాను. సిద్ధాంతి గారి చేత పెళ్లికి ముహూర్తాలు పెట్టిస్తాను"

"నేను జ్వాలకి ఫోన్ చేసి మాట్లాడానమ్మా! వచ్చేవారం ఇక్కడికి వస్తానంది."

"ఆడపిల్ల. అంతదూరం నుంచి ఎలా వస్తుందిరా. నువ్వే వెళ్లి తీసుకురా"

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.





ఎడిటర్:

చతుర

'ఈనాడు' కాంపౌండ్

హైదరాబాద్, 500 082.










# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ **మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఫిబ్రవరి చతుర నవల గెలుపు

చిరునామా: ..............................

"అలాగేలే" అన్నాడు విజయ్.

★ ★ ★

"ఎలా వుంది నీ ఉద్యోగం?"

"చాలా చప్పగా"

"అదేమిటీ?" నవ్వింది. "పోలీస్ ఉద్యోగం చాలా థ్రిల్లింగ్‌గా ఉంటుందని ఆ ఉద్యోగం కోసం కలలు కని కష్టపడి సంపాదించావుగా?"

"నిజానికి మాదంతా రెడీమేడ్ ప్రపంచం. ఎక్కడైనా దొంగతనం జరిగిందని రిపోర్ట్ అందగానే మా దగ్గరే ఉండే ఆల్బమ్‌లో నేరస్తుల ఫొటోలు చూపిస్తే దొంగని చూసిన వాళ్లు గుర్తుపట్టడం, వాడి ఆచూకీ మా దగ్గర ఉన్న రికార్డులోనే ఉంటుంది కాబట్టి వెంటనే పట్టుకోవడం ఒక పద్ధతి. లేదా దొంగతనం జరిగిన పద్ధతి ప్రకారం దొంగ ఎవరో మా రికార్డుల ద్వారా నిర్ణయించి దొంగని పట్టుకుంటాం. పిస్టల్స్, మారువేషాలతో కార్లలో దొంగలని వెంటాడటం ఇవన్నీ ఫిక్షన్‌లో మాత్రమే. నిజ జీవితంలో కాదు. నెల రోజులకిందట మాత్రం నిజంగా సినిమాలలోలాగే ఆత్మహత్య చేసుకున్న ఒక అమ్మాయి పోలీసులని ఉద్దేశించి రాసిన ఉత్తరం ఆధారంగా కేసు ఇన్వెస్టిగేషన్ మొదలుపెట్టాలనుకున్నాను. కానీ మా డి.ఎస్.పి నుంచి ఆ కేసు మూసెయ్యమని ఒత్తిడి వచ్చింది."

"ఎందుకని" ఆసక్తిగా అడిగింది.

"ఆమె ఉత్తరంలో పేర్కొన్న పెద్దమనిషి మంచివాడు కావచ్చు కానీ చనిపోయే ముందు ఎలాంటి మనిషైనా అబద్ధం చెప్పదని నా ఉద్దేశం"

"పూర్తి వివరాలు చెప్పు"

విజయ్ చెప్పాడు. "అయినా ఇవన్నీ నీకెందుకులే?"

"నేను నీ ఇన్వెస్టిగేషన్‌లో ఏమైనా సహాయపడగలనేమోనని"

"నువ్వా?" నవ్వాడు. "నువ్వేం చెయ్యగలవు? ఆమె రాసిన ఉత్తరాన్ని బట్టి ఆ వ్యక్తిని అనుమానించడం తప్ప నిజానికి అనాథాశ్రమంలో ఏం జరుగుతోందనేది ఎవరికీ తెలియదు. అసలు ఆ వ్యక్తి దోషి అని నిరూపించగలిగే ఒక్క ఆధారమైనా లభించాలికదా?"

"ఆ ఆశ్రమంలో కొన్నాళ్లుంటే తెలుస్తుంది"

"ఎవరు... నేనా? ఇదేం సినిమా కాదు, మారువేషాలతో మాయ చెయ్యడానికి"

"నేను చెప్పేది నీ సంగతి కాదు. నేను ఉంటానంటున్నాను"

"నువ్వా? వద్దు. అదంతా చాలా రిస్క్‌తో కూడిన వ్యవహారం. నీకేమైనా జరిగితే..."

అతని మాటకి అడ్డు తగులుతూ అంది "నన్ను నేను రక్షించుకోగలను. నాకు చేతకాకపోతే చెట్టంత మొగాడివి, పోలీస్ ఇన్‌స్పెక్టర్‌వి నువ్వున్నావుగా. నువ్వు రక్షించుదువుగానిలే"

"ఆలోచిద్దాం"

"అత్తయ్యకి తెలిస్తే ఊరుకోదు. నేను ట్రెయిన్ దిగి నేరుగా అనాథాశ్రమానికి వెళ్తాను. కొంతకాలం అక్కడే ఉంటాను"

"అమ్మకేం చెప్పను?"

"నేను వైజాగ్‌లోనే ఉద్యోగం చేస్తున్నానని చెప్పు"

"ఎందుకు జ్వాలా? నా తంటాలేవో నేను పడతాను. అయినా ఆ కేసు మూసి చాలా కాలమయింది."

"నేనేమైనా సాక్ష్యాధారాలు సంపాదించగలిగితే ఆ కేసుని మళ్లీ తిరగతోడు. దోషి ఎవరైనా సరే వాళ్లని ఒదలకు"

"బాప్‌రే! మామయ్య నీకు జ్వాల అని సరైన పేరు పెట్టారు. నువ్వు నిజంగా జ్వాలవే. అగ్ని శిఖవి"

జ్వాల నవ్వింది.

★ ★ ★

"నిన్న రవిశంకర్‌గారు చాలా బాగా మాట్లాడారుకదూ?" అంది ప్రతిమ.

"సంగీతం, నృత్యంలాగా మాట్లాడడం కూడా ఒక కళ. అతను ఆ కళలో ఆరితే

రాడు. అందులో గొప్పేంవుంది? " తేలిగ్గా అంది సుజాత.

"అభ్యాసంతో సాధించిన కళ కాదది. తనకి తెలిసిన విషయాన్ని నలుగురికీ చెప్పాలనే తపన అతనిది. అయినా అతను కథ గురించి అంత చక్కగా మాట్లాడాడంటే రచయిత అయినా అయివుండాలి. లేక మంచి పాఠకుడయినా అయివుండాలి. పాఠకుడు కానివాడు రచయిత కాలేడనుకో"

"ఆ... ఏదో రాస్తూంటాడులే"

"అంటే... అతను నీకు తెలుసా? "

"అతను మా అవుట్ హౌస్‌లోనే వుంటాడు. అతని చెల్లెలు మీ శరణాలయం లోనే వుంటోంది"

"అయితే అతను రచయిత అన్నమాట"

"రాసిన ప్రతీవాడూ రచయిత కాలేడని నువ్వే అన్నావుగా? ఏదో రాస్తుంటాడుకానీ పత్రికలకి పంపలేదు"

"అతను రాసినకథని నేను చదివాను సుజాతా. ఆ కథపేరు 'ఆవేదన" ఆమె ముఖంలోకి నిశితంగా చూస్తూ అంది.

సుజాత ముఖంలో గతుక్కుమన్న భావం. అంతలోనే సర్దుకుని అంది,

"ఏ పత్రికలో? "

"పత్రికలో కాదు. అతను అసంపూర్తిగా రాసిన కథ తాలూకూ వ్రాతప్రతిని ఒక పాత మేగజైన్‌లో పెట్టి లైబ్రరీకి తెచ్చాడు" అంటూ ఆరోజు జరిగినదంతా చెప్పింది.

సుజాత ముఖంలో రంగులు మారుతున్నాయి.

"ఆ కథ మన కాలేజీ మేగజైన్‌లో నీ పేరుతో పబ్లిష్ అయింది"

సుజాత ముఖం ఎర్రబడింది. "అతను రాసిన కథ పేరు కూడా ఆవేదన అయితే అయివుండవచ్చు కానీ నా కథ వేరు"

"అతను రాసిన కథని ఒక్క అక్షరం కూడా మార్చలేదు నువ్వు. మరోమాటలో చెప్పాలంటే కథ రాసినది అతను పేరు వచ్చినది నీకు"

ఆమె ముఖం పాలిపోగా తల దించుకుంది. అంతలోనే తల ఎత్తి రోషంగా అంది.

"ఆ కథనం అతనిదైనా ఇతివృత్తం నాది"

"అయివుండచ్చు. కానీ ఆ విషయాన్ని నువ్వు నిజాయితీగా అంగీకరించి, మేగజైన్‌కి ప్రచురణకిచ్చేటప్పుడు కథ నీది, కథనం అతనిదిగా ఇద్దరి పేర్లూ ప్రచురించమని అడగలేదు. కారణం నీకే పేరు రావాలనే స్వార్థం కావచ్చు. ఈ కథ సంగతి వదిలెయ్యి ఫస్ట్ ప్రైజు వచ్చిన కథ సంగతేమిటి? "

సుజాతకి ప్రతిమ ముఖం చూస్తే అబద్ధం చెప్పాలనిపించలేదు.

"నేను ఆ కథని సగంవరకూ రాసి ఎలా ముగించాలో తెలియక అతన్ని సాయం చెయ్యమన్నాను. కథ మొత్తం మార్చి రాశాడు"

"తప్పు సుజాతా! ఒక రచయితలోని ప్రతిభకి సమాధికట్టి, ఆ సమాధిపై కీర్తిప్రతిష్టలనే భవనాన్ని నిర్మించుకోవాలనుకోడం తప్పు"

"ఏదో రాయాలనే తపన. కథావస్తువు బుర్రలో గందరగోళం చేసినా పెన్ను తీసేటప్పటికి పదాలు దొరకవు" సంజాయిషీ ఇస్తున్నట్టు అంది.

"బాగా పుస్తకాలు చదువు"

"రవి కూడా అదే అన్నాడు. అంత ఓపిక, టైం రెండూ లేవు నాకు"

"అతను రాసిన కథలని పత్రికలకి పంపకపోవడానికి కారణమేమిటి? "

"ఆర్థిక పరిస్థితి అనుకూలించక. ట్యూషన్లు చెప్తే వచ్చే కొద్దిపాటి ఆదాయం ఉద్యోగాలకి అప్లికేషన్లు పంపడం ఇంటర్వ్యూలకి, ఊళ్ళకి వెళ్ళడానికి దారిఖర్చులకే సరిపోతుంది. రిజిస్టర్ పోస్టులో కథ పంపడానికి కనీసం యాభై రూపాయలవుతుంది"

సానుభూతిగా వింటోంది ప్రతిమ. సామాన్యమైన దుస్తులను ధరించిన స్ఫురద్రూపి అయిన ఆ యువకుడు కళ్ళముందు

మెదలగానే ఆమె మనసులో ఏదో తెలియని ఆరాధనాభావం కలిగింది.

"నన్ను క్షమించు ప్రతిమా" సుజాత కళ్ళలో తడి.

"ఏసకి? " విస్మయంగా అడిగింది.

"కష్టపడి సాధించలేని కీర్తిని అడ్డదార్ల ద్వారా పొందాలనుకున్నాను"

"క్షమార్పణ కోరవలసినది నన్ను కాదు, రవిని. అంతేకాదు ఇకమీదట కథలు రాసే విషయంలో అతని సలహాలను, సూచనలను పాటించు. అతన్నే నీ గురువుగా భావించి, అతని దగ్గర రచనలోని మెళకువలను తెలుసుకో"

"ఈ విషయాన్ని దయవుంచి మనిద్దరిమధ్యనే వుండనియ్యి"

"ఎవరికీ చెప్పను. ప్రామిస్" వాగ్దానమిచ్చింది.

★ ★ ★

మసిగుడ్డలో చుట్టిన మాణిక్యంలా రంగులద్దడం మరిచిపోయిన రవివర్మ చిత్రంలా వుందామె. సాదా చీర, జాకెట్టు ధరించిన ఆమె చేతులకి మట్టిగాజులు మినహా ఒంటి మీద ఆభరణాలే లేవు. యౌవనం తెచ్చిన మిసిమి ఆమె శరీరానికి పసిడికాంతులని అద్దుతోంది.

సదాశివం ఒక్కచూపులోనే ఆమె అందాలని తూకంవేసి ఆమె అద్భుతమైన సౌందర్యరాశి అని గ్రహించాడు.

"నీకెవరూ లేరా? "

జ్వాల కన్నీళ్ళని, స్వరంలో విషాదాన్నీ అరువు తెచ్చుకుని చెప్పింది.

"మా అమ్మ నా చిన్నతనంలో చనిపోయిందండీ. మా నాన్న మరో పెళ్ళి చేసుకున్నాడు. సవతితల్లి పెట్టే బాధలని భరించలేక ఇల్లు విడిచి వచ్చాను. దయవుంచి నాకు ఆశ్రయం ఇవ్వండి. మీ రుణం ఎప్పటికైనా తీర్చుకుంటాను" వెక్కివెక్కి ఏడుస్తూ అతని పాదాలపై పడింది.

"అయ్యో! ఏడవకమ్మా. రాజావారి దయ వలన ఆయన చల్లని నీడలో నీ జీవితం ప్రశాంతంగా సాగిపోతుంది. నువ్వు నిశ్చింతగా వుండు" అతనామె భుజాలు పట్టుకుని ఆప్యాయంగా లేవదీశాడు.

జ్వాల కన్నీళ్ళు తుడుచుకుంది.

సదాశివం ఆమె పేరు, వివరాలు రిజిస్టర్‌లో రాసుకున్నాడు. జ్వాల తన పేరు సీత అని చెప్పింది.

అతను ఆయాని పిలిచి ఆమెని తీసుకెళ్ళమన్నాడు.

"పాపం! ఆ అమ్మాయికి తినడానికేమైనా వుంటే పెట్టు"

"నాకేం వద్దండీ. తినాలని లేదు" అంది.

"ఇక్కడ ఎవరూ పస్తులుండడానికి వీల్లేదు. నువ్వు అన్నం తినలేదని తెలిస్తే అయ్యగారికి కోపం వస్తుంది. వెళ్ళి ఎంగిలి పడు" అన్నాడు సదాశివం.

ఆయా వెంటరాగా జ్వాల శరణాలయంలోకి నడిచింది. ఆమెకి ఆయా కిచెన్‌లో నుంచి సాంబారన్నం తెచ్చిపెట్టింది. జ్వాల తిన్నాననిపించి చెయ్యి కడుక్కుంది.

"నీ నివాసం ఇక్కడే. సామానేమైనా వుంటే ఆ బల్లమీద పెట్టుకో" ఆయా చెప్పింది.

ఆమె వెంట వచ్చిన జ్వాల ఆ గదిలోకి ప్రవేశించి పరిశీలనగా చూసింది. విశాలంగా వున్న ఆ గదిలో వరసగా ఏడెనిమిదిమంది స్త్రీలు చాపలమీద పడుకుని నిద్రపోతున్నారు. ఆయా ఆమెకి చాపని అందించింది.

"ఇంక పడుకో. చాలా రాత్రయింది. రేపు పొద్దుట స్నానం చేసి రెడీగా వుండు. డాక్టరు దగ్గరకి తీసుకెళ్తాను"

"డాక్టరు దగ్గరకా? ఎందుకు? "

"నీకేమైనా అనారోగ్యం వుంటే నయం చేయించడానికి"

'నాకేం రోగం దుక్కలా వున్నాను' అనుకుంది మనసులోనే.

"పడుకో" మరోసారి హెచ్చరించి వెళ్ళిపో

యింది ఆయా. జ్వాల చాప పరుచుకుని పడుకుంది. కొత్తచోటు కావడంవలన రాత్రి నిద్రపట్టలేదామెకి. ఉదయం అయిదుగంట లకే అలవాటు ప్రకారం లేచింది. అప్పటికి ఒకళ్ళో, ఇద్దరో లేచి ముఖాలు కడుక్కుంటు న్నారు.

జ్వాల తన బ్యాగ్‌లోనుంచి బ్రష్ తీసు కుంది. "కొత్తగా వచ్చావా ఇక్కడికి? " ఒక వృద్ధురాలు అడిగింది.

"అవునండి" చెప్పి బాత్‌రూమ్ వెతు క్కుంటూ వెళ్ళింది. ఆమె కాలకృత్యాలు తీర్చుకుని స్నానం ముగించి వచ్చేటప్పటికి అందరూ లేచారు.

గంట మోగిన శబ్దమయింది.

"ప్రార్థనకి టైమయ్యింది. ప్రేయరు హాలుకి నడు" చెప్పింది ఒక మధ్యవయస్కు రాలు.

జ్వాల ఆవిడతోబాటు ప్రేయరు హాలుకి వెళ్ళింది. ప్రేయరు హాలులో కాస్త ఎత్తుగా వున్న వేదికదగ్గర హిందూ, ముస్లిమ్, క్రైస్తవ మతాలకి సంబంధించిన ఓం అనే అక్షరం, అర్థచంద్రిక, నక్షత్రం, శిలువ... గోడమీద ఎర్రటిరంగుతో పెయింట్ చెయ్యబడి వున్నాయి. వాటిముందు గజం ఎత్తున్న పెద్ద దీపపు కుందిలో దీపం వెలుగుతోంది.

ప్రార్థన మొదలయ్యింది.

"ఓ దయామయుడైన భగవంతుడా! తల్లి ఎవరో తండ్రిఎవరో తెలియని మాకు కన్న వాళ్ళ ప్రేమని మరిపించే అయ్యగారిని ఇచ్చావు. వటవృక్షంలాంటి ఆయన నీడలో మా జీవితాలు సుఖంగా సాగిపోనియ్యి. మాకు తిండి, బట్ట, చదువు ఇచ్చే రాజాగారు సాక్షాత్తూ నీ ప్రతిరూపంగా భావించి ఆయన చెప్పినట్టల్లా నడుచుకుంటాం. అన్నీ తనై మమ్మల్ని నడిపిస్తున్న భగవంతుడైన ఆయన మాటకి ఎదురుచెప్పం. ఓ కరుణా సింధూ! మమ్మల్ని తన చల్లని నీడలో సేద దీరుస్తున్న అయ్యగారిని చల్లగా కాపాడు. రాజావారికి, వారి కుటుంబ సభ్యులకి ఆయురారోగ్యాలని ప్రసాదించు తండ్రీ. శ్రీశ్రీశ్రీ హరిశ్చంద్రప్రసాద్‌గారికి జై"

సదాశివం ఒక్కొక్క వాక్యాన్నీ విడదీసి గట్టిగా చెబుతుంటే వంత పలికారు. అది ప్రార్థనలా లేదు. హరిశ్చంద్రప్రసాద్‌గారి మాటకి కట్టుబడి వుంటామని చేస్తున్న ప్రమాణంలా వుంది. ఒక్కొక్క వాక్యాన్ని చెబుతున్న సదాశివం ఆ అభాగ్యులని హిప్న టైజ్ చేస్తున్నట్టు వున్నాడు.

జ్వాలకి విచిత్రంగా వుంది. తను చిన్న ప్పుడు మిషనరీ స్కూలులో చదువుకుంది. ఇంటర్మీడియెట్ వరకూ రెసిడెన్షియల్ కాలే జీలో, తరువాత యూనివర్సిటీలో చదువు కుంది. ఎక్కడా ఈ తరహా ప్రార్థనని మాత్రం వినలేదు. అది ప్రార్థనలాలేదు. హరిశ్చంద్రప్రసాద్‌గారు భగవంతుడి ప్రతి రూపమనే భావాన్ని వాళ్ళ మనసులలోకి బలవంతంగా ఇంజెక్ట్ చేస్తున్నట్టుంది.

ప్రార్థన అయి బయటికి వచ్చాక ఆమె కోసం ఆయా రెడీగా వుంది.

"డాక్టర్ దగ్గరకి వెళ్దాం నడు" అంది. జ్వాల ఆమెని అనుసరించింది.

★ ★ ★

సుజాత ఇంటికి వెళ్ళేసరికి రవి బకెట్లతో కుళాయి దగ్గర నీళ్ళు పట్టి గంగాళంలో పోస్తున్నాడు. అతనికి తను పెట్టే భోజనా నికి విలువకట్టి అతను తమ ఇంట్లో చేసే చాకిరీతో బేరీజు వేసిన కాత్యాయనికి ఓవర్ హెడ్ టాంకుకి నీరు తోడే మోటారుకి అయ్యే కరెంటు ఖర్చు వేస్టనిపించింది.

సుజాత ఇంట్లోకి వస్తూనే రవి చేతిలోని బకెట్టుని అందుకుంది.

"నీళ్లు నేను పడతాను. లైబ్రరీ నుంచి పుస్తకాలు తెచ్చాను. వెళ్లి చదువుకో"

"ఫర్వాలేదండీ. ఇంకో నాలుగు బకెట్లు పడితే గుండిగ నిండిపోతుంది. తర్వాత ఖాళీయే. మీరు కొత్త కథ ఏదైనా రాస్తే ఇవ్వండి. దిద్దిపెడతాను"

సుజాత కళ్లలో నీళ్లూరాయి. "నన్ను క్షమించు రవీ! నీ మేధస్సుని, శ్రమని దోచుకుని కీర్తి సంపాదించాలనుకున్నాను. న్యాయంగా ఆ కథ రాసిన నీకే మొదటి బహుమతి చెందాలి"

"ఛ! అదేం మాటండీ! ఆ కథకి చక్కని ఇతివృత్తం ఎన్నుకున్నది మీరు"

"కాదు రవీ! నేనెంత పొరపాటు చేశానో ప్రతిమ చెప్తేగాని నాకు తెలియలేదు. ఇక నుంచి నేను నీ శిష్యురాలిని. నీ దగ్గర కథలు రాయడం నేర్చుకుంటాను"

"కొంచెం కష్టపడితే మీరు నాకంటే బాగా రాయగలరు"

"పొగడ్త అనేది అభివృద్ధికి గొడ్డలిపెట్టు లాంటిది. నన్నెప్పుడూ పొగడకు. నిజంగా నేను బాగా రాసినా ఇంకా బాగా రాయాలి అను"

రవి అచేతనుడై వింటున్నాడు. సుజాతలోని ఈ మార్పు అతనూహించనిది.

ఇద్దరూ చెరొక బకెట్టు నీళ్లు పోసేప్పటికి గుండిగ నిండిపోయింది. ఆ దృశ్యాన్ని వంట గదిలో నుంచి చూస్తున్న కాత్యాయని ముఖం ముడుచుకుంది. రవి అవుట్ హవుస్‌లోకి వెళ్లే వరకు ఆగిన ఆవిడ కోపంగా కూతుర్ని పిలిచింది.

"ఏమిటి కథ? వున్నట్టుండి వాడిపై అంత ప్రేమని కురిపిస్తున్నావ్?"

"ప్రేమ! అవును. సోదరప్రేమ. నువ్వు కూడా అతన్ని నీ కొడుకులా ప్రేమించు. ఆదరించు. అతనేమీ మన ఇంట్లో శాశ్వతంగా వుండడు. ఉద్యోగం వస్తే వెళ్లిపోతాడు. అతనిక్కడ వున్నన్నాళ్లైనా మర్యాదగా చూడు"

"ఏమిటే నీలో ఇంత మార్పు"

"అవును. నేను మారాను. నువ్వూ మారాలి" సుజాత వైపు విచిత్రంగా చూస్తుండిపోయింది కాత్యాయని.

మరునాడు పత్రిక వారు పంపిన బహుమతి మొత్తం మూడు వేల రూపాయలని అతనికివ్వబోయింది.

"అన్నయ్యా! ఇది న్యాయంగా నీకు చెందవలసిన డబ్బు. నువ్వే తీసుకో"

ఆమెలోని మార్పుని అతను చకితుడై చూస్తున్నాడు.

"ఇతివృత్తం మీదేగా?"

"కథ నువ్వే రాశావుగా? ఒక రకంగా నీ శ్రమని నేను దోచుకున్నట్టే. ఈ డబ్బు నీది. తీసుకో"

రవి ఆ డబ్బు తీసుకున్నాడు. మళ్లీ ఆమె చేతిలో పెట్టేశాడు. "ఈ అన్నయ్య చెల్లెలికి ఇస్తున్న బహుమతి ఇది. తీసుకో"

"ఏమిటన్నయ్యా ఇది? ఇది చాలా అన్యాయం" గుమ్మంలో నిలబడి వాళ్ల సంభాషణని వింటున్న కాత్యాయని నవ్వింది.

"కథ నీది. కథనం అతనిది. అందుకని ఇద్దరూ చెరో సగం తీసుకోండి?"

"ఇది బాగుంది" డబ్బు సగం లెక్కపెట్టి అతనికి ఇచ్చింది.

"తప్పదంటావా?" ఇబ్బందిగా చూశాడు.

"ఇంటర్వ్యూకి కాల్ లెటర్ వస్తే హైదరాబాదు వెళ్లాలన్నావుగా? వుంచు. ఖర్చులకి పనికివస్తుంది"

రవి మొహమాటంగానే ఆ డబ్బు తీసుకున్నాడు.



డాక్టరు స్టెతస్కోపుతో జ్వాల హార్ట్‌బీట్, లంగ్స్ చెక్ చేసింది.

"అలా పడుకో" అంది నర్సు.

"దేనికి?" అర్థం కానట్టు చూస్తూ అడిగిందామె.

"చీర వదులు చేసుకుని పడుకో" కరుగ్గా అంది నర్సు.

జ్వాల ఆమె చెప్పినట్టే చేసింది. డాక్టరు ఆమె దగ్గరకి వచ్చి పొత్తి కడుపుని వత్తి చూసింది. తర్వాత గ్లౌసు తొడుక్కుని ఆమె కాళ్ల దగ్గరకి వచ్చి నిలబడింది. నర్సు ఆమె

చీరని నడుముదాకా పైకి లాగింది. జ్వాల సిగ్గుతో చితికిపోయింది. డాక్టరు ఆమెని పరీక్షించాక చేతులు కడుక్కుంటుంటే నర్సు చెప్పింది.

"కింద లేబొరేటరీలో బ్లడ్ శాంపిల్ ఇచ్చి వెళ్లు"

జ్వాల చీర సరిగ్గా కట్టుకుని వెళ్లింది. ఆయా ఆమెని లేబొరేటరీకి తీసుకెళ్లింది. లాబ్ టెక్నీషియన్ బ్లడ్ శాంపిల్ తీసుకున్నాక తిరిగి శరణాలయానికి వచ్చారిద్దరూ.

రెండు రోజుల తరువాత జ్వాల నివాసం శరణాలయంలోని స్పెషల్ క్వార్టర్స్‌లోకి మారిపోయింది. గదికి ముగ్గురే అమ్మాయిలు. పైగా వయసులో వున్న అందగత్తెలు. పడుకోడానికి మంచాలు, మెత్తటి పరుపులు, పెరుగు, కూరలతో రుచికరమైన భోజనం. శరణాలయానికి వచ్చిన తర్వాత రెండు రోజుల పాటు తను తిన్న సాంబారన్నం, నీళ్ల మజ్జిగ గుర్తు వచ్చాయి జ్వాలకి. అందరికీ అదే భోజనం. మరి ఈ క్వార్టర్స్‌లో వాళ్లకి ఎందుకీ స్పెషల్ భోజనాలు, రాయల్ ట్రీట్‌మెంటు? ఆమెకి పజిల్డ్‌గా వుంది.

మరునాడు ఉదయం. జ్వాల స్నానం ముగించి ప్రార్థనకి వెళ్దామనుకుంటూండగా కాళ్లు జాపుకుని తీరుబడిగా మంచం మీద కూర్చునివున్న ఆ అమ్మాయి ఆమెని చూస్తూ నవ్వింది.

జ్వాల ప్రతిగా నవ్వింది.

"నీ పేరేమిటి?" ఆమె అడిగింది.

"సీత" చెప్పింది జ్వాల.

"నా పేరు సుస్మితాసేన్. దీని పేరు సిల్క్‌స్మిత" మంచంమీద కాళ్లు ఎత్తిపెట్టి కూర్చుని గోళ్లు కత్తిరించుకుంటున్న మరో అమ్మాయిని చూపిస్తూ చెప్పింది.

జ్వాల ముఖంలోని ఆశ్చర్యాన్ని గమనించి నవ్వింది. "మా అసలు పేర్లు అవి కావులే! మేము వాళ్లలా వుంటామని మమ్మల్నందరూ అలా పిలుస్తారు. నువ్వు కొత్తగా వచ్చావా ఇక్కడకు"

"రాత్రే వచ్చాను"

"ఇక్కడకొచ్చి కాదు. ఆశ్రమానికి వచ్చి ఎన్నాళ్లయింది?"

"మూడు రోజులయింది. నేను వెళ్తాను. ప్రార్థనకి టైమయింది"

"మనం ప్రార్థనకి వెళ్లినా వెళ్లకపోయినా ఎవరూ ఏమీ అనరు. ఎందుకంటే మనం ఈ ఆశ్రమానికి అతిథులం"

"నిన్ను డాక్టర్ దగ్గరకి పంపించాడా తనికెళ్ల భరణి?" సిల్క్‌స్మిత అడిగింది.

"ఆయనెవరు?"

"అదే సదాశివం. ఈ ఆశ్రమానికి కేర్‌టేకర్. వాడిని చూస్తే సినిమా యాక్టర్ తనికెళ్ల భరణి గుర్తు రాడూ? తెల్లటి పైజామా లాల్చీ నుదుట కుంకంబొట్టు"

"డాక్టర్ రిపోర్ట్సు వచ్చాయా?" సుస్మితాసేన్ అడిగింది.

"ఏమో మరి"

"డాక్టరు రిపోర్ట్సు రాకుండా దీన్ని ఇక్కడకెందుకు పట్టుకొస్తార్రే" సిల్క్‌స్మిత అంది.

"నువ్వు చదువుకున్నావా?"

"ఏదో టెన్త్‌క్లాసు చదువుతూ మానేశాను"

"డాక్టరు సర్టిఫికెట్టు వుంటే నీకు ఉద్యోగం వస్తుంది"

"ఉద్యోగమా? టెన్త్‌క్లాసు కూడా ప్యాసవని నాకు ఉద్యోగం ఎవరిస్తారు?"

"నువ్వు చెయ్యబోయే ఉద్యోగానికి చదువు అక్కర్లేదులే" అంది సుస్మితాసేన్.

ప్రార్థనకి టైమయిన సూచనగా గంట మోగింది. "నేను ప్రేయర్‌కి వెళ్తాను" అని జ్వాల బయటకి వచ్చింది. ప్రేయరు హాలులో అప్పటికే అందరూ చేరారు. ప్రార్థన మొదలయింది. నిన్నటి ప్రార్థనే. జ్వాల ఆ ప్రార్థనని మనస్ఫూర్తిగా చెయ్యలేకపోయింది.

ప్రార్థన అయ్యాక పిల్లలంతా ఎవరి క్లాస్ రూమ్స్‌లోకి వాళ్లు వెళ్లారు. ఆశ్రమంలో

ఒకటో తరగతి నుంచి పదో తరగతి వరకు పాఠాలు చెప్పడానికి టీచర్లున్నారు. చదువు రాని వాళ్ళకి చేతి వృత్తులలో శిక్షణనిచ్చే బృందం వుంది.

జ్వాల తనేం చెయ్యాలా అని ఆలోచిస్తూ అక్కడే నిలబడింది.

"నువ్వు నీ రూమ్‌కి వెళ్లు. ఇవాల్టికి బాగా రెస్టు తీసుకో" అన్నాడు ఆమెని చూసిన సదాశివం.

జ్వాల తన రూమ్‌కి వెళ్లింది. ఆమెని అన్నింటికంటే ఆశ్చర్యపరచిన విషయం స్పెషల్ క్వార్టర్సులోని వాళ్లు పని చేసినా చెయ్యకపోయినా ఎవరూ ఏమీ అనకపోవడం.

★ ★ ★

"నీకోసం మీ అన్నయ్య వచ్చాడు" ఆయా వచ్చి చెప్పగానే జయలక్ష్మి పరుగులాంటి నడకతో సంభ్రమంగా ఆఫీసు దగ్గరకి వెళ్లింది.

"ఎలా వున్నావమ్మా? " ఆప్యాయంగా అడిగాడు రవి.

"బాగున్నాను. నువ్వెలా వున్నావు? నీ ఉద్యోగ ప్రయత్నాలెంత వరకు వచ్చాయి? "

అతని ముఖం మ్లానమయింది.

"దురదృష్టం నన్నింకా వెక్కిరిస్తూనే వుందమ్మా! ఒక్కటీ కలిసి రావడం లేదు. ఈమధ్య ఒక ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం కోసం ఇంటర్వ్యూకి వెళ్లాను. నిజానికి ఆ ఉద్యోగానికి వాళ్లు కోరిన క్వాలిఫికేషన్స్‌కంటే ఎక్కువ క్వాలిఫికేషన్స్ వున్నాయి నాకు. అయినా ఆ ఉద్యోగం రాలేదు"

"దురదృష్టం నీది కాదన్నయ్యా. నాది. అమ్మానాన్నా పోయారు. నువ్వు పరాధీనంగా ఎవరి పంచనో పడి వున్నావు. నేనిక్కడ దిక్కులేని దానిలా" ఆమె ఏడుస్తోంది.

"జయా! నీకిక్కడ బాగా లేదా? " ఆదుర్దాగా అడిగాడు.

"నీకు దూరంగా వున్నానన్న బాధ తప్ప నాకు వచ్చిన లోటేమీ లేదు. నాకేదైనా ఉద్యోగం వచ్చినా బాగుండును. మేనేజరుగారిని అడగాలంటే మొహమాటంగా వుంది"

"అమ్మాయిగారు... చిన్నమ్మగారు వస్తున్నారు" మెట్లమీద కూర్చుని చుట్టకాల్చుకుంటున్న ఆయా చుట్ట పారేసి లేచి నిలబడి ఆఫీసు రూమ్‌లో వున్న సదాశివంతో చెప్పింది.

గేటుదాటి లోపలకి వస్తున్న ప్రతిమని చూసి జయలక్ష్మి కళ్లు తుడుచుకుంది.

"నమస్కారమండీ!" అంది చేతులు జోడిస్తూ.

"నమస్తే. ఎలా వున్నారు? హలో రవీ! బాగున్నారా? " రవిని చూస్తూ అడిగింది.

"నమస్తే మేడమ్!" రవి చేతులు జోడిస్తూ అన్నాడు.

"మా అన్నయ్య మీకు తెలుసా మేడమ్" జయలక్ష్మి ఆశ్చర్యంగా అడిగింది.

ప్రతిమ నవ్వింది.

"రవి రచయితగా, నాకెప్పుడో తెలుసు. అతను మీ అన్నయ్య అని సుజాత చెప్పింది'

' అతని ముఖంలో తనని గుర్తుపట్టిన భావం కనిపించకపోవడంతో తిరిగి తనే అంది.

"మీరు నన్ను గుర్తుపట్టినట్టులేదు. మనం ఒకసారి లైబ్రరీలో కలుసుకున్నాం. మా కాలేజీలో మీరు కథ గురించి ఉపన్యసించారు"

"మీరు నాకు గుర్తున్నారు" అన్నాడు రవి పొడిగా. ఇంతలో సదాశివం హడావుడిగా వచ్చాడు.

"నమస్కారం అమ్మాయిగారూ! ఎండలో నిలబడ్డారేమిటి? రండి లోపల కూర్చుందురుగాని"

"మళ్లీ కలుద్దాం" ప్రతిమ వెళ్లిపోయింది.

"ఆమె హరిశ్చంద్రప్రసాద్ గారమ్మాయి అని నీకు తెలుసా? " జయలక్ష్మి అడిగింది.

"తెలియదు. సుజాత ఫ్రెండ్ అని మాత్రం తెలుసు"

"తండ్రికి తగిన తనయ. ఎంత నిరాడం

బరంగా వుందో చూశావా? డబ్బున్నా గర్వంలేదు"

"అవును" అన్నాడు రవి.

**తు**లసి తన కన్నీళ్లు ఎవరి కంటా పడ కుండా రహస్యంగా ఏడుస్తోంది. మూడు నెలలుగా తనకి ప్రతీ నెల వచ్చే ఋతు క్రమం రావడం లేదు. పొట్ట ఎత్తుగా తయారవుతోంది. వారానికి మూడుసార్లు సదాశివం ఆమె కోసం తెచ్చే స్వీట్లు ఆమెకి రుచించడం లేదు. అసలు అతని దగ్గరకి వెళ్లాలంటేనే కంపరంగా వుంది.

ఒంటరిగా కూర్చుని ఏడుస్తున్న తులసి దగ్గరకి రమ వచ్చింది.

"ఎందుకేడుస్తున్నావ్?"

ఆమె గాభరాబడి కళ్లు రెండూ గట్టిగా తుడిచేసుకుంది.

"ఏం లేదు" అంది కంగారుగా. ఆమె స్వరంలో దుఃఖఛాయలింకా పోలేదు.

"నేను నీ ఫ్రెండ్‌ని కాదా? నాతో చెప్పకూడదా?"

తులసికి మళ్లీ దుఃఖం ముంచుకొచ్చింది. "మా అమ్మ, నాన్న గుర్తుకొచ్చారు"

"ఏడవకే? మా అమ్మ చచ్చిపోలేదా? నేను రోజూ ఏడుస్తున్నానా? ఏడిస్తే చచ్చిపోయిన వాళ్లు తిరిగి వస్తారా?"

ఆరిందాలా తన చిట్టి చేతులతో ఆమె కళ్లు తుడిచింది. "అయినా ఇక్కడ అంకుల్ బాగానే చూసుకుంటున్నారుగా నిన్ను?"

అంకుల్ అనే మాట వినగానే తులసి కళ్లలో ఏహ్యతతో కూడిన పదునైన భావం దూసుకొచ్చింది.

"తులసీ! ఎన్న రాత్రి నాకు మెళుకువ వచ్చి చూస్తే నువ్వు తలుపు తీసుకుని బయటకి వెళ్తూ కనిపించావు. నువ్వు రహస్యంగా ఎక్కడకి వెళ్తున్నావో చూద్దామని నేను కూడా నీ వెనుకనే వచ్చాను. నువ్వు అంకుల్ ఆఫీసు రూమ్‌లోకి వెళ్లావు అవునా?"

తులసి ఉలిక్కిపడింది.

"అంకుల్ నీకు స్వీట్లు ఇచ్చారు. నువ్వు తింటున్నావు" ఇన్నాళ్లూ తను కాపాడుకుంటూ వస్తున్న రహస్యం ఆమెకి తెలిసిపోయిందనే సిగ్గు కంగారుతో తులసి నిలువెల్లా వణికింది.



"ఇంకేం చూశావ్ నువ్వు" సిగ్గుతో చచ్చిపోతూ అడగలేక అడిగింది.

"తర్వాత గదిలో లైటారిపోయింది. నాకేమీ కనిపించలేదు" అంది రమ.

తులసి మనసు తేలికపడింది.

"నాకు కూడా స్వీట్లంటే ఇష్టం. అంకుల్‌తో చెప్పి నాక్కూడా స్వీటు కొనిమ్మనవా?"

"వద్దు, నువ్వు అంకుల్ కొని ఇచ్చిన స్వీట్లు తినవద్దు. అసలు అంకుల్ పిలిచినా వెళ్లద్దు"

"ఏం? నువ్వు మాత్రం తినచ్చా?"

"వద్దు నువ్వు అంకుల్ పిలిచినా వెళ్లద్దు" తులసి హిస్టీరిక్‌గా ఏడుస్తోంది.

"వెళ్లనులే! ఏడవకు" రమకి తులసి ఎందుకు ఏడుస్తోందో అర్థం కావడంలేదు. 'చక్కగా అంకుల్ కొనిచ్చిన స్వీట్లు రహస్యంగా తింటూ తనని అంకుల్ దగ్గరకే వెళ్లద్దని ఏడుస్తుందేమిటి?' అనుకుంది.

"ఇక్కడేం చేస్తున్నారు మీరిద్దరూ?" సదాశివం స్వరం విని అదిరిపడ్డారిద్దరూ.

తులసి ముఖం తిప్పుకుని భుజం మీదున్న జాకెట్టుకి ముఖం రుద్దుకుంది.

"ఏమీ లేదంకుల్" అంది లేచి నిలబడుతూ.

అతని ఎక్స్‌రే కళ్లు తులసి ముఖాన్ని పరిశీలనగా చూసి ఆమె అప్పటివరకూ ఏడ్చిందని పసిగట్టాయి.

అతను రమవైపు చూశాడు. యౌవనం అప్పుడప్పుడే మొగ్గ తొడుగుతున్న ఆమెని పరీక్షగా చూస్తూ అన్నాడు.

"గాలివేస్తే ఎగిరిపోయేంత సన్నగా వున్నావు. బాగా తిను. తులసి అంత పుష్టిగా తయారవ్వాలి నువ్వు కూడా" అతని చూపులు ఎక్కడున్నాయో గమనించిన తులసి ఒళ్లు జుగుప్సతో ముడుచుకుపోయింది.

రమకి అతని చూపులలో ఏదో వుందనిపించింది. అది ఆమెని భయపెట్టింది.

"రావే చదువుకుందాం" అని తులసి చేతిని పట్టుకుని అక్కడ నుంచి లాక్కుపోయింది.

★ ★ ★

"హలో" లైబ్రరీలో రాక్‌లో కృష్ణశాస్త్రిగారి ఊర్వశి కోసం వెతుకుతున్న రవి కోమలమైన ఆ స్వరం విని తల ఎత్తాడు.

ఎదురుగా చిరునవ్వుతో ప్రతిమ.

"హలో" అన్నాడు.

"మీ కథ స్నేహం బాగుంది. కంగ్రాచ్యులేషన్స్"

"థాంక్యూ!"

"ఏమైనా రాస్తున్నారా?"

"ఏదో మొదలు పెట్టానండీ. ఇంకా పూర్తి కాలేదు"

"కథా? నవలా?"

"నవలే" అతను తనతో మాట్లాడ్డానికి ఇబ్బంది పడడం గమనించి ఆమె అడిగింది.

"మీకు నాతో మాట్లాడ్డం ఇబ్బందిగా వుందనుకుంటాను"

"అబ్బే! అదేం లేదండీ" ఆమె హరిశ్చంద్ర ప్రసాద్ గారి అమ్మాయని తెలిశాక నిజంగానే అతనికి ఆమెతో మాట్లాడ్డం ఇబ్బందిగానే వుంది.

"అబద్ధం చెబుతున్నారు. నేనేమిటి, ప్రతిమ గారితో మాట్లాడ్డమేమిటి నాకసలు ఆవిడ ముందు నిలబడే అర్హత వుందా అనుకుంటున్నారుకదూ?" అతని మనసుని చదివినట్టు అంది.

రవి ముఖం ఎర్రబడింది.

"స్నేహానికి అంతస్థుల తేడా లేదని మీ స్నేహం కథలో రాశారుకదూ?"

"అవును" ఆమె నుంచి ఈ ప్రశ్న ఎందుకొచ్చిందో అతనికి అర్థం కాకపోలేదు.

"అయితే మీ స్నేహం నాకు కావాలి"

అతను అప్రయత్నంగా ఒక్క అడుగు వెనక్కి వేశాడు.

"ప్రతిమగారూ!" అతనేదో చెప్పబోయాడు.

"ప్రతిమా అనండి చాలు. ఈ క్షణం నుంచి మనిద్దరం ఫ్రెండ్స్. ఓకే"

"ఓకే"

"ఆ మాట నవ్వుతూ చెప్తే సంతోషిస్తాను"

"సరే" నవ్వేడు.

అతనికి కావలసిన పుస్తకం దొరికాక ఇద్దరూ బయటకి వచ్చారు.

"మీ ఉద్యోగ ప్రయత్నాలెంతవరకు వచ్చాయి?"

"ఈ వూళ్లో కాలేజీలో జూనియర్ లెక్చరర్ పోస్టుకి అప్లై చేశాను"

"ఏ కాలేజీ అది?"

అతను చెప్పాడు.

"మీకు ఆ ఉద్యోగం తప్పకుండా వస్తుంది"

"ఇంటర్వ్యూకి కాల్ లెటర్ రాలేదు. ఉద్యోగం వస్తుందని అంత నమ్మకంగా ఎలా చెబుతున్నారు?"

"వస్తుంది. అంతే" నమ్మకంగా అంది.

"మీ జోస్యం నిజమై నాకు ఉద్యోగం రానివ్వండి. మీకు మంచి..." వున్నట్టుండి హద్దులు గుర్తుకొచ్చాయేమో ఆగిపోయాడు.

"ఊ! మంచి... ఆగిపోయారేం? చెప్పండి"

"ఏం లేదులెండి. నేను వస్తాను" అతను వెళ్లిపోయాడు. ప్రతిమ చిరునవ్వుతో చక చకా నడుస్తూ వెళ్తున్న అతన్నే చూస్తోంది.

★ ★ ★

అందరూ ప్రేయరు హాలుకి వెళ్లారు. జ్వాలకి మొదటి రెండు రోజుల ప్రార్థన విన్నాక మళ్లీ ఆ కార్యక్రమంలో పాల్గొనాల నిపించలేదు. ఆమె మెల్లిగా నడుస్తూ తోట లోకి వచ్చింది.

అక్కడ కాస్త దూరంలో కాడమల్లి చెట్టు కింద పన్నెండేళ్ల పిల్ల ఒంటరిగా కూర్చుని వుంది. ఆమె బుగ్గలపై ఎండిన కన్నీటి చారికలు. జ్వాల మెల్లిగా ఆమె పక్కనే కూర్చుని భుజంపై చెయ్యి వేసింది. ఆ స్పర్శతో ఆమె ఉలిక్కిపడింది.

"నీ పేరేమిటమ్మా? "

"తులసి" ఆమె స్వరంలో దుఃఖపు జీర.

"ఇక్కడకి కొత్తగా వచ్చావా? "

"ఏడాదవుతోంది? "

"నీకెవరూ లేరా? "

ఆ ప్రశ్నతో వెక్కివెక్కి ఏడ్చింది. "మా అమ్మానాన్న యాక్సిడెంటులో చనిపో. యారు. మా బంధువులెవరూ నన్ను దగ్గ రకి తియ్యలేదు. అసలు నాకోసం ఎవరూ రాలేదు. పోలీసులు నన్ను ఇక్కడ చేర్చారు" వెక్కిళ్ల మధ్య చెప్పింది.

"మీ అమ్మ గుర్తుకొచ్చి ఏడుస్తున్నావా? "

"కాదక్కా"

"మరి? "

తులసి సదాశివం తనపై చేసిన అత్యా చారం గురించి చెప్పబోయి ఆగిపోయింది. ఎవరికైనా చెప్తే వాచ్‌మేన్ కూడా నిన్నిలాగే చేస్తాడనే సదాశివం హెచ్చరిక, అతని రాక్ష సాకారం గుర్తుకొచ్చి వణికిపోయింది.

"ఒంట్లో బాగాలేదు"

"ఏమయింది? "

"నెలసరి రావడంలేదు"

జ్వాల ఆ విషయాన్ని తేలికగానే తీసు కుంది. ఈ చిన్నపిల్ల కల్మషం తెలియని పసిమొగ్గ. తప్పు చెయ్యదనే అభిప్రాయం ఆమెది.

"నీకసలు ప్రతీనెల రెగ్యులర్‌గా వస్తుందా? "

"వస్తుంది"

"ఒక్కొక్కసారి ఆలస్యమవుతుంది. నువ్వేం గాభరాపడకు. వారానికోసారి లేడీ డాక్టరు వస్తుందిటగా ఇక్కడకి. అప్పుడు నిన్ను చూడమని ఆవిడకి చెబుతాను"

తులసి మనసు తేలికపడింది. ఇక్కడకి వచ్చిన తరువాత తనతో ఆప్యాయంగా మాట్లాడింది ఇద్దరే ఇద్దరు. రమ, ఈ అక్క. చీదరించుకునే వార్డెను, తనకి స్వీట్లు ఆశ చూపించి తన ఒళ్లంతా ముట్టుకునే సదాశివం... వాళ్లని తలచుకుంటే ఆమె అణువణువూ తిరస్కారంతో నిండిపో యింది. జ్వాలకి తులసిని చూడగానే జాలి తోబాటు ఏదో ఆత్మీయతా భావం కూడా కలిగింది.

"నువ్వు చదువుకుంటున్నావా? "

"సెవెన్త్ క్లాసు చదువుతున్నాను. నీకు తెలుసా అక్కా? నేను విజయవాడలో చది వేటప్పుడు మా క్లాసులో నేనే ఫస్ట్"

"ఇప్పుడు కూడా నీకే ఫస్ట్ మార్కులొ స్తాయి. ఏమీ ఆలోచించకుండా బాగా చదు వుకో"

"అలాగే అక్కా"

జ్వాల ఆ పిల్లని మాటలలో పెట్టి అనేక సంగతులు రాబట్టింది. తులసి తల్లిదండ్రు లది ప్రేమ వివాహం, కులాంతర వివాహం కావడం వలన బంధువుల నిరసనని ఎదు ర్కోవలసి వచ్చింది. ఒక రకంగా చెప్పా లంటే అంతా వాళ్లని వెలివేశారు. తులసి తండ్రి విజయవాడలో ఒక ప్రయివేటు కాన్వెంటులో టీచరు. తల్లి బట్టలు కుట్టి సంసారానికి తన వంతు సహకారం అందిం

చేది. ఒక్కర్తే పిల్ల అయిన తులసిని వున్నంతలో అపురూపంగానే పెంచుకునేవారు. తల్లిదండ్రుల రెక్కల కింద వెచ్చని గూట్లో నిద్రిస్తున్న లోకం తెలియని పక్షికూన తుపాను తాకిడికి గూడు చెదిరి ఒంటరిదయింది. కానీ ఆ పక్షి రాబందులాంటి సదాశివానికి ఆహారమయిందనే విషయం జ్వాలకి తెలియదు.

★ ★ ★

ప్రతిమ తల్లి గదిలోకి వచ్చింది. సుధేష్ణాదేవి చదువుతున్న పుస్తకాన్ని మూసిపెట్టి కూతురివైపు చూసి చిరునవ్వు నవ్వింది.

ప్రతిమ తల్లి కూర్చున్న కుర్చీ కోడు మీద కూర్చుని ఆవిడ భుజంపై తలవాల్చింది.

"ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూంటావు. లేకపోతే పుస్తకాలు చదువుతావు. నీ జుట్టు చూడు ఎలా నెరిసిపోతోందో? "

"ఇప్పుడు నా జుట్టు నెరిస్తేనేం తల్లీ? " ఆవిడ నవ్వింది.

"నీ వయసు వాళ్లు అందాన్ని కాపాడుకోడానికి బ్యూటీ పార్లర్స్‌కి వెళ్తూ ఎంత గ్లామరస్‌గా కనిపిస్తున్నారో తెలుసా? నువ్వు మాత్రం నీ వయసుకి మించి కనిపిస్తున్నావు. నీకేం లోటమ్మా? నాన్నగారు మంచి ఆశయాలు గల వ్యక్తి. ఈ ఘోషా పరదాలను చీల్చుకుని బయటకి వచ్చి ఆయనకి సహకరించవచ్చునుకదా! ఇలా నిన్ను నువ్వే ఈ నాలుగు గోడల మధ్య బంధించుకుని ఏకాంతాన్ని ఎందుకు కోరుకుంటున్నావ్? "

"నాకు మనుషులంటే భయం ప్రీతీ! పుస్తకాలే నా నేస్తాలు. నా ప్రపంచాన్ని వదిలి నేను బయటకి రాలేను"

పుస్తకం అనే మాట వినగానే ప్రతిమ చప్పున కూర్చున్న చోట నుంచి లేచి తల్లికెదురుగా వచ్చింది.

"నువ్వు పుస్తకాలు చదువుతావు కదా! ఆ పుస్తకం రాసిన రచయితని చూడాలని, అతనితో మాట్లాడాలని అనిపించదా? "

"అనిపించదు. ఏ రచయితా తను నమ్మిన సిద్ధాంతాలనే పుస్తకంలో రాయడు. రచయిత అయినంత మాత్రాన బలహీనతలకి అతీతుడూ కాడు. ఒక రచన చదివి ఎంత బాగా రాశాడు అని రచయితని మెచ్చుకునే మనకి తీరా అతన్ని చూశాక ఆశాభంగం కలుగక తప్పదు"

"రవిశంకర్‌ని చూస్తే మాత్రం నీ అభిప్రాయం తప్పని నిరూపించుకుంటావు? "

"రవిశంకర్! అతనెవరు? "

"అతనో వర్ధమాన రచయిత. నా ఫ్రెండ్. సుజాత వాళ్లింట్లో వుంటాడు" రవి పేరు ఉచ్ఛరించేటప్పుడు కూతురి కళ్లలోని మెరుపు ఆవిడ దృష్టిని దాటిపోలేదు.

"రవిని మన ఇంటికి తీసుకొచ్చి నీకు పరిచయం చేస్తానమ్మా"

"అలాగే" అందావిడ ఏదో ఆలోచిస్తూ.

తల్లిలోని పరధ్యాసని కనిపెట్టి అంది.

"సరే నువ్వు నీ నేస్తాలతో కాలక్షేపం చెయ్యి. నేను వెళ్లి చదువుకుంటాను" అని వెళ్లిపోయింది.

సుధేష్ణాదేవికి పుస్తకం చదవబుద్ధి కాలేదు. రవి గురించి చెప్పేటప్పుడు కూతురి కళ్లలోని మెరుపు గుర్తుకొస్తే ఆవిడకేదో భయం వేసింది. రవిని ప్రతిమ ఇష్టపడుతోందా? అతన్ని కేవలం రచయితగా ఇష్టపడుతోందా? లేక వ్యక్తిగతంగానా? ఆవిడ కూతురికి రవి పరిచయం కావడం వలన ఎలాంటి పరిణామాలు ఎదురవుతాయో ఊహించుకోడానికే భయం వేస్తోంది.

★ ★ ★

అదే రాత్రి జ్వాల కంటపడిందా దృశ్యం. రాత్రి పదకొండు గంటలవేళ వెన్నెల వెలుతురులో చెట్ల మధ్య నడుస్తున్న ఆ ఆకారం సదాశివం ఆఫీసు రూమ్‌వైపు నడుస్తోంది.

జ్వాల తలుపు తెరుచుకుని గభాల్న బయటకి వచ్చి ఆ ఆకారాన్ని అనుసరించింది. ఆమెని తులసి అని గుర్తించిన ఆమె భ్రుకుటి

ముడిపడింది. తులసికి ఇంత రాత్రివేళ ఆఫీస్ రూమ్‌లో పనేమిటి? చప్పుడు చెయ్యకుండా నడుస్తూ తులసిని అనుసరిస్తోంది.

తులసి ఆఫీసు గది మెట్లెక్కి తలుపుతట్టగానే తలుపు తెరుచుకుంది. ఆమె లోపలకి వెళ్లగానే తలుపు మూసుకుంది. జ్వాల సవ్వడి కాకుండా కిటికీ దగ్గరకి చేరుకుంది.

"ఇదుగో లడ్డుతిను" సదాశివం తులసికి పొట్లాన్ని అందిస్తున్నాడు.

"నాకు స్వీటు వద్దు అంకుల్. నన్ను... నన్నేం చెయ్యకండి"

"ఏమీ చెయ్యొద్దా? " సదాశివం వెకిలిగా నవ్వుతున్నాడు. "నాకు నువ్వంటే చాలా ఇష్టం. నిన్నేమీ చెయ్యకుండా ఎలా వదలను? "

"మీకు దణ్ణం పెడతాను. వద్దంకుల్" తులసి ఏడుస్తోంది.

"అరిచి గోలచేశావంటే వాచ్‌మేన్ చేత కూడా నీతో చెడ్డ పని చేయిస్తాను"

తులసి ఏడుపు వినిపించలేదు. బహుశా శబ్దం కాకుండా లోలోన ఏడుస్తోందేమో! గదిలో లైటు ఆరిపోయింది.

వింటున్న జ్వాల ఒంట్లోని రక్తం గడ్డ కట్టింది. 'నుదుట కుంకుమబొట్టుతో, తెల్లని బట్టలు ధరించి, చూడగానే పవిత్ర భావం కలిగేలా వుండే సదాశివం అభం శుభం తెలియని పన్నెండేళ్ల పిల్లని...' ఆమె ఉద్వేగంతో కంపిస్తూ వెనుదిరిగింది.

"జరుగుతున్న దారుణాన్ని ఎలా ఆపాలి? ఆ నరరూప రాక్షసుడికి ఎలా బుద్ధి చెప్పాలి? కసిగా ఆవేశంగా ఆలోచిస్తున్న ఆమెకి తులసి తనకి మూడు నెలలుగా నెలసరి రావడం లేదని చెప్పిన విషయం గుర్తు వచ్చింది. అంటే తులసి తల్లి కాబోతోందా? ఆమెలోని సర్వశక్తులూ హరించుకుపోయాయి. వెనుదిరిగి తన గదికెలా వచ్చిందో ఆమెకే తెలియదు.

★ ★ ★

"నాన్నగారూ!" ప్రతిమ తండ్రి గదిలోకి వచ్చి పిలిచింది.

"ఏం కావాలి తల్లీ? " ఆదరంగా అడిగారు హరిశ్చంద్రప్రసాద్.

"నేను మిమ్మల్ని ఒకటి అడుగుతాను. మీరు కాదనకూడదు"

"ఏమిటో చెప్పు"

"రవిశంకర్ అని ఒక రచయిత వున్నారు. ఎమ్.కామ్ డిస్టింక్షన్‌లో ప్యాసయి నిరుద్యోగిగా వున్నారు"

"ఊ"

"అతనికి మీరేదైనా ఉద్యోగాన్ని ఇప్పించాలి"

"ఉద్యోగమా? నాకు తెలిసి వున్నంతవరకు ఆఫీసులో ఖాళీల్లేవే"

"అతను సూర్యతేజ డిగ్రీ కాలేజీలో జూనియర్ లెక్చరర్ పోస్టుకి అప్లై చేశాడు నాన్నగారూ!"

"అయితే"

"ఆ కాలేజీ మీ ఫ్రెండు రంగారావుగారిదే కద! మీరు ఆయనకి చెప్తే రవికి ఆ ఉద్యోగం తప్పకుండా వస్తుంది"

"అదా! దానికేం వుంది? ఇప్పుడే రంగారావుకి ఫోన్ చేసి చెబుతాను" ఆయన ఫోన్ డయల్ చేసి అవతల వ్యక్తి పలుకగానే మాట్లాడారు.

"నేను హరిశ్చంద్రని మాట్లాడుతున్నాను. ఎలా వున్నావురా? నేనా? నేను బాగానే వున్నాను. బిజినెస్సా? దివ్యంగా వుంది. ఇంకా ఏమిటి విశేషాలు? "

తండ్రి రంగారావుగారితో మాట్లాడుతుంటే ప్రతిమ సహనంగా నిలబడి ఆయన రవి ఉద్యోగం విషయం చెబుతాడని ఎదురు చూస్తోంది. కాసేపు మామూలు కబుర్లయ్యాక అసలు విషయానికి వచ్చారాయన.

"మీ కాలేజీలో జూనియర్ లెక్చరర్ పోస్టుకి రవి శంకర్ అనే అతను అప్లై చేశాడుట. అతనికా ఉద్యోగం ఇవ్వాలి నువ్వు. ఇంటర్వ్యూనా? నేను రికమండ్ చేసిన కేండిడేట్‌కి ఇంటర్వ్యూ ఏమిట్రా? ఏదో

ఫార్మాలిటీ కోసం కాని..."

"నాన్నగారూ!" ప్రతిమ అడ్డుపడింది.

"ఒక్క నిముషం" ఆయన ఫోన్‌లో అని మౌత్‌పీస్‌కి చేతిని అడ్డం పెట్టి కూతురివైపు తిరిగారు. "ఏమిటమ్మా"

"ఇంటర్వ్యూలో అతని ప్రతిభని పరీక్షించి తృప్తిపడ్డాకే అతనికి ఉద్యోగం ఇవ్వమనండి! అయాచితంగా లభించే దానికోసం రవి ఆశ పడడు. అంతేకాదు మన కారణంగా అతనికి ఉద్యోగం వచ్చిందని అతనికి ఎట్టి పరిస్థితుల లోనూ తెలియకూడదు. అతని ఆత్మాభిమా నాన్ని దెబ్బతియ్యడం నా అభిమతం కాదు"

హరిశ్చంద్ర ప్రసాద్‌గారి భ్రుకుటి ముడిప డింది.

"సరేలేమ్మా" ఆయన మళ్లీ ఫోన్‌లో మాట్లాడసాగారు. "ఇంటర్వ్యూలో అతను ఆ ఉద్యోగానికి అర్హుడనిపిస్తేనే ఉద్యోగం ఇవ్వు. ఓకే థాంక్‌యూ! నేను వుంటాను మరి" ఆయన ఫోన్ పెట్టేశారు.

"థ్యాంక్స్ నాన్నగారూ!" ప్రతిమ కళ్లు కృత జ్ఞతతో మెరిశాయి.

★ ★ ★

మరునాడు ఆశ్రమానికి లేడీ డాక్టరు వచ్చింది. ఆశ్రమంలోని పిల్లాపెద్దా తేడా లేకుండా ఆడవాళ్లందరూ డాక్టరు పరీక్షచేసే గది ముందు క్యూలో నిలబడ్డారు. తులసి అందరికీ వెనకాల క్యూలో నిలబడి వుంది. ఇంతలో జ్వాల అక్కడకి వచ్చింది. తులసి ఆమెని చూసి చిరునవ్వు నవ్వింది. ఆ ముఖంలోని దిగులుని చూసి జ్వాల కళ్ల తోనే అభయం ఇచ్చి ఆమె వెనకాలే తనూ క్యూలో నిలబడింది.

ఇంతలో ఆయా వచ్చిందక్కడకి. ఆమె పేరు మైసమ్మ. లావుగా ఎర్రగా వుంటుంది. ఎప్పుడూ తాంబూలం నము లుతూ వుంటుంది. ఆమె స్వరం కర్ణ కఠో రంగా వుంటుంది.

"నువ్వెందుకు ఇక్కడ నిలబడ్డావు? డాక్ట రుకి చూపించుకోవాలనా?" జ్వాలని చూస్తూ అడిగింది.

"తులసిని డాక్టరుకి చూపించాలని" అంది.

"ఆ డ్యూటీ నాది. నువ్వెళ్లు. వీళ్లందరినీ చూశాక డాక్టర్ మీ క్వార్టర్స్‌కి వచ్చి మిమ్మల్ని చూస్తారు"

జ్వాల గత్యంతరం లేక తన రూమ్‌కి వెళ్లి పోయింది. ఆ రాత్రి తులసిని సదాశివం ఆఫీసు రూమ్‌లో చూసిన దగ్గరనుంచి ఆ పిల్లని అతని విష కౌగిలి నుంచి ఎలా రక్షిం చాలా అనే ఆలోచిస్తోంది. 'తన అను మానం నిజమై ఒకవేళ తులసి గర్భవతి అని డాక్టరు ధృవీకరిస్తే ఆ విషయాన్ని ఆమెతో చెప్పవద్దని బయటకి పొక్కనియ్యవ ద్దని డాక్టరుని బతిమాలుకోవాలనుకుంది. కాని తన బదులు మైసమ్మ తులసిని డాక్టరు దగ్గరకి తీసుకెళ్లింది. ఒకవేళ డాక్టరు ఆమె గర్భవతి అని ధృవీకరిస్తే ఆ పసిపిల్ల తట్టుకోగలదా?' జ్వాల గుండెవేగం పెరిగి పోతోంది.

డాక్టరు వెళ్లాక తులసి కోసం చూసింది. ఆమె కనిపించలేదు. ఆ రాత్రి జ్వాలకి నిద్ర పట్టలేదు. ఏదో జరగబోతోందని ఆమె సిక్స్‌సెన్స్ చెబుతోంది.

మరునాడు ఉదయం ప్రేయర్ హాల్ దగ్గర తులసి కోసం చూసింది. ఆమె కని పించలేదు. కాని రమ కనిపించింది. ఆ పిల్లని తులసితో నాలుగైదు సార్లు చూసిన మీదట ఆ అమ్మాయిని అడిగితే తులసి గురించి చెబుతుందనిపించింది.

"పాపా! తులసి ఏది?" దగ్గరకి వెళ్లి అడి గింది.

"తులసికి రాత్రి బాగా కడుపులో నొప్పి వచ్చింది. హాస్పిటల్‌కి తీసుకెళ్లారు"

"కడుపులో నొప్పా? ఏం తింది?"

"రాత్రి అన్నం తినలేదు. ఆయా వచ్చి గ్లాసుతో పాలు తెచ్చింది. ఆ పాలు తాగిన కాస్సేపటికే కడుపు నొప్పి అని ఏడ్చింది"

వింటున్న జ్వాల భ్రుకుటి ముడిపడింది.

పాలు తాగాక కడుపు నొప్పి రావడం ఏమిటి?

తను మూడు నెలలుగా బయట చేరడం లేదని తులసి చెప్పడం, ఆ రాత్రి సదాశివం గదిలో తులసి, ఇప్పుడు ఆమె అనారోగ్యం.. ఏం జరిగి వుంటుందో అర్థమైన జ్వాల నిలు వెల్లా వణికిపోయింది.

"ఆయమ్మా! తులసిని ఏ హాస్పిటల్‌లో జాయిన్ చేశారు?" అటుగా వచ్చిన మైస మ్మని అడిగింది.

"నీకెందుకు?" ముఖం చిట్లించింది.

"నేను వెళ్ళి చూసి వద్దామని"

"దాన్ని చూడ్డానికి నర్సులు, డాక్టర్లు వున్నారు. నువ్వు వెళ్లక్కర్లేదు"

"అసలు తులసికి ఏమయింది?"

"రాత్రి నుండి రక్త విరేచనాలు"

ఆమె అబద్ధం చెబుతోందని జ్వాలకి తెలుసు. అయినా ఏమీ చెయ్యలేని నిస్స హాయ పరిస్థితి. కనీసం తులసిని ఏ హాస్పి టల్‌లో జాయిన్ చేశారో తెలిస్తే బాగుండేది.

"దయవుంచి చెప్పు ఆయా! ఆమెని ఏ హాస్పిటల్‌లో జాయిన్ చేశారు?"

"నాకు తెలీదు. మేనేజరు బాబుని అడుగు"

జ్వాల గభాల్న ఆఫీసు రూమ్‌వైపు పరిగె ట్టింది. సదాశివం ఎవరితోనో ఫోన్‌లో మాట్లాడుతున్నాడు. అతని చూపు గుమ్మంలో నిలబడివున్న జ్వాలపై పడింది. వెంటనే ముఖంలో విషాదాన్ని అరువు తెచ్చుకున్నాడు.

ఫోన్ పెట్టేసి జ్వాలవైపు చూశాడు.

"ఏం కావాలమ్మా?" అతని స్వరం ఆత్మీ యంగా వుంది.

"తులసికి ఒంట్లో బాగా లేదుట కదా! ఏ హాస్పిటల్‌లో పెట్టారు సార్?"

"ఐయామ్ సారీ అమ్మా! ఇప్పుడే హాస్పి టల్ నుంచి ఫోన్ వచ్చింది. పరిస్థితి విష మించి తులసి చనిపోయిందిట"

జ్వాల తూలిపడబోయి గుమ్మం ఆసరాగా నిలబడి నిలదొక్కుకుంది.

"తులసి చనిపోయిందా?" ఆమె గుండెలో వేదన. కళ్ళలో నీళ్లు కమ్ముకొస్తు న్నాయి. మరణించిన తులసి ఆత్మశాంతి కోసం ప్రార్థన చెయ్యడానికి ఆశ్రమంలోని వాళ్లందరూ ప్రేయరుహాలుకి వెళ్తున్నారు. అందరి కళ్లలో నీళ్లు.

రమ ఒక్కర్తే చెట్టుకింద కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తోంది. జ్వాల ఆమెని గుండెల లోకి తీసుకుంది. ఆమెకీ ఏడుపొస్తోంది. ఏడుపు కంటే కసి, నిస్సహాయమైన క్రోథం. తులసి మరణానికి బాధ్యుడైన సదాశివాన్ని కిరసనాయిలుపోసి తగలబెట్టాలనే కసి. తులసి గుర్తుకొస్తే ఆమె మనసు దుఃఖ సముద్రమవుతోంది.

★ ★ ★

"ఇంటర్వ్యూ ఎలా చేశారు?" అడిగింది ప్రతిమ.

"బాగానే చేశాను" అన్నాడు రవి.

"కంగ్రాచ్యులేషన్స్"

"దేనికండీ?" విస్మయంగా అడిగాడు.

"త్వరలో ఉద్యోగస్థులవబోతున్నందుకు" మిలమిల మెరిసే ఆమె కనుదోయిని క్షణ కాలం ముగ్ధుడై చూసిన అతను మరుక్షణం సభ్యత కాదన్నట్టు చూపు మరల్చుకుని అన్నాడు.

"నాకు ఈ ఉద్యోగం వస్తుందని అంత ఖచ్చితంగా మీరెలా చెప్పగలుగుతున్నారు?"

"ఇంటర్వ్యూ బాగా చేశానన్నారుగా?"

"చాలా ఇంటర్వ్యూలు ఇంతకంటే బాగానే చేశాను" అతను నుదుటి గీత బాగుండాల న్నట్టు నుదుటిపై వేలితో చూపించాడు. "ఇది బాగుండాలి కాని ఎంత చదువుకుం టేనేం ఎంత ప్రతిభ వుంటేనేం?"

"అదుగో అలా నిరాశగా మాట్లాడకండి. మీకు ఈ ఉద్యోగం వస్తుందని నేను చెబు తున్నానుగా"

"థ్యాంక్‌యూ! మీ మాట ప్రకారం నాకు ఉద్యోగం రానివ్వండి. మీకు మంచి పార్టీ

ఇస్తాను" అని చప్పున నాలుక కొరుక్కు న్నాడు. "క్షమించండి. ఇవాళ హద్దుమీరి ఏదేదో మాట్లాడుతున్నాను" ముఖం దించు కుంటూ అన్నాడు.

అతన్నే రెప్పవాల్చకుండా చూస్తూ అంది ప్రతిమ.

"మీకు నాతో మాట్లాడుతున్నప్పుడు ఒక మామూలు మనిషితో మాట్లాడుతున్నట్టు అనిపించదుకదూ? "

రవి జవాబివ్వలేదు.

"నేనేదో దివి నుంచి భువికి దిగివచ్చిన దేవతనన్నట్టు నాపై ఎందుకంత భక్తి భావం కనబరచాలి? నన్ను ఒక స్నేహితు రాలిగా, ఆప్తురాలిగా ఎందుకు భావించరు మీరు? "

"అది కాదండీ" అతనేదో చెప్పబోయాడు.

"నేను హరిశ్చంద్రప్రసాద్ గారమ్మాయిని అని నాపై అర్థంలేని గౌరవం చూపించేవాళ్ళ నీడని కూడా నేను భరించలేను. నన్ను నన్నుగా గౌరవించే మనుషులని తప్ప" చిరు కోపంతో ఎర్రబడిన ఆమె చెంపలు కర్ణాభర ణములలోని కెంజాయకాంతులని ధిక్కరి స్తుంటే చూడకూడదనుకుంటూనే ఆ సౌంద ర్యాన్ని చూస్తూ అన్నాడు రవి.

"స్త్రీ పురుషుల మధ్య స్నేహాన్ని హర్షిం చని ఈ సమాజంలో నేను మీతో స్నేహమెలా చెయ్యగలను? "

"మీ రచనలతో సంఘంలోని కుళ్ళుని వెలికి తియ్యగల శక్తిసంపన్నులు మీరు. ఒక ఆడపిల్ల మీ స్నేహాన్ని కోరివస్తే మీకు భయమెందుకు? "

రవి సమాధానం చెప్పలేనట్లు చూశాడు.

"మీ భయమేమిటో నాకర్థమయింది. మన స్నేహాన్ని మా నాన్నగారు అభ్యం తరపెడతారని కదూ? మా నాన్నగారని గొప్పచెప్పడం కాదు కానీ ఆయన నమ్మిన సిద్ధాంతాలని ఆచరణలో పెడుతున్న మహా నుభావుడాయన. అలాంటి వ్యక్తికి మన స్నేహం విషయంలో అభ్యంతరం ఎందు కుంటుంది? కాబట్టి భయాన్ని వదిలి నా స్నేహ హస్తాన్ని అందుకోండి" ప్రతిమ చెయ్యి అతనిముందుకు జాపింది.

క్షణం సంకోచించినా అతను ఆ చేతిని అందుకున్నాడు.

"థాంక్యూ" అతని చేతిని పట్టుకుని ఊపేస్తూ అంది. ఆమె స్వరంలో అవధులు దాటిన ఆనందం.

★ ★ ★

ఆ రాత్రి సుస్మితాసేన్, సిల్క్‌స్మిత కనబ డలేదు జ్వాలకి. పొద్దుట బ్రేక్‌ఫాస్ట్ టైమ్‌కీ కనబడలేదు. తొమ్మిదిగంటలు కావస్తుం డగా వచ్చారు ఆ ఇద్దరూ. వాళ్ళ ముఖాలు నిద్రలేమితో అలసటగా, కళ్ళు ఎర్రబడి వున్నాయి. వస్తూనే బద్ధకంగా మంచాలెక్కి పడుకుని నిద్రపోయారు. ఆయా వచ్చి మధ్యాహ్నం భోజనానికి పిలిచినా లేవలేదు. ఆయా వాళ్ళకోసం తెచ్చిన భోజనాన్ని మూతపెట్టి వెళ్ళింది.

జ్వాల వాళ్ళనే గమనిస్తోంది. 'పగటి పూట ఒళ్ళెరగకుండా నిద్రపోయేంతగా రాత్రంతా ఏం కష్టపడి వుంటారు? అసలు రాత్రి ఎక్కడున్నారువాళ్ళు? ' వాళ్ళనే తదే కంగా చూస్తూ ఆలోచిస్తోంది.

"ఏయ్ సీతా!" అనే పిలుపుతో ఉలిక్కిపడింది.

సుస్మితాసేన్ బద్ధకంగా ఆవులిస్తూ మంచంమీద కూర్చుని వుంది.

"ఏమిటలా నన్నే చూస్తున్నావ్? "

"మాజీ మిస్ యూనివర్స్ సుస్మితాసేన్ నీ అందంముందు దిగదుడుపని"

"ఈ మాట చాలామంది నోట విని విని బోర్ కొట్టేసిందిగానీ ఇంకేదయినా చెప్పు"

"రాత్రి మీరిద్దరూ ఆశ్రమంలో లేరు. ఎక్కడికి వెళ్ళారు? "

"ఉద్యోగానికి" అప్పుడే లేచిన సిల్క్‌స్మిత రక్కున అంది.

"రాత్రిపూట ఏం ఉద్యోగం? "

"రాత్రే రమ్మన్నాడు మా బాస్"

"మీ ఇద్దరికీ ఉద్యోగాలు ఎప్పుడొచ్చాయి? "

"ఏం ఎందుకు రావు. మాకేం తక్కువ? " పైట జారిపోతున్నా సర్దుకోకుండా వెకిలిగా నవ్వింది సుస్మితాసేన్.

"అహ! తక్కువనికాదు. మీరు ఇంటర్వ్యూకి ఎప్పుడు వెళ్ళారు? "

"ఇంటర్వ్యూలేదు. ఏంలేదు. మమ్మల్ని చూడగానే ఎవరైనా ఉద్యోగం ఇస్తారు"

"జీతం, గీతం బాగానే వుంటుందా? "

"జీతం కాదుగానీ బక్షీస్ వుంటుంది" నవ్వింది సిల్క్‌స్మిత.

"ఎందుకిన్ని ప్రశ్నలేస్తున్నావ్? "

ఆ ఇద్దరి వెకిలితనం చూసి అసహ్యం వేసినా ఆ భావాన్ని బయటపడనివ్వకుండా అంది.

"ఊరికేనే. తెలుసుకోవాలని"

"నీకూ ఉద్యోగం చెయ్యాలని వుందా? " నవ్వింది సుస్మితాసేన్.

"చెయ్యకపోతే ఊరుకుంటారా? మనచేత ఏ పనీ చేయించకుండా కూర్చోపెట్టి మూడు పూటలా విందుభోజనం ఎందుకు పెడుతున్నారు మరి? మనచేత ఉద్యోగం చేయించి వాళ్ళు లాభం పొందడానికే"

"వాళ్ళు అంటే ఎవరు? "

"రాజాగారు"

జ్వాలకి అర్థమయినదల్లా ఒకటే. 'తమ చేత ఉద్యోగం చేయిస్తే రాజాగారికి లాభం. ఏమిటా లాభం? '

"చూస్తుంటే సీతకి ఇవాళే ఉద్యోగం చెయ్యాలని వున్నట్టుంది" అంది సుస్మితాసేన్.

"తొందరపడకు. నీ వంతూ వస్తుంది" అంది సిల్క్‌స్మిత.

జ్వాలకి వాళ్ళ నవ్వులు చూస్తే కంపరంగా ఉంది. అంతకంటే కంపరం కలిగించిన విషయం వాళ్ళిద్దరూ నిద్రలేచి కనీసం పళ్ళు తోముకోకుండా ఆయా మూత పెట్టి ఉంచిన భోజనం ప్లేట్లని లాక్కుని తినడం. ఆమె ముఖం తిప్పుకుని కిటికీలోనుంచి బయటికి చూడసాగింది. ఆమెకి విజయ్ చెప్పిన సంగతులు గుర్తుకొచ్చాయి. 'ఆశ్రమంలోని యువతులపై కన్యత్వ పరీక్షలు జరుపుతారని సుమతి ఉత్తరంలో రాసిన విషయం యదార్థం. అందుకు తనపై డాక్టరు జరిపిన కన్యత్వ పరీక్షే సాక్ష్యం. ఆశ్రమంలోని అమ్మాయిలను ఒక రాజకీయ నాయకుడికి తార్చి హరిశ్చంద్ర తన వ్యాపారాన్ని విస్తృత పరచుకుంటాడని, ఆమె రాసిన విషయాన్ని రుజువు చేయగలగాలి ఎలా? జ్వాల తీవ్రంగా ఆలోచిస్తోంది. అసలా విషయం నిజమా కాదా? '

★ ★ ★

జయలక్ష్మి ముఖంలో రవిని చూడగానే వింత వెలుగు వచ్చింది.

"ఏమిటన్నయ్యా? నువ్వు నా దగ్గరకి వచ్చి వారంరోజులు దాటిపోయింది తెలుసా? " నిష్ఠూరంగా అంది.

"ఇంటర్వ్యూలకి వెళ్ళిరావడంతో సరిపోతోంది. ఏదో ఒక ఉద్యోగానికి అపాయింటుమెంటు ఆర్డర్ వస్తే తప్ప నీ దగ్గరకి రాకూడదనుకున్నాను"

"ఏమయింది? ఉద్యోగం వచ్చిందా? " ఆత్రుతగా అడిగింది. పోయినవారం వెళ్ళిన ఇంటర్వ్యూలపై ఆశ వదులుకోవలసిందే. ఈ ఊళ్ళో కాలేజీలో లెక్చరర్ ఉద్యోగానికి అప్లై చేశాను. ఇంటర్వ్యూ కూడా అయింది. ఏమవుతుందో చూద్దాం. ఉద్యోగం రాగానే నిన్నిక్కడనుంచి నాతో తీసుకెళ్తాను"

"నేనిక్కడ బాగానే వున్నానన్నయ్యా. నిజానికి అనాథ శరణాలయంలో వుంటున్నట్టు లేదు. కాలేజీ హాస్టల్‌లో వుంటున్నట్టుంది. నాకంటే దురదృష్టవంతులు చాలామంది వున్నారిక్కడ. వారం కిందట తులసి అనే పన్నెండేళ్ళ అమ్మాయి రక్త విరేచనాలతో చనిపోయింది. ఎంతో ఆరోగ్యంగా చలాకీగా వుండే ఆ అమ్మాయికి వున్నట్టుండి

ఏమయిందో మృత్యువాత పడింది"

రవి సానుభూతిగా వింటున్నాడు.

"నాకు ఉద్యోగం వచ్చినా బాగుండును. మనమిద్దరం ఒకేచోట వుండవచ్చు మేనేజరుగారిని అడగాలి"

"నువ్వేం బాధపడకు జయా. నాకు ఉద్యోగం వస్తుంది. మన కష్టాలు త్వరలోనే తీరిపోతాయి. మంచి ఇల్లు తీసుకుందాం. కొన్నాళ్ళు పోయాక నీకో మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తాను"

"పెళ్ళా! నాకా? " శుష్కహాసం చేసింది జయలక్ష్మి. "నా జీవితంలో ఆ ఛాప్టర్ ఎప్పుడో క్లోజ్ అయిపోయింది. ఇంక పెళ్ళి ప్రసక్తే లేదు"

"దురదృష్టం ఒకసారి కాటేస్తే జీవితం ముగిసిపోయిందనుకోవడం తప్పమ్మా. ధైర్యంతో, ఆత్మవిశ్వాసంతో జీవితాన్ని తిరిగి నిలబెట్టుకోవాలి"

"నువ్వు ఎన్నయినా చెప్పు. పెళ్ళి విషయంలో అనుభవించిన వేదన, చిత్రహింస నేను మరిచిపోలేను. పెళ్ళంటేనే భయం వేస్తోంది. అది ఒక జూదం లాంటిది. జీవితాన్ని పణంగా పెట్టే జూదమది"

"నేను రేపు రాత్రి బయలుదేరి హైదరాబాదు వెళ్తున్నాను. మళ్ళీ ఎల్లుండి బయలుదేరి వస్తాను"

"ఇంటర్వ్యూకా? "

"అవును"

"ఊరినుంచి రాగానే వస్తావుగా? "

"వస్తాను" రవి వెళ్ళిపోయాడు.

జయలక్ష్మి అతన్నే చూస్తూ నిలబడింది. "నీకో మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తాను" అతని మాటలు గుర్తువచ్చాయి. పీడకలలాంటి గతం గుర్తుకొచ్చింది. తన పెళ్ళి గుర్తు రాగానే కన్నీళ్ళు వచ్చాయి.

కట్నం అక్కర్లేదు. అమ్మాయి అందంగా వుంటే చాలని పెళ్ళిళ్ళ పేరయ్య చెప్పిన ఆ సంబంధాన్ని రవేకాదు తను కూడా ఇష్టపడింది. వరుడు ఒక ప్రయివేటు కంపెనీలో పనిచేస్తున్నాడు. తామున్న పరిస్థితులలో తనకి పెళ్ళి అవడమే గొప్ప. చిన్నదో, పెద్దదో ఏదో ఒక ఉద్యోగం చేస్తూ కట్నం కోరని పెళ్ళికొడుకు తనని వెదుక్కుంటూ రావడం మరో గొప్ప విశేషం. రామాలయంలో పెళ్ళి జరిగిపోయింది. పెళ్ళిపీటల మీద వరుడు జ్వరంతో సోలిపోతున్నాడు. "రాత్రి మంచులో పడుకున్నాడు అందుకని జ్వరం వచ్చింది" అని అతని తల్లి చెప్పింది. మూడు నిద్రలకి వెళ్ళినప్పుడు అతని జ్వరం మరింత ఎక్కువయింది. అత్తవారింట్లో ఆరు నెలలు వుంది. ఆ సమయంలో చాలా ఘోరమైన విషయాలు తెలిశాయి తనకి. అతనికి బ్లడ్ కేన్సర్. పెళ్ళిచేస్తే జాతకంలో మార్పు వస్తుంది, గండం గడుస్తుందని ఎవరో జ్యోతిష్కుడు చెప్తే తనని కోరి పెళ్ళి చేసుకున్నారు. పగలంతా ఇంటిచాకిరీ, అత్తగారి సూటిపోటి మాటలు, రోగిష్టి భర్తకి సపర్యలు, తన జీవితం దురదృష్టపు లోయలోకి జారిపోతోందనే వేదన తప్ప వైవాహిక జీవితంలోని మధురానుభూతిని చవిచూడలేదు. చివరికి వ్యాధి ముదిరి అతను చనిపోయాడు. ఒక అల్పాయుష్కుడికి భార్య అయినందుకు తన నుదుటి కుంకుమ చెరిగిపోయింది. జయలక్ష్మి కన్నీళ్ళు తుడుచుకుంటూ స్థిరంగా అనుకుంది.

'తను ఈ జన్మలో పెళ్ళిమాట తలపెట్టదు. ఉద్యోగంచేసి తన కాళ్ళమీద తను నిలబడగలదు' అలా అనుకోగానే ఆమెకేదో నిశ్చింతగా అనిపించింది.

★ ★ ★

"మీ ఉద్యోగం విషయం ఏమైనా తెలిసిందా? " ప్రతిమ అడిగింది.

"ఇంకా ఏమీ తెలియలేదండీ" రవి నవ్వాడు.

"ఎందుకలా నవ్వుతున్నారు? " ఆమె చిరుకోపంగా పెదవి బిగించింది.

"నేను ఇంటర్వ్యూకి వెళ్ళివచ్చి నాలుగురోజులయినా కాలేదు. ఈ నాలుగురోజులలో

మీరు ఈ ప్రశ్న అడగడం పదహారోసారి"

"మీకు ఉద్యోగం వస్తే ఆనందించే వాళ్ళలో నేను ప్రథమురాలిని. కాబట్టి నాకంత ఆదుర్దా. అవునూ, ఉద్యోగం రాగానే మీరేం చేస్తారు?"

"మా చెల్లెలిని నా దగ్గరకి తెచ్చుకుంటాను"

"మీకు ఉద్యోగం రాగానే నాకు పార్టీ ఇస్తానన్నారు" గుర్తుచేసింది.

"ఎందుకివ్వనండీ... ఇస్తాను"

"అడ్వాన్స్‌గా మీకు నేను పార్టీ ఇస్తాను. మా ఇంటికి రండి"

"మీ ఇంటికా?" ఇబ్బందిగా అన్నాడు.

"అవును"

"ఇప్పుడెందుకండీ?"

"మా నాన్నగారికి మిమ్మల్ని పరిచయం చెయ్యాలి"

"ప్లీజ్ నామాట వినండి"

"ఇవ్వాల్టికి మీరు నా మాట వినండి. తరువాత నేను మీమాట వింటాను"

ప్రతిమలో తను మునుపెన్నడూ చూడని ఆనందాన్ని, హుషారుని చూసిన రవి ఆమెని క్షణకాలం అలాగే చూస్తుండిపోయాడు. మరుక్షణం సభ్యత కాదన్నట్టు చూపులు తిప్పుకున్నాడు.

"పదండి" అంది. ఇద్దరూ కారు దగ్గరకి నడిచారు.

"నేనేం డ్రైవర్‌ని కాను. ముందుకొచ్చి కూర్చోండి" స్టీరింగ్‌ముందు కూర్చున్న ప్రతిమ వెనుక కూర్చోబోతున్న రవితో అంది.

"సారీ" రవి అస్పష్టంగా అని ఆమె పక్కన కూర్చున్నాడు. డోర్ దగ్గరగా ఒదిగి పోయి ఇబ్బందిగా కూర్చుని వున్న అతన్ని చూసి ఆమె నవ్వుకుంది.

ఒక అపరిచిత యువకుడితో కారు దిగి వస్తున్న కూతుర్ని చూడగానే హరిశ్చంద్రప్రసాద్ భృకుటి ముడిపడింది.

తండ్రి ముఖంలోని మార్పుని గమనించని ఆమె ఉత్సాహంగా రవిని పరిచయం చేసింది.

"నాన్నగారూ! నేను చెప్పానే, ఈయనే రవిశంకర్"

"నమస్కారమండీ" రవి వినమ్రంగా చేతులు జోడించాడు.

"నమస్తే" పొడిగా అన్నారు ఆయన.

"రవి కథలు రాస్తారు నాన్నగారూ!"

"అహ..." ఆయన కళ్ళు తీక్షణంగా అతన్ని పరిశీలనగా చూస్తున్నాయి.

"ఏదో కాలక్షేపానికండీ" బిడియంగా అన్నాడు.

"నాన్నా! రవి..."

మధ్యలోనే కట్ చేశారు హరిశ్చంద్ర. "ప్రతిమా, కబుర్లేనా, కాఫీ ఏమైనా పంపిస్తావా?"

"ఇప్పుడే పంపిస్తానునాన్నా" ప్రతిమ ఛెంగున లోపలికి వెళ్ళింది.

హరిశ్చంద్ర రవివైపు తిరిగారు.

"నువ్వు సూర్యతేజ డిగ్రీ కాలేజీలో లెక్చరర్ పోస్టుకి అప్లై చేశావా?"

ఉన్నట్టుండి ఆయన ఎందుకలా అడిగారో అర్థంకాకపోయినా చెప్పాడు, "చేశానండి"

"ఆ కాలేజీ నా ఫ్రెండ్‌దే. ప్రతిమ నీకా ఉద్యోగం ఇవ్వమని నన్ను రికమండ్ చేయమంది. నీకా ఉద్యోగం వచ్చేసినట్టే. మా ప్రతిమది చాలా జాలిగుండె. ఎవరికే కష్టం వచ్చినా భరించలేదు. నీకా ఉద్యోగం వస్తే మా అమ్మాయికి చేతులెత్తి నమస్కరించు. పొంగిపోతుంది. రోజూ నువ్వు తినే తిండి తనుపెట్టిన భిక్ష అనే కృతజ్ఞతా భావాన్ని తప్ప నీ నుంచి ఏమీ ఆశించదనుకో"

రవిని అవమానపూరితంగా వున్న ఆయన మాటలు బాధించలేదు. అవమానం అతనికి కొత్త కూడా కాదు. ఆ ఉద్యోగం గురించి ప్రతిమ తనని పదేపదే ఎందుకు ఆరా తీస్తోందో అప్పటికి కానీ అర్థంకాలేదతనికి. అర్థమయ్యాక ఇంక అక్కడ ఉండబుద్ధి కాలేదు. లేచి ఆయనకి

నమస్కరించాడు.

"నేను వెళ్తానండీ..."

"మంచిదబ్బాయ్!" ఆయన లేచి లోపలికి వెళ్ళిపోయారు. రవి ఆ ఇంటి గేటు దాటి బయటకి వచ్చాడు.

ప్రతిమ కాఫీ, ఫలహారాలున్న ట్రేతో వచ్చే సరికి అక్కడ రవి కనిపించలేదు.

"రవి ఎక్కడున్నారు నాన్నగారూ? " అన డిగింది.

"వెళ్ళిపోయాడమ్మా..."

"అదేమిటి, నాకు చెప్పకుండానే..." ఆశ్చ ర్యంగా అంది.

"అర్జెంటు పనివుందని వెళ్ళిపో యాడు" ఆమెకి అతను మొదటిసారి తమ ఇంటికి వచ్చి కనీసం కాఫీ అయినా తీసు కోకుండా వెళ్ళిపో వడం బాధనిపిం చింది.

రవి అడుగులు భారంగా పడుతు న్నాయి. తనకి ఉద్యోగం వచ్చేందుకు హరిశ్చంద్రగారి పలుకుబ డిని ఉపయోగించారని తెలిసిన తరువాత అతనికి ఇంటర్వ్యూ బాగా చేశాననే తృప్తిపోయింది. ఆయన రికమెండే షన్ వుంది కాబట్టి ఇంటర్వ్యూ బాగా చెయ్యకపోయినా తనకి ఆ ఉద్యోగం వచ్చి తీరుతుంది. ఉత్తర దక్షిణాలు రెండింటిలో ఏదో ఒకటి లేనిదే ఉద్యోగం దొరకదని అతను తెలుసుకుని చాలా రోజులయింది. ప్రతిభకి పట్టంకట్టే రోజులు కావివి. ఇంట ర్వ్యూలో తన తెలివితేటలకి పడిపోయి పిలిచి ఉద్యోగం ఇస్తారనే ఆశ అతనిలో లేక పోయినా ప్రపంచంలో నీతినిజాయితీలు ఇంకా మిగిలే వున్నాయని భావించాడు. కానీ ఇప్పుడు హరిశ్చంద్రగారి ద్వారా తనకి ఉద్యోగం రాబోతోందని తెలిశాక అతని మనసుని ఏదో తెలియని బాధ అలుము కుంది.

తల్లిదండ్రులు లేని అతను చిన్నప్పటి నుంచీ కష్టాలలోనే పెరిగాడు. వారాలు చేసుకుని చదువుకున్నాడు. తనకి అన్నం పెట్టేవాళ్ళకి ఇంటిపనులలో సాయపడే వాడు. వాళ్ళు తనకి పెట్టిన అన్నంలో సగం తను తిని, మిగతాది చెల్లెలికి పెట్టేవాడు. చదువుకూడా మంచి మనసున్న కొందరు వ్యక్తుల దయాధర్మాలపైనే ఆధారపడి పూర్తి చేశాడు. ఇప్పుడు ఉద్యోగం కూడా ఎవరి సహాయంతోనో వస్తోందనే నిజం తెలిశాక అతనికి బాధగా వుంది.

స్వయంకృషితో పైకి వచ్చే అదృష్టవంతులు కొంద రైతే కొందరు అనుకోని అదృష్టం కలిసివచ్చి పైకి వస్తారు. తన లాంటి వాళ్ళకి జన్మంతా ఎవరో చెయ్యి అందించి సహాయం చేస్తూనే వుండాలి. రవికి ఆ ఉద్యోగానికి అపాయిం ట్‌మెంట్ లెటర్ వచ్చినా వదులుకోవాలనిపించింది.

కానీ చెల్లెలు గుర్తుకొచ్చి మనసు మార్చుకున్నాడు.

★ ★ ★

జయలక్ష్మి ఆఫీసు మెట్లెక్కి గుమ్మంలో సంశయంగా ఆగిపోయింది. సదాశివం ఫైల్సుతో తలమునకలవుతున్నాడు. ఆమె క్షణం సందేహించి "ఎక్స్క్యూజ్ మి సర్" అంది.

అతను తల ఎత్తాడు.

"ఓ... నువ్వా జయా. ఏమిటిలా వచ్చావు? " అనడిగాడు.

"అది... నా ఉద్యోగం గురించి మీతో

మాట్లాడదామని..."

"నువ్విక్కడికి వచ్చి ఎన్నాళ్ళయింది? "

"ఏడాది అవుతోంది"

"ఆరు నెలల కిందట వచ్చిన దుర్గకి, ఉద్యోగం వచ్చింది. మరి నీకు రాకపోవడమేమిటి? "

"నా పరీక్షలయి డిగ్రీచేతికి వచ్చాక అడుగుదామని నేనే మిమ్మల్ని అడగలేదు సార్"

సదాశివం ఆమెని ఓరకంట పరీక్షించాడు. నీడపట్టున వుండి మంచి పోషణతో ఆమె నిగనిగలాడుతోంది.

"అసలు నీ గురించి పట్టించుకోకుండా ఎలా వదిలేశామా అని" సాలోచనగా చూశాడు. "ఒక్క నిమిషం వుండు. నీ విషయం అయ్యగారితో మాట్లాడతాను"

ఫోన్ దగ్గరకి లాక్కుని హరిశ్చంద్రగారి నెంబరు డయల్ చేశాడు.

"నమస్తే సార్... నేను సదాశివాన్ని"

"చెప్పు..."

"జయలక్ష్మి గురించి మీతో మాట్లాడదామని"

"ఏమిటి? "

"ఆ అమ్మాయికి ఉద్యోగం కావాలిట"

"ఏం చదివింది? "

"బి.ఏ. పాసయింది సార్"

"బి.ఏ. పాసయితే ఏం ఉద్యోగం వస్తుంది. బి.ఇ. పాసయిన వాళ్ళకే ఉద్యోగాలు లేవు" వ్యంగ్యంగా అన్నాడు హరిశ్చంద్ర.

"మీరు పెద్ద మనసు చేసుకోవాలి సార్! ఎమ్.పి.గారు తలచుకుంటే..."

"రేపు రాత్రి ఎమ్.పి.గారు మన గెస్ట్‌హాస్‌కి వస్తున్నారు. అప్పుడు ఆ పిల్లని అక్కడకి తీసుకురా. ఆయన చూస్తారు"

"అలాగే సార్! వుంటానండి నమస్తే!" సదాశివం రిసీవర్ క్రెడిల్ చేసి జయలక్ష్మి వైపు చూసి నవ్వాడు. "అయ్యగారు ఎమ్.పి.గారితో నీ గురించి చెబుతానన్నారు. నీకు ఉద్యోగం వచ్చేసినట్టే"

"థ్యాంక్ యూ వెరీమచ్ సార్" ఆమె చేతులు జోడించి వెనుదిరిగింది.

"తనకి ఉద్యోగం వస్తోంది. అన్నయ్య హైదరాబాదునుంచి వచ్చేప్పటికి ఈ విషయం చెప్పి వాడిని సర్‌ప్రైజ్ చెయ్యాలి" ఆమె మనసు సంతోషంతో ఉక్కిరి బిక్కిర వుతోంది.

★ ★ ★

రాత్రి పదిగంటలవేళ జయలక్ష్మి సదాశివంతో గెస్ట్‌హాస్‌వైపు నడుస్తోంది.

"నాకీ ఉద్యోగం తప్పకుండా వస్తుందా సార్? " ఆశ, నిరాశల మధ్య వూగిసలాడుతున్న ఆమె అడిగింది.

"ఎమ్.పి.గారు నీ సర్టిఫికెట్లు చూడాలి. నీ అర్హతలకి తగిన ఉద్యోగం రెడీగా వుండాలి. ఉద్యోగం కోసం తెగ కలవరించిపోతున్నావు. నీకు ఆశ్రమంలో వుండడం ఇష్టం లేదా? "

"అయ్యగారి చల్లని నీడని మించి మాకు లోకంలో ఆశ్రయం ఎక్కడుంటుంది సార్! కాని నాకు ఉద్యోగం వస్తే మా అన్నయ్యతో కలిసి వుండవచ్చనే ఆశ"

"వస్తుందిలే! ఇప్పుడు నువ్వు ఉద్యోగ ప్రయత్నంలో నాతో ఇక్కడకి వస్తున్నట్టు ఎవరికైనా చెప్పావా? "

"చెప్పలేదు సార్"

"మంచి పని చేశావు"

మాటలలోనే గెస్ట్‌హాస్‌ని సమీపించారు.

"జాగ్రత్త. ఎమ్.పి.గారు ఏం అడిగినా వినయవిధేయతలతో సమాధానం చెప్పు. ఉద్యోగం కావాలంటే నువ్వు ఆయన్ని ప్రసన్నం చేసుకోవాలి? "

"అలాగే సార్"

గేటు దగ్గరున్న వాచ్‌మేన్ సదాశివాన్ని చూసి వంకరగా నవ్వాడు. జయలక్ష్మి లోపలకి నడిచింది. సదాశివం ఒక గదిముందు ఆగి మునివేళ్ళతో తలుపుమీద చిన్నగా తట్టాడు.

"కమిన్" లోపలనుంచి వినిపించింది.

సదాశివం లోపలకి నడిచాడు. జయలక్ష్మి అనుసరించింది.

"నమస్తే సార్!"

"నమస్కారం" అన్నాడాయన. అప్పటికే నైట్‌డ్రెస్‌లో వున్నాడాయన. విశాలమైన డబుల్‌బెడ్‌మీద బాసింపట్టు వేసుకుని కూర్చున్నాడు.

"అయ్యగారు చెప్పిన అమ్మాయిని తీసుకొచ్చాను. పేరు జయలక్ష్మి"

ఆయన తనవైపు చూడగానే ఆమె చిరునవ్వుతో నమస్కరించింది.

హుందాగా తల పంకించారాయన.

"ఏం చదువుకున్నావ్?"

"బి.ఏ. పాసయ్యానండి"

"నీ సర్టిఫికెట్లేవి?"

ఆమె చేతిలో పదిలంగా పట్టుకున్న తన సర్టిఫికెట్లున్న ఫైలుతోబాటు గెస్ట్‌హవుస్‌కి వచ్చేముందు సదాశివం తనకి ఇచ్చిన ఒక సీల్డ్‌కవరుని కూడా ఆయనకి అందించింది.

ఆయన ఫైలుని పక్కనపెట్టి సీల్డ్‌కవరుని ఓపెన్‌చేసి అందులోని కాగితాన్ని చదివారు. సంతృప్తిగా తలపంకించి,

"గుడ్!" అన్నారు సదాశివంవైపు చూస్తూ. ఆ చూపులోని సందేశాన్ని అర్థం చేసుకున్న అతను అవతలకి వెళ్ళాడు. వెళ్తూ ఆ గది తలుపుని దగ్గరకి లాగడం మరచిపోలేదు.

"కూర్చో" అన్నారాయన ఆమెని చూస్తూ.

"ఫర్వాలేదు సార్!" వినయంగా అంది. "సార్! నాకు ఏదైనా చిన్న ఉద్యోగం ఇప్పించండి. మీ రుణం ఈ జన్మలో తీర్చుకోలేను"

"తప్పు. రుణాలు తీర్చుకోకుండా వుండకూడదు" అన్నారాయన నవ్వుతూ. "నీకు ఉద్యోగం చూస్తాను. నువ్వు నా రుణం తీర్చుకో"

జయలక్ష్మికి ఆయన మాటలు అర్థం కాలేదు. అప్పుడు పడింది ఆమె భుజంపై ఆయన చెయ్యి. ఆమె బిత్తరపోయింది.

★ ★ ★

ఫోన్ మోగింది. విస్కీ సేవిస్తున్న హరిశ్చంద్ర వెంటనే రిసీవ్ చేసుకున్నాడు. అవతల ఎమ్.పి.గారి స్వరం విని "నమస్తే సార్!" అన్నారు.

"ఆ పిల్ల చచ్చిపోయిందండి హరిశ్చంద్ర గారూ!" కంగారుగా ధ్వనించిందాయన స్వరం.

"ఏ పిల్ల?" హరిశ్చంద్రకి అర్థం కాలేదు.

"మీరు పంపిన పిల్ల, జయలక్ష్మి"

హరిశ్చంద్ర చేతిలోని గ్లాసు కిందపడింది.

"ఏమిటీ!" అదిరిపడ్డారాయన.

"ఆ పిల్లకి ఇష్టం లేనట్టుంది. ఒకపట్టాన నాకు లొంగలేదు. బలవంతాన లొంగతీసుకున్నాను. మరి ఏమయిందో ఏమిటో చచ్చి వూరుకుంది"

క్షణాలలో సర్దుకున్నారాయన. "ఆ మాత్రానికే అంత గాభరా పడిపోతారేమిటి? మీరు అనుభవించిన సుఖాన్ని గుర్తుంచుకుని మిగతాదంతా మరచిపోండి. మీరు రిలాక్సవండి. నేను ఇప్పుడే అక్కడకి వస్తున్నాను" ఆయన ఫోన్ పెట్టేశారు.

మరికొద్దిసేపటి తరువాత జయలక్ష్మి మృతదేహాన్ని వూరవతల తాటితోపులో పడేశారు హరిశ్చంద్ర మనుషులు.

★ ★ ★

రవి హైదరాబాదు నుంచి వచ్చాడు. సుజాత అతను కాఫీ తాగుతుండగా క్రితం రోజు అతనికి పోస్ట్‌లో వచ్చిన రెండు కవర్లని తెచ్చి అతనికి ఇచ్చింది.

"గుడ్‌న్యూస్ అయితే ముందు నాకే చెప్పాలన్నయ్యా" అంది.

"అలాగేనమ్మా!" రవి తాగుతున్న కాఫీ గ్లాసుని పక్కనపెట్టి ఒక కవరు విప్పి చదివాడు.

"నాకే ఊళ్ళో కాలేజీలో కామర్సు లెక్చరర్‌గా ఉద్యోగం వచ్చింది" చెప్పాడు.

"ఏమిటి, నిజంగానా?" సంభ్రమానందాలతో ఉక్కిరి బిక్కిరయింది.

"రెండో ఉత్తరం ఏమిటి? "

"సంక్రాంతి కథల పోటీలో నా కథ మలుపుకి మొదటి బహుమతి వచ్చింది" ఆ ఉత్తరాన్ని చదువుతూ అన్నాడు.

"వావ్! కంగ్రాచ్యులేషన్స్! అమ్మా త్వరగా రా! అన్నయ్య రెండు శుభవార్తలు చెప్పాడు"

వంటింట్లో పని చేసుకుంటున్న కాత్యాయని వరండాలో పేపరు చదువుతున్న రామారావుగారు ఒకేసారి అక్కడకి వచ్చారు.

రవి ఆ ఇద్దరికీ పాదాభివందనం చేశాడు. "నాకీ ఊళ్ళో కాలేజీలో లెక్చరర్‌గా ఉద్యోగం వచ్చిందమ్మా!"

"ఆయుష్మాన్‌భవ!" దీవించారిద్దరూ.

"చాలా సంతోషం నాయనా! ఇన్నాళ్ళ నీ శ్రమ ఫలించింది. మీ చెల్లెల్ని నీ దగ్గరకి తెచ్చుకోవచ్చు"

"అవునండీ" రవి ముఖంలో నిశ్చింత.

"రెండో శుభవార్త నేను చెబుతాను. అన్నయ్య కథల పోటీకి రాసి పంపిన కథకి మొదటి బహుమతి వచ్చింది"

రామారావుగారు అతని చేతిని అందుకున్నారు. "కంగ్రాచ్యులేషన్సయ్యా!"

"థాంక్సండీ!"

"నీకు అభ్యంతరం లేకపోతే నువ్వు, మీ చెల్లెలు మా ఇంట్లో వుండండి. అద్దె ఇవ్వక్కర్లేదు"

"కృతజ్ఞుడినమ్మా!" అతని కళ్ళల్లో నీళ్ళు మెరిశాయి. "కాని ఇప్పటిలాగే నన్ను ఇంటి పనులలో సహాయపడనిస్తేనే వుంటాను"

"గతంలో నీ పట్ల నా ప్రవర్తనకి నేను సిగ్గుతో కుమిలిపోతున్నాను. నేను చేసిన తప్పులు క్షమించరానివి నిన్ను ఈ ఇంట్లో వుండమంటున్నది నీ చేత పని చేయించుకోడానికి కాదు. మా అబ్బాయిగా ఈ ఇంట్లో నీకు స్థానమిస్తున్నాను. నన్ను నీ తల్లిగా భావిస్తే నా తప్పులని క్షమించగలిగితే మా ఇంట్లోనే వుండు"

"ఎంత మాటమ్మా! మీ పై నాకెప్పుడూ గౌరవమే! మీ మాట కాదనను. మీరు కోరినట్టు మీ ఔట్ హౌస్‌లోనే వుంటాను"

"సెంటిమెంట్ సీన్లతో ఈ సంతోష సమయాన్ని బరువెక్కించద్దు. వెంటనే శరణాలయంనుంచి జయని తీసుకురా అన్నయ్యా! మనం పార్టీ చేసుకుందాం"

"కొంచెం స్పీడు తగ్గించు చెల్లాయ్! నేను ఉద్యోగంలో చేరాలి. మొదటి నెల జీతం అందుకోవాలి. అప్పుడు పార్టీ! జయని శరణాలయం నుంచి తీసుకురావడం కూడా అప్పుడే"

"అదేం మాట బాబూ! మేం లేమా? నీతోబాటు మీ చెల్లెలికి గుప్పెడన్నం పెడితే మా ఆస్తి తరిగిపోతుందా? " అంది కాత్యాయని.

"అభిమానంతో అంత మాటన్నారు అదే చాలమ్మా! నేను జయ దగ్గరకి వెళ్ళి నాకు ఉద్యోగం వచ్చిన వార్త చెప్పి వస్తాను" అతను స్నానంచేసి త్వరగా తయారయి బయలుదేరాడు.

★ ★ ★

రవి శరణాలయానికి వెళ్ళి తను జయ కోసం వచ్చానని చెప్పాడు.

"జయ ఇంటర్వ్యూకి వెళ్ళింది. సాయంకాలం వస్తుంది" చెప్పింది ధనలక్ష్మి.

"చెల్లెలు ఉద్యోగానికి అప్లై చేసిన విషయం తనకి చెప్పనేలేదు. ఇంటర్వ్యూకి వెళ్ళి వచ్చాక చెబుదామనుకుందేమో! జయ కొన్నాళ్ళు ఉద్యోగం చేస్తేనే మంచిది. మనుషులలో పడుతుంది. తరువాత నిదానంగా పెళ్ళికి ఒప్పించవచ్చు" అనుకుంటూ, "సరే మేడమ్! జయ వస్తే నేను తన కోసం వచ్చి వెళ్ళానని చెప్పండి. నేను సాయంకాలం మళ్ళీ వస్తాను" అన్నాడు.

రోడ్డుమీద వారగా నడుస్తున్న అతనికి ప్రపంచమంతా ఎంతో సుందరంగా కనిపిస్తోంది. పరాధీనంగా బతుకుతున్న తనకి ఉద్యోగం వచ్చింది. తను సంపాదనాపరుడు కాబోతున్నాడు. తన సంపాదనలో

కొంత భాగాన్ని పేదలకి, ఆర్తులకి కేటాయించాలి. ఆకలి ఎలా వుంటుందో తెలిసిన తను మరొకరి ఆకలి తీర్చాలి.

అటుగా వస్తున్న కారు స్లో అయి అతని పక్కన ఆగింది. డోర్ తెరుచుకుని దిగిన ప్రతిమ సంభ్రమంగా పలకరించింది. "హలో రవీ! హైదరాబాదునుంచి ఎప్పుడొచ్చారు? "

"ఇవాళ పొద్దుట"

ఆరోజు అతను తమ ఇంటికి వచ్చి తనతో చెప్పకుండా ఎందుకలా వెళ్ళిపోయాడో అడగాలని పెదవి విప్పబోయిన ఆమె గంభీరంగా వున్న అతని ముఖాన్ని చూస్తూ ఆగిపోయింది.

"ఏమిటలా వున్నారు? "

సమాధానంగా రవి ఆమెవైపు ఒక కాగితాన్ని జాపాడు.

"నాకు ఉద్యోగం వచ్చింది. ఇది అపాయింట్‌మెంట్ లెటర్"

ప్రతిమ ముఖం సంతోషంతో దీప్తివంతమయింది.

"కంగ్రాచ్యులేషన్స్"

"నిజానికి నేను ఇంటర్వ్యూకి వెళ్ళక ముందే మీరు కంగ్రాచ్యులేషన్స్ చెప్పాలి. ఎందుకంటే నాకీ ఉద్యోగం వస్తుందని మీకు ముందే తెలుసుగా? "

"ఇంటర్వ్యూ బాగా చేశారు కాబట్టి మీకు ఉద్యోగం వస్తుందన్నాను కాని నాకేమైనా జ్యోతిషం వచ్చనుకున్నారా? " అతని ముఖంవంక చూడకుండా సాధ్యమైనంత గంభీరంగా వుండడానికి ప్రయత్నిస్తూ అంది.

"ఇంటర్వ్యూ బాగా చెయ్యకపోయినా నాకీ ఉద్యోగం వచ్చేది"

"అదేమిటి? "

"కారణం మీకూ తెలుసు" ఆమెనే నిశితంగా చూస్తూ అన్నాడు.

"ఇది మీరు పెట్టిన భిక్షే అనే కృతజ్ఞతా భావం నాకెప్పుడూ వుంటుంది ప్రతిమ గారూ! మీ నాన్నగారికి నా కృతజ్ఞతలు తెలియచెయ్యండి"

ప్రతిమ చివ్వున తల ఎత్తింది.

"నా కారణంగా మీకీ ఉద్యోగం వచ్చిందని ఎవరు చెప్పారు మీకు? "

"ఊహించండి"

"మా నాన్నగారా? "

తల పంకించాడు రవి. ప్రతిమ ముఖం పాలిపోయింది.

'రవికి ఈ ఉద్యోగం వచ్చేందుకు తను రికమండ్ చేశానని తండ్రి అతనితో చెప్పేశాడా? అతనెంతటి ఆత్మాభిమానం కల వ్యక్తో చెప్పినా' ఆమెకి రవి కనీసం తనతో మాట మాత్రంగానైనా చెప్పకుండా ఆరోజు ఎందుకు వచ్చేశాడో అర్థమయింది. ఆమె కళ్లలో నీళ్ళూరుతుండగా ఛరాలున కారెక్కింది.

సుడిగాలిలా తండ్రి గదిలోకి దూసుకొచ్చిన ఆమె ఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతున్న ఆయన్ని చూసి ఆగిపోయింది. ఆయన ముఖంలో విషాదం. కళ్లలో నీళ్లు.

"ప్రతిమా! ఈ ఘోరవార్త విన్నావా? శరణాలయంలోని జయలక్ష్మి అనే అమ్మాయి చనిపోయిందిట" ఫోన్ పెట్టేసి చెప్పారాయన.

ప్రతిమ కాళ్ళ కింద భూమి కంపించింది. 'జయలక్ష్మి అంటే ఎవరు? రవి చెల్లెలు కాదుకదా!' ఆమె తనేం చేస్తోందో తనకే తెలియని స్థితిలో గిరుక్కున వెనుదిగిరి వెళ్ళి కారులో కూర్చుంది. మరుక్షణం కారు సంధించి విడిచిపెట్టిన బాణంలా శరణాలయంవైపు దూసుకుపోయింది.

★ ★ ★

జయలక్ష్మి మృతదేహాన్ని, పక్కనే కూర్చుని రోదిస్తున్న రవిని చూస్తూనే అప్రయత్నంగానే ఒక అడుగు వెనక్కి వేసింది ప్రతిమ. చనిపోయినది రవి చెల్లెలే అని తెలిసి తట్టుకోలేకపోయింది. అశ్రువులు

చెక్కిళ్ళని తడిపేస్తుండగా శరీరంలోని శక్తి నంతటినీ ఎవరో లాగేసినట్టు కూలబడిపోయింది.

రవి చెల్లెలి మృతదేహం పక్కన కూర్చుని కుమిలిపోతున్నాడు. ఏ చెల్లెలి కోసం అహో రాత్రులు శ్రమించాడో, ఎవరికోసం అర్ధాకలి భోజనంచేసి కడుపు మాడ్చుకున్నాడో ఆమె ఇంక లేదు.

హరిశ్చంద్ర కారు దిగి శరణాలయపు ఆవరణలోకి రావడంతో అక్కడున్న జనంలో కలకలం రేగింది. అందరూ పక్కకి తొలగి ఆయనకి దారి ఇచ్చారు.

ఆయన జయలక్ష్మి మృతదేహాన్ని చూసి కన్నీరు కార్చారు. ఆయన దుఃఖిస్తుంటే అందరికీ కన్నీళ్ళు వచ్చాయి. ప్రతిమ తండ్రిని చూస్తూనే ఆయన్ని చుట్టేసి వెక్కి వెక్కి ఏడ్చింది. కూతురిని ఓదారుస్తూ కారు దగ్గరకి నడిపించారాయన.

★ ★ ★

శ్మశానం నుంచి ఇంటికి వచ్చాడు రవి. ఎర్రబడిన కళ్ళు, నలిగిన దుస్తులతో స్తబ్ధంగా వున్న అతన్ని చూడగానే సుజాత హృదయం ద్రవించిపోయింది. అతన్నెలా పలుకరించాలో ఆమెకి అర్థం కాలేదు. కాత్యాయని, రామారావుగారు అతన్ని ఓదార్చడానికి ప్రయత్నించి విఫలులయ్యారు. పిలిచినా పలక్కుండా గాజు కళ్ళతో శూన్యం లోకి చూస్తున్న అతన్ని చూస్తే పిచ్చివాడయిపోతాడేమో అని భయం వేస్తోంది ఆ ఇద్దరికీ. అతన్ని పలుకరించడానికి ప్రయత్నించి విఫలులై వెనుదిరిగారా ఇద్దరూ.

"రవిని చూస్తే భయం వేస్తోందమ్మా!" అన్నారు రామారావుగారు. "అతను మళ్ళీ మామూలు మనిషి అవుతాడనే నమ్మకం లేదు నాకు" అన్నారు కూతురితో.

సుజాత కన్నీళ్లు తుడుచుకుని అవుట్ హవుస్‌లోకి వెళ్ళింది.

రవి కటికనేలపై గోడనానుకుని కూర్చుని శూన్యంలోకి చూస్తున్నాడు.

"అన్నయ్యా!" అతని సమీపంలో కూర్చుంటూ పిలిచింది. అతను ఉలిక్కిపడి తల తిప్పాడు. సుజాత అలా పిలిస్తే జయ పిలిచినట్టే అనిపించింది. అప్పుడొచ్చిందతనికి దుఃఖం. చేతులలో ముఖం దాచుకుని పసివాడిలా ఏడ్చాడు. చెల్లెల్ని తలచుకుని కదిలి కదిలి ఏడ్చాడు.

"వూరుకో అన్నయ్యా" ఆమె గాద్గదిక స్వరంతో అతన్ని ఓదార్చసాగింది.

"జయ జీవితంలో ఏ సుఖానికీ నోచుకోలేదమ్మా. నేను వుండీ అనాథగా బతికింది. చివరికి దిక్కులేని చావు చచ్చిపోయింది"

"అసలు జయ ఒక్కర్తే ఇంటర్వ్యూకి వెళ్ళడమేమిటన్నయ్యా? వాళ్ళ ఆశ్రమంలో ఆడపిల్లలని చాలా జాగ్రత్తగా చూస్తారని ప్రతిమ చెబుతూ వుంటుందే! ఆమెకి తోడుగా ఎవరినీ పంపించలేదంటావా? "

"అదే నాకూ అర్థం కావడంలేదమ్మా! ఇంటర్వ్యూ పూర్తయి జయ ఆశ్రమానికి బయలుదేరేసరికి ఆలస్యమయి వుంటుందేమో! ఎవరైనా దుండగులు పథకం ప్రకారం ఆమెని అక్కడనుంచి లాక్కుని వెళ్ళారేమో! లేకపోతే ఊరి బయట తాటితోపుల మధ్య ఆమె శవం పడివుండడమేమిటి? "

సుజాత ఒళ్ళు గగుర్పొడుస్తోంది. 'అసలేం జరిగివుంటుంది. జయపై అత్యాచారం జరిగివుంటుందా? పోస్ట్‌మార్టమ్ రిపోర్టు వస్తే తప్ప ఆ విషయం తెలియదు. అసలు రవి ఈ దెబ్బనుంచి తేరుకోగలడా? "

★ ★ ★

ఇన్‌స్పెక్టర్ విజయ్ శరణాలయం గేటు ముందు తన మోటారు సైకిల్‌ని ఆపి లోపలకి నడిచాడు.

సదాశివం అతన్ని చూస్తూనే "నమస్కారం సార్! ఏమిటిలా వచ్చారు? " అని అడిగాడు.

"జయలక్ష్మి మరణం వెనుక ఏదో మిస్టరీ వుంది. నేను దాన్ని ఛేదించాలనుకుంటు

న్నాను"

"ఉద్యోగానికి ఇంటర్వ్యూకి వెళ్లిన అమ్మాయి ఊరిబయట నిర్జన ప్రదేశంలో శవమై తేలడం బాధాకరమైన విషయమే. కాని అందులో మిస్టరీ ఏమీ లేదు. ఒంటరి ఆడదానికి ఈ లోకంలో రక్షణ లేదని మరో సారి రుజువయింది"

"జయలక్ష్మి విషయంలో మీరు జాగ్రత్త పడి వుండవలసింది. ఐ మీన్ ఆమెకి తోడుగా మరెవర్నైనా పంపివుండవలసింది"

"ఇంటర్వ్యూకి తోడు పంపమంటున్నారు. ఉద్యోగం వచ్చాక రోజూ ఆఫీసుకి తోడు పంపలేముకదా? " వ్యంగ్యాన్ని స్వరంలో ధ్వనించకుండా జాగ్రత్తపడుతూ అన్నాడు.

"మీ ఆశ్రమంలో వున్నంతసేపూ ఆమె బాధ్యత మీది. ఉద్యోగం వచ్చి బయటకి వెళ్ళాక ఆమె కష్టనష్టాలకి ఆమే బాధ్యురాలు"

ఈ కుర్ర ఇన్‌స్పెక్టర్ ధోరణికి చిర్రెత్తుకొస్తోంది సదాశివానికి. బలవంతాన కోపాన్ని నిగ్రహించుకుంటూ అన్నాడు.

"ఇక్కడ ఆశ్రయం పొందుతున్న వాళ్ళలో సగం మందికి పైగా పతితలు, భ్రష్టులే. వాళ్ళకి నీతినియమాలు లేవు. మేం వాళ్ళకి భోజనం పెడతాం. వసతిని కల్పిస్తాం. అంతే తప్ప వాళ్ళని అనుక్షణం కాపలా కాయలేము. ఇంతకీ పోస్ట్‌మార్టమ్ రిపోర్టు వచ్చిందా సార్? "

"వచ్చింది. ఆమెనెవరో దారుణంగా రేప్ చేశారు. ఆ షాక్‌తోనే ఆమె మరణించింది"

'ఆ!' కొయ్యబారిపోయాడు సదాశివం.

"సుమతి ఆత్మహత్య చేసుకుని నాలుగు నెలలైనా కాలేదు ఇప్పుడు జయలక్ష్మి మరణం. అదీ సహజమైన చావు కాదు. ఆమె రేప్ చెయ్యబడింది. ఆమె రేప్‌కి గురయిందనడానికి సాక్ష్యంగా ఆమె రొమ్ములమీద, తొడల దగ్గర గోళ్ళతో గీరిన గుర్తులున్నాయి. కాని ఆమె హత్య చెయ్యబడలేదు. రేప్ చేసిన వాడు ఆమెపై బలంగా పడడం వలన అతిగా భయపడివుంటుంది. ఎడ్రినల్ అతిగా స్రవించిందని, అతిగా స్రవించిన ఎడ్రినల్ వెంట్రిక్యులర్ ఫ్రిజ్ లేషన్‌కి కారణ మయిందని, క్షణాలలో గుండె ఆగిపోయి వుంటుందని పోస్ట్‌మార్టమ్ నివేదిక"

"తన ఇన్వెస్టిగేషన్ ఏ దారిలో పోతోంది? ఆశ్రమంలో కొన్నాళ్ళుండిన సుమతి ఎయిడ్స్ వ్యాధిగ్రస్థురాలై ఆత్మ హత్య చేసుకున్నప్పటినుంచి ఆశ్రమంలో ఏదో జరుగుతోందని తన అనుమానం. తన అనుమానం నిరాధారమైనదా? " అతను ఆలోచనల నుంచి తేరుకుని అడిగాడు.

"చెప్పండి. జయలక్ష్మి ఇంటర్వ్యూకి ఎప్పుడు వెళ్ళింది? "

"16వ తారీఖున"

"ఎన్ని గంటలకి? "

"ఉదయం ఎనిమిది గంటలకి"

"ఇంటర్వ్యూ ఎక్కడ? " ఇన్‌స్పెక్టర్ నుంచి ఆ ప్రశ్నని ఊహించని సదాశివం కంగారుపడ్డాడు.

"తెలియదు. ఆమె తను ఇంటర్వ్యూకి వెళ్తున్నానని చెప్పింది. కాని ఇంటర్వ్యూ ఎక్కడో చెప్పలేదు"

"అంటే! మీ ఆశ్రమంలో వున్న ఆమెకి ఇంటర్వ్యూకి కాల్ లెటర్ మీ ఆఫీసు ఎడ్రస్‌కి రాలేదా? ఒకవేళ ఆమెకే పర్సనల్‌గా వస్తే ఆ లెటర్‌ని ఆమె మీకు చూపించ లేదా? "

"లేదు" కోపాన్ని నిగ్రహించుకుంటూ అన్నాడు.

"ఆశ్రమంలో మీ రక్షణలో వున్న ఒక ఆడపిల్ల ఇంటర్వ్యూకి వెళ్తున్నానని చెప్పగానే ఇంటర్వ్యూ ఎక్కడ అని అడగకుండా ఆమెని బయటకి పంపారు. అంతేనా? "

సదాశివం ముఖం ఎర్రబడింది.

"ఓ.కె. ఆమె ఇంటర్వ్యూకే వెళ్తోందని నమ్మి ఆమెని బయటకి పంపారు. ఆమె సాయంకాలానికైనా ఇక్కడికి రాని విష

యాన్ని గమనించారా?"

"లేదు"

"రాత్రి? రాత్రవుతున్నా ఆశ్రమానికి రాలేదనే విషయాన్ని గమనించారా?"

"ఆ బాధ్యత నాది కాదు. వార్డెన్ది"

"వార్డెన్ని పిలిపించండి"

"ఆమె లేదు. వాళ్ళ వాళ్ళకెవరికో సుస్తీగా వుందని సెలవు పెట్టి ఊరికి వెళ్ళింది"

"జయలక్ష్మితోబాటు ఇక్కడ వుండే మిగతా అమ్మాయిలని పిలిపించండి"

ముఖంలో మారుతున్న రంగులకి గంభీరత ముసుగు వేసుకుని అతను ఆయాని పిలిచి చెప్పాడు"

"మైసమ్మా! వెళ్ళి సుస్మితాసేన్ని, సీతని రమ్మన్నానని చెప్పు!"

బయట నిలబడి ఇన్స్పెక్టర్కి, అతనికీ మధ్య జరుగుతున్న సంభాషణని వింటున్న మైసమ్మ వెళ్ళి వాళ్ళని పిలిచింది.

"పోలీసులు అడిగితే జయలక్ష్మి 16వ తేదీ ఉదయం ఇంటర్వ్యూకి వెళ్ళిందని చెప్పండి. ఏ ఉద్యోగానికి, ఇంటర్వ్యూ ఎక్కడ అని అడిగితే మాకు జయలక్ష్మి చెప్పలేదని చెప్పండి"

"అలాగే" బుద్ధిగా తల వూపారు.

విజయ్ మైసమ్మ వెంట వచ్చిన ఆ ఇద్దరమ్మాయిల పేర్లు అడిగి తెలుసుకున్నాడు.

"జయలక్ష్మి ఇంటర్వ్యూకి ఎప్పుడు వెళ్ళింది?"

"16వ తారీఖు ఉదయం" సుస్మితాసేన్ చెప్పింది.

"ఆమె 15వ తారీఖు రాత్రినుంచే కనిపించలేదు" జ్వాల చెప్పింది. సదాశివం ఉలికిపాటుగా చూశాడు.

"మీకా విషయం ఎలా తెలుసు?"

"16వ తారీఖు ఉదయం ఆమె ప్రతిరోజూలా ప్రేయరుకి రాలేదు కాబట్టి"

"ఇంటర్వ్యూకి మొదటిసారిగా వెళ్తున్నాను. టెన్షన్గా వుంది. ప్రేయరుకి రానని చెప్పింది" అంది సుస్మితాసేన్.

సదాశివం మెచ్చుకోలుగా ఆమెవైపు చూశాడు. ఆమె అబద్ధం చెబుతోందని కళ్ళతోనే విజయ్కి తెలియజేసింది జ్వాల.

విజయ్కి నిస్పృహగా వుంది. 'ఈ ఇన్వెస్టిగేషన్వలన తనేం సాధించగలిగాడు? ఆలోచిస్తున్న అతని బుర్రలో ఫ్లాష్లా ఒక విషయం తట్టింది. పోస్ట్మార్టమ్ చేసిన డాక్టరు రిపోర్టులో జయలక్ష్మి మరణ సమయాన్ని రాయలేదని. అతను మరచిపోయాడా? లేక ఉద్దేశపూర్వకంగానే రాయకుండా వదిలేశాడా?'

ఆలోచిస్తూ లేచాడు. "ఒ.కే. నేను మళ్ళీ మిమ్మల్ని కలుస్తాను" అని బయటకి నడిచాడు.

"మీరిద్దరూ వెళ్ళచ్చు" అన్నాడు సదాశివం కోరగా జ్వాలవైపు చూస్తూ. వాళ్ళు వెళ్ళాక ఫోన్ దగ్గరకి లాక్కుని డయల్ చెయ్యసాగాడు.

★ ★ ★

అమెరికాలోని వెస్ట్వర్జీనియా రాష్ట్రంలో కాటన్వుడ్ స్ట్రీట్లో ఒక ఇంట్లో కూర్చుని వున్నాడు రామచంద్రప్రసాద్. అతని కెదురుగా కూర్చున్న యువతి సౌందర్యానికి భాష్యం చెబుతున్నట్టు వుంది. ఆ ఇద్దరి ముఖాలూ సీరియస్గా ఏదో ముఖ్యమైన విషయాన్ని చర్చించి దాంట్లో రాజీ కుదరనట్టు వున్నాయి.

"అర్థం చేసుకో ఇందూ!" అన్నాడతను. "మా నాన్నగారి ముందు నేనెప్పుడూ చిన్న అబద్ధం కూడా చెప్పలేదు. అలాంటిది ఇప్పుడింత పెద్ద అబద్ధం అదీ పెళ్ళి విషయంలో చెప్పడం... ఊహూ! నా వల్ల కాదు"

రోషంగా చూసింది ఇందుమతి. "అవును. నువ్వో సత్యహరిశ్చంద్రుడివి. అబద్ధమెలా చెబుతావు?"

"పొరపాటు. హరిశ్చంద్ర మా నాన్నగారి పేరు. నేను ఆయన ఆదర్శాల అడుగుజాడలలో నడిచే శ్రీరామచంద్రుడిని" నవ్వాడు.

"గొప్పే!" ఉక్రోషంగా అంది.

"కాదామరి. అసలు నేను ఆయన కడుపున పుట్టడమే అదృష్టం"

"నీలాంటి పిరికివాడిని ప్రేమించడం మాత్రం నా దురదృష్టం" కసిగా అంది.

"ఏమిటమ్మా, ఏదో సీరియస్ డిస్కషన్‌లో వున్నట్టున్నారు" అంటూ అక్కడకి వచ్చాడు ప్రొఫెసర్ వాసుదేవరావు.

"ప్రేమించడానికి అడ్డురాని కులం పెళ్ళి చేసుకోడానికి అడ్డు వస్తుందా, మీరే చెప్పండి డాడీ" ఇందుమతి ఫిర్యాదు చేస్తున్నట్టు అంది.

"ఎలా వస్తుంది? రాదు"

"ఆ విషయమే ఈ పెద్ద మనిషితో చెప్పండి"

రామచంద్రని చూస్తూ నవ్వాడాయన. "ఏమిటి రామ్? "

"మా పెళ్లికి మా నాన్నగారు ఒప్పుకోరేమో అని నా భయం అంకుల్! ఆయన్ని ఎదిరించి ఇందుని పెళ్లి చేసుకోలేను. ఆయన ఒప్పుకోరని ఇందుని వదులుకోలేను. మీరు మా కులమే అని మా నాన్నగారితో అబద్ధం చెప్పమంటోంది తను. ఒక పెద్ద అబద్ధం చెప్పి నేనామెని పెళ్ళి చేసుకున్నా ఎప్పుడో ఒకప్పుడు ఆ అబద్ధం బయటపడక తప్పదు. అప్పుడు నేను దోషిలా మా నాన్నగారి ముందు నిలబడలేను"

"అయితే ఒక పని చెయ్యి" అంది ఇందుమతి అతనివైపు గంభీరంగా చూస్తూ.

"ఏమిటో చెప్పు!"

"తూర్పు తిరిగి దణ్ణం పెట్టు"

"ఇది తూర్పేగా? ఇటున్నది నువ్వు. నీకే దణ్ణం పెడతాను. ఓ నా ప్రేమదేవతా! మన పెళ్లి మా నాన్నగారి ఆశీస్సులతో జరిగేలా చూడు" చేతులు జోడించి అన్నాడు.

వాళ్ళనే చిరునవ్వుతో చూస్తున్న వాసుదేవరావు అన్నాడు.

"నేను అమెరికాలో స్థిరపడి పది సంవత్సరాలయింది. ఎప్పుడూ కులసమస్య ఎదురవలేదు నాకు. నా కులమేమిటో నేనే మరచిపోయాను ఇక్కడకి వచ్చాక. అమెరికన్లు నన్ను ఇండియన్‌గా గుర్తించారు. వాళ్ళు నన్ను ఇండియన్ అన్నప్పుడల్లా నేను భారతీయుడిని అనే జాతీయభావంతో నా గుండె ఉప్పొంగుతోంది. మీరు ఆంధ్రులా అని ఇక్కడి తెలుగువాళ్ళు అడిగినప్పుడు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కోసం పోరాడిన పొట్టి శ్రీరాములుగారు గుర్తొచ్చి చేతులెత్తి ఆ మహనీయుడికి నమస్కరిస్తాను. అలాంటిది నా కులం ఇప్పుడు నా కూతురి పెళ్ళి విషయంలో పెద్ద సమస్యగా మారింది"

"మీరు చెబుతుంటారుగా డాడీ! నూరు అబద్ధాలాడి ఒక పెళ్ళి చెయ్యమంటారని. ఒక్క అబద్ధంతో మేము పెళ్ళి చేసుకోడం తప్పా? "

"తప్పా, ఒప్పా అని కాదమ్మా మనం ఆలోచించవలసింది. ప్రాక్టికల్‌గా అది సాధ్యపడుతుందా? "

"రామ్ సహకరిస్తే అవుతుంది" అంది రామచంద్రవైపు చూస్తూ.

"ఒకవేళ మన పెళ్ళయ్యాక అది అబద్ధమని బయటపడితే? " అన్నాడు రామచంద్ర సందేహంగా.

"పెళ్ళయ్యాక తెలిస్తే ఏంచేస్తారు? అంత అభ్యుదయ భావాలున్న మీ నాన్నగారు నాకు మీ ఇంటికోడలిగా స్థానం లేదంటారా? "

"నిజమేలే! పెళ్ళయ్యాక ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు? నీ సుగుణాలతో, వినయవిధేయతలతో ఆపాటికే అందరినీ మెప్పించి వుంటావు"

"మీ పెళ్ళివలన ఆ కుటుంబంలో కలతలు వచ్చి అవి పెద్దవై తండ్రీ కొడుకుల మధ్య కలహాలుగా మారితే నువ్వు సుఖపడలేవు. మరోసారి ఆలోచించమ్మా" అన్నాడు వాసుదేవరావు.

"ఇంక ఆలోచించేదేమీ లేదు డాడీ! అంతగా పెళ్ళయ్యాక రామ్ తండ్రికి నా కులం తెలిసి అభ్యంతరం చెప్తే మేమిద్దరం

# ఏరినముత్యాలు

- అన్యాయంతోనూ, చెడ్డ పనులతోనూ రాజీ పడడం అనేది అతి గొప్ప నేరం!
  – సుభాష్‌చంద్రబోస్
- నా తల్లి వలన నాకు లభించిన ముద్దుతో నేనొక చిత్రకారుణ్ణి అయ్యాను.
  – బెంజమిన్‌వెస్ట్
- నీకు నువ్వే న్యాయాధికారిగా వ్యవహరించు. ఇందువలన ఆనందంగా ఉండగలుగుతావు.
  – మహాత్మాగాంధీ
- నా గురించి నేను తెలుసుకున్నది ఏమంటే, నాకేమీ తెలియదని.
  – సోక్రటీస్
- మన ఆలోచనలు కప్పిపుచ్చుకోవడానికి మాటలు బాగా తోడ్పడతాయి!
  – వోల్టేర్
- బజార్లో వున్న వంద విలువైన వస్తువులకన్నా ఓ నవ్వు ఖరీదైనది, అత్యుత్తమమైనది!
  – అలెగ్జాండర్ పోప్
- నువ్వు తెలివైన వాడివి అయితే నవ్వు!
  – మేరీహల్
- అవసరానికి ఏ చట్టంలేదు. ఇందుకు తార్కాణంగా నేను కొందరు న్యాయాధిపతులను చూశాను!
  – ఫ్రాంక్లిన్
- ఒక వకీలు తలుచుకుంటే నిన్ను ఒక నిజాయితీపరునిగానూ చూపగలడు, నిన్నొక దొంగగానూ నిరూపించగలడు!
  – డబ్ల్యు.యస్.గిలిబర్ట్
- నవ్వు అనేది చక్కటి సంగీతం వంటిది. అది హృదయం చుట్టూ తిరిగి ఆనందం కలిగిస్తుంది.
  – శాండర్స్
- ఉదయం నువ్వు నేర్చుకున్నదంతా మింగెయ్యి. సాయంత్రం విజ్ఞుల సమక్షంలో దానిని జీర్ణింప చేసుకో!
  – లార్డ్‌చెస్టర్‌ఫీల్డ్
- విశ్రాంతి తీసుకోవడం, ఉపవాసాలు చెయ్యడం అనేవి అన్ని మందులకన్నా ఉత్తమమైన మందులు!
  – ఫ్రాంక్లిన్

సేకరణ: కొడిమెల శ్రీరామమూర్తి

తిరిగి ఇక్కడకి వచ్చేస్తాం. మా చదువులకి ఇక్కడ ఉద్యోగాలు దొరక్కపోవు"

"ఇందు చెప్పింది కరెక్ట్ అంకుల్!"

"నా ఒక్కగానొక్క కూతురు. నా భార్య దాని చిన్నతనంలోనే చనిపోతే తల్లీ తండ్రీ నేనే అయి పెంచాను. అది కష్టపడితే నేను చూడలేను"

"మీకు మాట ఇస్తున్నాను. ఇందును నా ప్రాణంగా చూసుకుంటాను అంకుల్!" అన్నాడు రామచంద్ర వాగ్దానమిస్తున్నట్టుగా.

**"నే**నీ ఉద్యోగంలో చేరబోవడంలేదు ప్రతిమగారూ!" రవి అలా అనగానే ప్రతిమ చివ్వున తల ఎత్తి చూసింది.

"ఎందుకీ నిర్ణయానికి వచ్చారు? "

"ఒకప్పుడు ఉద్యోగం కోసం తపించిపోయాను. ఉద్యోగం రాగానే ఒక చిన్న ఇంటిని అద్దెకి తీసుకుని శరణాలయం నుంచి నా చెల్లెలిని తెచ్చుకోవాలని, ఆమెకి పెళ్లి చెయ్యాలని కలలు కన్నాను. ఇప్పుడామె లేదు. ఇంక నేను ఎవరికోసం సంపాదించాలి. నా ఒక్కడి పొట్టకోసం నేను ఏ చిన్నపని చేసుకున్నా చాలు" విరక్తిగా వుందతని స్వరం.



"మీరు మీ చెల్లెలి గురించే ఆలోచిస్తున్నారు. లోకంలో ఎందరో అభాగినులున్నారు. వాళ్ళలో ఏ ఒక్కరి జీవితంలో వెలుగు నింపినా అది మానవత్వమనిపించుకోదా? మీ సంపాదనలో కొంత భాగాన్ని పేదలకి కేటాయించండి. కొందరికైనా చేయూతనివ్వండి" బ్యాగ్ తెరిచి కొన్ని కాగితాలను అతని చేతిలో పెట్టింది.

"వీటిని చూడండి"

రవి వాటినోసారి పరిశీలించి తల ఎత్తి అన్నాడు. "ఇవి మీకెవరో రాసి ఇచ్చిన ఆస్తి తాలూకు దస్తావేజులు"

"అవును. మా అమ్మమ్మ నాకు చెందేలా రాసి ఇచ్చిన ఆస్తి తాలూకు దస్తావేజులు. ఆ ఆస్తి విలువ పాతిక లక్షలు. నేను ఆ ఆస్తిని కేన్సర్ ఇన్‌స్టిట్యూట్‌కి రాయించడానికి లాయర్ దగ్గరకి బయలుదేరుతూ దారిలో మిమ్మల్ని చూసిపోదామని వచ్చాను"

ఆమెనే చూస్తున్న రవి కళ్ళలో అభినందన, ఆరాధన వ్యక్తమవుతున్నాయి.

"బతకడానికి డబ్బు అవసరం. డబ్బు సంపాదన కోసం బతకకూడదు. మన అవసరాలు తీరిన తరువాత మిగిలిన డబ్బు బాధలలో వున్నవాళ్ళకి విని యోగిస్తేనే ఆ డబ్బు సార్థకమయినట్టు"

రవికి ఆమెమీద వున్న గౌరవభావం రెట్టింపయింది.

మరునాడే అతను ఉద్యోగంలో చేరాడు.

★ ★ ★

జ్వాల రెండు రోజులనుంచి రమకి నచ్చ చెబుతోంది. "నేను చెప్పినట్టు చెయ్యి. ఆ అంకుల్ దగ్గరకి వెళ్ళు. ఆయనేం అడిగినా నవ్వుతూ సమాధానం చెప్పు"

"అంకుల్ మంచివాడు కాదక్కా! నావైపు అదోలా చూస్తాడు. నాకాయనంటే భయం" అయిష్టంగా అంది రమ.

"తప్పు చేసినవాళ్ళు భయపడాలి. ఆ తప్పుని బయట పెట్టడానికి భయపడకూడదు. నేనున్నాను. నువ్వు భయపడకు"

ఆమె ఎంతో నచ్చచెప్పాక రమ సదాశివం దగ్గరకి వెళ్ళడానికి అంగీకరించింది.

"నేను అనుకున్నది నెరవేరాక ఇంక మన మిద్దరం ఇక్కడ వుండక్కర్లేదు. నిన్ను నాతో మా ఇంటికి తీసుకెళ్తాను. నిన్ను మంచి స్కూల్‌లో జాయిన్ చేస్తాను. నీకు బోలెడుమంది స్నేహితులు వుంటారు. వాళ్ళతో హాయిగా ఆడుకోవచ్చు" భవిష్యత్తుపై ఆశ కలిగించింది. తన పథకానికి ఆ మధ్యాహ్నమే నాందీవాక్యం పలికింది జ్వాల. భోజనాల సమయంలో ఒంటరిగా చెట్టుకింద కూర్చుని అన్నం తింటున్న రమని కనుసైగతో అక్కడనుంచి లేపి కాస్త దూరంలో ఎవరితోనో మాట్లాడుతున్న సదాశివం దగ్గరకి పంపింది.

"అంకుల్!" రమ పిలుపుతో తల తిప్పాడతను.

"ఏమిటి? "

"నాకు స్వీటు అంటే చాలా ఇష్టం. కొనిస్తారా? " ఆమెని చూడగానే సదాశివం కళ్ళు మెరిశాయి.

తనతో మాట్లాడుతున్న పెద్దమనిషివైపు తిరిగి అన్నాడు. "పాపం! చిన్నపిల్ల! స్వీటు తినాలని వుందిట. నాకు ఇలాంటి పిల్లలని చూస్తే చాలా జాలి వేస్తుంది. అందుకే ఎప్పుడేనా స్వీటు కొనిపెడుతుంటాను"

"ఆ భగంతుడు మిమ్మల్ని చల్లగా చూస్తాడు" అన్నాడాయన.

"స్వీట్ చైల్డ్. నీ పేరేమిటమ్మా? " రమ బుగ్గలని పుణుకుతూ అన్నాడు.

"రమ అండీ!"

"వెళ్ళి అన్నం తిను. సాయంకాలం స్వీటు కొనిస్తాను" అన్నాడు సదాశివం.

"సరే అంకుల్!" అని రమ అక్కడనుంచి వచ్చేసింది.

ఆ సాయంకాలం అయిదుగంటలకి రమ ఒక్కర్తే ఆఫీసు రూమ్‌కి వెళ్ళింది. ఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతున్న సదాశివం ఆమెని చూసీ చూడనట్టు నటించాడు.

రమ అతను ఫోన్ పెట్టేదాకా సహనంతో అలాగే నిలబడింది.

"లోపలకి రా. ఏమిటిలా వచ్చావ్? "

"నాకు స్వీటు తెస్తానన్నారు కదంకుల్!"

"తెచ్చాను" అతను టేబిల్ మీదున్న పాకెట్టు తీసి ఆమెకి అందించాడు.

"నీకే స్వీటంటే ఇష్టం? "

"హల్వా, లడ్డు, కాజా, ఇంకా..."

"చాలు. నీకే స్వీటయినా ఇష్టమేనన్న మాట" ఆమె గుండెలవైపు చూస్తూ అన్నాడు.

"రెండు నెలల్లో చాలా ఎదిగిపోయావు" రమకి ఆ చూపులు కంపరాన్ని కలిగించాయి. ఈ అంకుల్ చాలా చెడ్డవాడు. అందుకే తులసి ఇతనిచ్చిన స్వీట్లు తినవద్దని చెప్పింది. సీతక్క పథకంలో సాయపడడానికి తనిక్కడకి వచ్చింది కాని లేకపోతే అసలు వచ్చేదే కాదు.

"నీకు స్వీటు ఇచ్చానుకదా! మరి నాకో ముద్దు పెట్టు"

రమ ముఖం పాలిపోయింది. 'తులసిని ఇలాగే ముద్దు అడిగివుంటాడు వీడు' మనసులోని ఏహ్యతను ముఖంలో కనబడనివ్వకుండా జాగ్రత్తపడుతూ మెల్లిగా అతని దగ్గరకి నడిచింది. అతని చేతిని అందుకుని పెదవులతో అంటీ అంటనట్టు తాకి వదిలేసింది.

"నీకు ముద్దు పెట్టుకోవడం రాదా? నేను నేర్పిస్తాను. ఇంకా చాలా నేర్పాలి నీకు" సదాశివం ఆమె చేతిని పట్టుకుని దగ్గరకి లాక్కున్నాడు.

రమ నిలువెల్లా వణికిపోతూ కళ్ళు మూసుకుని గట్టిగా అరిచింది.

"కాపాడండీ! రక్షించండీ!" గొంతు చించుకుని అరిచింది.

అనూహ్యంగా ఆమె అలా అరవడంతో బిక్కచచ్చిపోయిన సదాశివం ఆమె నోటిని మూసేసేలోగానే విసురుగా అతని చేతులని విదిలించి బయటకి పరుగుతీసింది.

కంగారుగా ఆమెని వెన్నంటి వచ్చిన సదాశివం ఆఫీసు మెట్ల దగ్గర గుమికూడి వున్న ఆశ్రమవాసులని చూసి బిక్కచచ్చిపోయాడు. ఆశ్రమంలోని వాళ్ళు తోటపని చేసే టైము అది. రమ అరుపులు విని చేస్తున్న పని వదిలి పరిగెట్టుకొచ్చారక్కడికి.

"ఏం జరిగిందమ్మా?" ఒక వృద్ధురాలు రమని పొదివి పట్టుకుని లాలనగా అడిగింది.

"ఆ అంకుల్ నన్ను ముద్దు పెట్టుకోబోయాడు" ఆమె లేత శరీరం ఆమె చేతుల మధ్య చిగురాకులా కంపిస్తోంది.

"చిన్నపిల్లవని ముద్దొస్తున్నావని ముద్దు పెట్టుకోబోయి వుంటారు. తప్పేమిటి?" మెట్లమీద నిలబడి పచ్చి వెలక్కాయ గొంతులో ఇరుక్కున్నట్టు చూస్తున్న సదాశివాన్ని ఓరగా చూస్తూ అంది జ్వాల.

"అంతే కాదక్కా! నన్నేదో చెయ్యబోయాడు. ఈ అంకుల్ మంచివాడు కాదు. అందుకే తులసక్క ఈ అంకుల్ స్వీటు ఇస్తే తినద్దని చెప్పింది" ఏడుస్తూ అంది.

సదాశివం అసహాయంగా పళ్లు కొరుక్కుంటున్నాడు. ఆమెని తనేదో చెయ్యబోయాడనే నిందారోపణకంటే అక్కడున్న జనం చూపులు అతని ఒళ్లు మండిపోయేలా చేస్తున్నాయి.

వార్డెన్ మండిపడుతూ అంది. "నీ వయసెంత? మేనేజరుగారి వయసెంత? చిన్నపిల్లవి కదా అని ముద్దు పెట్టుకోబోతే ఆయనేదో నిన్ను రేప్ చెయ్యబోయినట్టు గోలపెడతావేమిటి?"

జ్వాలకి ఆ రాత్రి తులసి తననేమీ చెయ్యవద్దని అతన్ని బతిమాలడం గుర్తువచ్చింది.

"తులసికి అంకుల్ స్వీటు ఇచ్చి ముద్దు పెట్టమంటే ఇలా భయపడేదా? చక్కగా అంకుల్ ఆమెకి రోజుకో స్వీటు ఇచ్చేవారు. ఆమె రోజుకో ముద్దు పెట్టేది. చివరకి అంకుల్ పెట్టిన స్వీట్లు తినితిని రక్తవిరేచనాలు అయి చచ్చిపోయింది" అంది జ్వాల.

"నువ్వు నోర్మూయ్!" వార్డెన్ గదిమింది. "స్వీట్లు తింటే రక్తవిరేచనాలవుతాయా?"

"ఏమో మరి. 'అంకుల్ నన్ను ముద్దుపెట్టుకున్నారు. మూడు నెలలనుంచి నెలసరి రావడం లేదని' తులసి నాతో చెప్పి ఏడ్చింది"

సదాశివం ముఖం మరింతగా పాలిపోయింది. పళ్లు కొరుకుతూ జ్వాలవైపు చూశాడు.

"రమ వూరికే భయపడింది కాని, జరిగిన దాంట్లో మీ తప్పేమీ లేదు సార్! మీరు చాలా మంచివారు. అనాథలైన మమ్మల్ని మీ తోబుట్టువుల్లా ఆదరిస్తున్న సంస్కారవంతులు. మీ మంచితనాన్ని అర్థంచేసుకోలేని ఈ పిచ్చిపిల్ల ఎంత యాగీ చేసిందో చూశారా? ఒక పని చెయ్యండి సార్! ఈసారి వీళ్లలో ఎవరికైనా స్వీటు ఇవ్వదలచుకుంటే అందరిముందూ ఇవ్వండి. రహస్యంగా మీ ఆఫీసురూమ్‌కి పిలిచి ఇవ్వకండి" జ్వాల అభిమానాన్ని కురిపిస్తూ అన్న ఈ మాటలు సదాశివానికి మంటెక్కేలా చేశాయి.

"ఏం జరుగుతోందిక్కడ!" గంభీరమైన స్వరం వినిపించి అంతా తలలు తిప్పి చూశారు.

హరిశ్చంద్రప్రసాద్‌గారు!

"అయ్యగారు! రాజాగారు!" హఠాత్తుగా ఆయన్ని అక్కడ చూసిన కంగారు ముఖంలో ద్యోతకమవుతుండగా అందరూ ముక్తకంఠంతో అన్నారు.

"నమస్కారమయ్యా!"

హరిశ్చంద్ర హుందాగా తలపంకించి, అందరినీ పేరు పేరునా పలుకరించారు. వారి యోగక్షేమాలడుగుతూ, వారిలో వృద్ధులని చెయ్యి పట్టి నడిపిస్తున్న ఆయన్ని అందరూ ఆరాధనగా, భక్తిగా చూస్తున్నారు. జ్వాల ఒక్కర్తే ఆయన్ని నిశితంగా పరీక్షిస్తోంది. వాళ్లపట్ల ఆయన కనబరుస్తున్న ఆత్మీయత తెచ్చిపెట్టుకున్నదిగా కని

పించింది ఎందుకో

"నడవండి. మీ పనులు చూసుకోండి" అదిలించింది వార్డెన్. అందరూ వెళ్లిపోయారు.

"రండి సార్! ఆఫీస్ రూమ్‌లో కూర్చుందాం" సదాశివం ఆఫీసు గదిలోకి దారితీశాడు.

హరిశ్చంద్ర కూర్చున్నాడు. "ఏమిటి, గొడవ? "

"గొడవేమీ లేదుసార్! రమ అని ఒక మ్మాయి... అమ్మాయంటే పెద్దదేమీకాదు. పదకొండేళ్ళు వుంటాయి. స్వీటు ఇచ్చి ముద్దుగా వుందని ముద్దుపెట్టుకోబోయాను. భయపడి అరిచింది. ఏమయిందో ఏమిటో అని జనం పోగడ్డారు"

"అసలు చిన్న పిల్లలనేకదుటయ్యా నువ్వు ముద్దుపెట్టుకునేది? " ఆయన స్వరంలోని వ్యంగ్యానికి అతని ముఖం ఎర్రబడింది.

"తులసితో సరసాలాడి, ఆ పిల్లకి కడుపు చేశావు. ఆ అమ్మాయికి మూడో నెల అని తెలిసి నువ్వూ, వార్డెన్ కలిసి నాటుమందు మింగించి ఓవర్ బ్లీడింగ్‌తో వాతం కమ్మి అది చచ్చేస్థితిలో వుండగా హాస్పిటల్‌లో పడేశారు. మసిపూసి మారేడుకాయచేసి అది రక్తవిరేచనాలతో చచ్చిపోయిందని జనాన్ని మాయచేశాము కాని, లేకపోతే ఎంత రచ్చయ్యేది? "

"జయలక్ష్మి విషయంలో మన చేతులకి మట్టి అంటదని సంతోషించాముగాని, దాని వ్యవహారం మన పీకకి చుట్టుకునేలా వుంది సార్" మాట తప్పిస్తూ అన్నాడు.

"నువ్వుగానీ, నేనుగానీ దాన్ని రేప్ చేశామా? అది ఆ రాత్రి మన గెస్ట్‌హవుస్‌కి వచ్చిందని నీకు, నాకూ, వార్డెన్‌కి దాన్ని అనుభవించిన ఎమ్.పి.గారికి తప్ప నరమానవుడికి తెలియదు. దాని శవాన్ని పోలీసులు కనుక్కున్నది ఊరవతల తాటితోపులో జయలక్ష్మి ఇంటర్వ్యూకని బయటకి వెళ్ళింది. చీకటిపడి శరణాలయానికి వస్తుండగా దుండగులెవరో దాన్ని ఎత్తుకెళ్లి రేప్ చేస్తే చచ్చి వూరుకుంది. దోషి ఎవరన్నది అంతు పట్టని మిస్టరీగా వుండిపోయింది"

"ఆ మిస్టరీ వెనుకవున్న హిస్టరీని తవ్వడానికి ఇన్‌స్పెక్టర్ మన శరణాలయానికి వచ్చాడు"

సదాశివం చెప్పగానే హరిశ్చంద్ర భృకుటి ముడిపడింది.

"డి.ఎస్పీ.కి ఫోన్‌చెయ్యి"

ఆయన ఆదేశంపై సదాశివం ఫోన్ నెంబర్ డయల్ చేశాడు. అవతల డి.ఎస్పీ ఓబుల్‌రెడ్డి లైనులోకి రాగానే "నమస్కారం సార్! నేను శరణాలయంనుంచి మాట్లాడుతున్నాను. మా అయ్యగారు మీతో మాట్లాడుతారుట" అన్నాడు.

"నమస్తే సార్! చెప్పండి" అన్నాడు ఓబుల్‌రెడ్డి హరిశ్చంద్ర లైనులోకి రాగానే.

"మీరే చెప్పాలి. నా ఆశ్రమంలోని అనాథనెవరో రేప్ చేసి చంపేస్తే దానికి మేము బాధ్యులమా? పోలీసులని మా శరణాలయానికి ఇన్వెస్టిగేషన్‌కోసం పంపారుట. ఏమిటి సంగతి? "

"నేనెవరినీ పంపలేదు సార్!" అతనింకా ఏదో చెప్పబోతుండగానే మధ్యలోనే అడ్డుపడ్డాడు హరిశ్చంద్ర.

"ఇంకెప్పుడూ ఇక్కడకి రావద్దని ఆ కుర్ర ఇన్‌స్పెక్టర్‌కి చెప్పండి"

"ఇన్‌స్పెక్టర్ విజయ్ వచ్చాడా సార్? "

"అవును"

"నేను చూసుకుంటాను సార్! మీరు నిశ్చింతగా వుండండి" అన్నాడు.

"వుంటాను" ఫోన్ కట్ చేశాడాయన.

"సార్! సీత అనే పిల్ల ప్రమాదకరంగా కనిపిస్తోంది? "

"సీతా? ఎవరా పిల్ల? "

"మన శరణాలయంలోని ఒక అనాథ. మూడు నెలలక్రిందట మన ఆశ్రమానికి వచ్చింది. మిస్ వరల్డ్ రేంజ్‌లో వున్నంత అందగత్తె"

"స్పెషల్ క్వార్టర్సులో వుంటుందా?"

"అవును సార్! నా అనుమానం తులసి గర్భవతి అని ఆ పిల్లకి తెలుసు. ఇందాక నేను రమని ముద్దుపెట్టుకోబోయినప్పుడు గొడవ చేసిందని చెప్పాను కద సార్! సీత తులసితో నా వ్యవహారం దానికి తెలుస న్నట్టే మాట్లాడింది. అలాంటి పిల్ల మన ఆశ్రమంలో వుంటే మనకి ప్రమాదం"

"ఏడిసింది. అదేం చేస్తుంది? మన పని పూర్తయ్యాక దాన్ని ఎక్కడకి పంపాలో నేను చెబుతానుగా? నువ్వు మాత్రం జాగ్ర త్తగా వుండు. చిన్నపిల్లలని చూస్తే రెచ్చి పోయి వాళ్లని ముద్దుపెట్టుకోకు. జయలక్ష్మి కేసు పాతబడేదాకా మనం చాలా జాగ్ర త్తగా వుండాలి" హెచ్చరించాడు.

★ ★ ★

"జయలక్ష్మి కేసులో నువ్వెందుకింత పట్టుదలగా వ్యవహరిస్తున్నావో నాకర్థం కావడంలేదు మిస్టర్ విజయ్! నువ్వు ఇన్వె స్టిగేషన్ పేరుతో శరణాలయానికి వెళ్లడం వలన హరిశ్చంద్రప్రసాద్‌గారి పరువు ప్రతి ష్టలేమవుతాయో ఆలోచించావా?" ముడివ డిన భృకుటితో చూస్తూ తనని సంజాయిషీ అడుగుతున్నట్టు నిలదీస్తున్న డి.ఎస్పీ.ని ఆశ్చర్యంగా చూశాడు విజయ్.

"హరిశ్చంద్రగారి పరువు ప్రతిష్టలకి భంగం కలుగచెయ్యడం నా అభిమతం కాదు సార్! కానీ, నాకెందుకో సదాశివం నిజం చెప్పడంలేదనిపిస్తోంది. అతను జయలక్ష్మి ఇంటర్వ్యూకి వెళ్ళిందని చెబుతు న్నాడు కాని ఏ ఆఫీసులో, ఇంటర్వ్యూ జరి గిన ప్రదేశం ఎక్కడ అని అడిగితే తనకి తెలియదంటున్నాడు. అసలు ఇంటర్వ్యూకి కాల్ లెటర్ తన ఆఫీసుకి రాలేదంటు న్నాడు. అతను జయలక్ష్మి ఇంటర్వ్యూకి 16వ తేదీ ఉదయం వెళ్ళిందని చెప్తే ఒక అమ్మాయి మాత్రం 15వ తేదీ రాత్రి నుంచే ఆమె శరణాలయంలో కనబడలేదని చెప్పింది. జయలక్ష్మి మృతదేహాన్ని పోస్ట్ మార్టమ్ చేసిన డాక్టరు మరణ సమయాన్ని తన నివేదికలో రాయడం మరచిపోయాడా లేక ఉద్దేశపూర్వకంగానే రాయలేదా అనే కోణంలో కేసుని పరిశోధిస్తే తప్ప సదాశివం ముద్దాయి అవునా కాదా అనే విషయం బయటపడదు"

"ఏమిటోయ్, ఇంకా బయటపడ్డానికే ముంది? ఆడపిల్ల ఒంటరిగా బయటకి వెళ్తే ఏమవుతుందో జయలక్ష్మి విషయంలోనూ అదే జరిగింది. ఆఫ్టరాల్ ఒక మామూలు ఆడపిల్ల మరణంపై నీకెందుకింత ఇంట్రెస్ట్? ఈ కేసుని క్లోజ్ చేసెయ్యి" విజయ్ ఆశాభంగం పొందినట్టు చూశాడు.

గతంలో సుమతి కేసు... ఇప్పుడు జయ లక్ష్మి కేసు క్లోజ్ చెయ్యమన్న డి.ఎస్పీ. ఆదేశం అతనిలో ఎన్నో అనుమానాలని రేకెత్తిస్తోంది. డి.ఎస్పీ. హరిశ్చంద్ర వర్గం లోని మనిషేనా? హరిశ్చంద్ర స్వప్రయోజ నాలకోసం శరణాలయంలోని ఆడపిల్లలని వాడుకుంటున్నాడనే సుమతి ఉత్తరంలోని విషయాలు నిజమేనా? తను ఈ కేసుని పరిశోధిస్తే తప్ప ఆమె రాసిన ఉత్తరంలో నిజమెంతో, అబద్ధమెంతో తెలియదు. కానీ డి.ఎస్పీ. తనకి అందుకు అవకాశం ఇవ్వ డంలేదు. జ్వాల బయటకి వచ్చాక కానీ ఆశ్రమంలో ఏం జరుగుతోందో తెలియదు. ఆమె సరైన సాక్ష్యాధారాలతో బయటకి వచ్చాక అప్పుడు డి.ఎస్పీ. ముందు సగ ర్వంగా నిలబడి సాక్ష్యాలను చూపించి, దోషులని అరెస్టు చెయ్యాలి, జ్వాల బయ టకి వచ్చేవరకూ తొందరపడకూడదని నిశ్చ యించుకున్నాడతను.

★ ★ ★

రామచంద్రప్రసాద్ వస్తూనే తల్లి పాదా లని తాకి నమస్కరించాడు. రెండున్నర సంవత్సరాల తర్వాత స్వదేశానికి వచ్చిన కొడుకుని చూసి సుధేష్ణాదేవి కళ్లలో ఆనందం అశ్రురూపంలో వ్యక్తమయింది.

ఆ సాయంకాలం రామచంద్ర స్వదేశానికి

వచ్చిన సందర్భంగా పెద్ద పార్టీ ఏర్పాట యింది.

ఎమ్.ఎల్.ఏ., ఎం.పీ. లాంటి రాజకీయ వేత్తలు, బిజినెస్ పీపుల్, కాంట్రాక్టర్లు, డి.ఎస్పీ.లాంటి పోలీసు అధికారులు ఆ పార్టీకి ఆహ్వానితులుగా వచ్చారు.

తన చేతికి విదేశీ మద్యం వున్న గ్లాసుని అందివ్వబోతున్న కాంట్రాక్టరు మోహనరావు గారిని వారించాడు రామచంద్ర.

"నో థ్యాంక్స్! నాకు అలవాటు లేదండీ!"

"అమెరికాలో వుండి వచ్చి అలవాటులేదం టావేమిటోయ్? "

"నేను హరిశ్చంద్రగారబ్బాయినండీ. ఆయన క్రమశిక్షణలో పెరిగిన నాకు అమె రికాలోవున్నా ఆయన మాటలు కొరడా ఝుళిపింపులా వినిపిస్తూనే వుండేవి. తన వ్యక్తిత్వాన్ని కోల్పోయిన మనిషికి మిగిలే దేదీ వుండదనే బాపూజీ మాటలని ఆయన చిన్నతనం నుంచీ నాకు చెబుతూండేవారు. ఆయన మాటలే నాకు శిరోధార్యం"

హరిశ్చంద్ర పుత్రోత్సాహంతో పొంగిపో తున్నాడు.

"మీ అబ్బాయి చదువు పూర్తయింది. మీ వారసుడిగా వ్యాపార రంగంలో కాలూనబో తున్నాడు. ఇంక పెళ్ళి చేసి మాకు బ్రహ్మాం డమైన విందుభోజనం పెట్టాలి" ఎమ్.ఎ ల్.ఏ.గారన్నారు.

"మా అబ్బాయికి, అమ్మాయికి కూడా సంబంధాలు చూస్తున్నాం. ఇద్దరి పెళ్ళిళ్ళూ ఒకేసారి చేస్తాం" అన్నారు హరిశ్చంద్ర.

రామచంద్రకి ఇందుమతి గుర్తుకొచ్చింది.

★ ★ ★

జ్వాల ఒంటరిగా కూర్చుని వుంది. ఆమెకి వుండివుండి తులసి, జయలక్ష్మి గుర్తుకొస్తు న్నారు. 'తులసి మరణానికి కారకుడు సదా శివం అని తెలిసే అతన్ని దోషిగా నిలబెట్ట లేకపోయింది. కేవలం రమని అతనేదో చెయ్యబోయాడనే తన సాక్ష్యం చాలదు. జయలక్ష్మి కేసు ఇన్వెస్టిగేషన్ విషయంలో శరణాలయానికి వచ్చిన బావ మళ్ళీ రాలే దెందుకని? సరైన సాక్ష్యాధారాలు లభిం చకా? జయలక్ష్మి 15వ తారీఖు రాత్రే ఆశ్ర మంలో కనబడలేదని తను సాక్ష్యం చెప్తే, సుస్మితా సేన్ 16వ తారీఖు ఇంటర్వ్యూకి వెళ్ళే ముందు కూడా ఆమె కనబడిందని అబద్ధం ఎందుకు చెప్పింది? సదాశివానికి భయపడా? లేక అతన్ని రక్షించడానికా?'

ఆలోచిస్తున్న ఆమె తననెవరో పిలవడంతో ఉలిక్కిపడి తలతిప్పి చూసింది.

సుస్మితా సేన్!

"ఏమిటి అంత ఉలిక్కిపడ్డావ్? "

"ఏదో ఆలోచిస్తూ పరధ్యాన్నంగా వుండి నువ్వు పిలిచేప్పటికి ఉలిక్కిపడ్డాను" అంది నవ్వుతూ.

"అంతేనా నన్ను చూసి భయపడ్డావా? "

"నిన్ను చూస్తే నాకెందుకు భయం? "

"అవును. నన్ను చూసి నువ్వెందుకు భయపడతావు? నిన్ను చూస్తే నాకే భయంవేసింది. అంత జంకు, గొంకు లేకుండా పోలీస్ ఇన్స్పెక్టర్‌కి సాక్ష్యం చెప్పి నందుకు"

"నిజం చెప్పడానికి భయమెందుకు? అంటే నువ్వు ఆ రోజు అబద్ధం చెప్పిన ట్టేగా? నువ్వు జయలక్ష్మిని 16వ తేదీ ఉదయం ఆశ్రమంలో చూశావా? "

"లేదు"

"మరెందుకు అబద్ధం చెప్పావు? ఆయా చెప్పమందనా? లేక సదాశివాన్ని రక్షించే ప్రయత్నమా? "

"ఈ ఆశ్రమం నాకు ఆశ్రయాన్నిచ్చింది. తిండి, బట్ట ఇస్తోంది. అంటే ఇంకో రకంగా చెప్పాలంటే ఈ ఆశ్రమం అమ్మ ఒడిలాం టిది. అమ్మకి ఆపద కలగబోతోందంటే ఎవరైనా రక్షిస్తారా లేదా"

"అమ్మ ప్రేమలో స్వార్థం వుండదు. త్యాగం వుంటుంది. మనచేత ఉద్యోగం చేయించి రాజాగారు లాభం పొందుతున్నా రని ఒకప్పుడు నువ్వే అన్నావుగా? అంటే

ఈ ఆశ్రమం నీపై కనబరిచే ప్రేమలో స్వార్థం వుందన్నమాటేగా? స్వార్థంలేని అమ్మ ప్రేమని గుర్తించి మనం ప్రతిగా ఆవిడపై ప్రేమని పెంచుకుంటాం. కాని ఈ స్వార్థపరులని నువ్వెందుకు రక్షించాలనుకుంటున్నావు? "

"వీళ్లకి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్తే మనని క్కడ వుండనివ్వరు. బయటకి వెళ్తే బతకలేం"

"నువ్వు ఉద్యోగం చేస్తున్నానన్నావుగా? నీ బతుకు నువ్వు బతకలేవూ? "

"బయటకి వెళ్తే ఇంకా దిగజారిపోవలసి వస్తుంది"

"అంటే! నువ్విప్పటికే దిగజారావా? అసలు నువ్వు చేసే ఉద్యోగమేమిటి? "

"తెలుసుకుని ఏం చేస్తావు? "

"నేనూ ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నాను. టెన్త్‌క్లాసు కూడా ప్యాసవని నీకు ఏం ఉద్యోగం వచ్చిందో తెలుసుకుని నా అర్హతలకి అంతకంటే మంచి ఉద్యోగం వస్తుందో రాదో తెలుసుకుందామని"

సుస్మితాసేన్ కళ్లలో నీళ్లూరాయి. "నేను చేస్తున్న ఉద్యోగమేమిటో నువ్వు తెలుసుకోకపోవడమే మంచిది"

"స్మగ్లింగా? "

"కాదు"

"మరి దొంగ కరెన్సీ వ్యాపారమా? "

తల అడ్డంగా వూపింది.

"మరి? "

"ఉద్యోగం చెయ్యాలని అనుకుంటున్నావుగా? నీకే తెలుస్తుంది. తినబోతూ రుచి అడగడమెందుకు? " అని సుస్మితాసేన్ అక్కడనుంచి వెళ్ళిపోయింది.

జ్వాల తన ఉద్యోగం విషయంలో సదా శివాన్ని కలుసుకోవాలని నిశ్చయించుకుంది.

★ ★ ★

రామచంద్ర ప్రసాద్‌కి ఇందుమతి గుర్తొచ్చింది. అప్రయత్నంగానే అతని పెదవులపైకి చిరునవ్వు వచ్చింది. మనసులో తప్పుచేస్తున్నాననే భావన ముల్లులా గుచ్చుకుంటోంది.

తండ్రి తన పెళ్ళి ప్రయత్నాలలో తలమునకలవడం తెలుస్తూనే వుంది. ఏవేవో ఫొటోలు... జాతకాలు మొత్తం మీద తన పెళ్ళి విషయంలో గట్టి ప్రయత్నాలు చేస్తున్నట్టే వుంది. అతని మనసులో అశాంతి అలలా లేచింది.

'ఇంక ఆలస్యం చేస్తే లాభంలేదు. ఇందుమతి విషయం తండ్రితో చెప్పాలి. ఆమె తమ కులం కాదన్న మాటేగాని, ఈ ఇంటి కోడలు కాదగిన అర్హతలన్నీ వున్నాయి. కాని ఆమె కులం విషయాన్ని తండ్రినుంచి దాచి ఆమెని పెళ్ళి చేసుకోగలడా? ' ఆ అబద్ధం చెప్పనని అతని మనసు మొరాయిస్తోంది. అతను లేచి గది బయటకి వచ్చాడు. అతని కాళ్లు అప్రయత్నంగానే తల్లి గదిలోకి లాక్కెళ్లాయి.

సుధేష్ణాదేవి చేతిలోని పుస్తకాన్ని దీక్షగా చదువుతోంది.

"అమ్మా!" అతను ఆవిడ పాదాల దగ్గర తివాచీపై కూర్చుంటూ పిలిచాడు.

ఆమె తల ఎత్తింది. "అక్కడ కూర్చున్నావేం బాబూ! కుర్చీలో కూర్చో"

అతను ఆవిడ మోకాలిమీద తలానించుకున్నాడు. "నేనొక అమ్మాయిని ప్రేమించానమ్మా! కాని ఆ విషయాన్ని నాన్నగారితో చెప్పే ధైర్యం లేదు నాకు"

"ఆ అమ్మాయి మన కులం కాదా బాబూ"

"కాదమ్మా! నాతోబాటు ఎమ్.ఎస్. చేసింది. చాలా అందంగా వుంటుంది. అన్నింటినీ మించి ఆమె చాలా మంచిది"

ఆవిడ చిరునవ్వు నవ్వింది. "పిరికివాళ్లు ప్రేమించకూడదు ప్రేమించాక భయపడకూడదు"

"మా పెళ్ళయ్యాక ఆ అమ్మాయి మన కులం కాదని తెలిసినా నాన్నగారు ఏమీ చెయ్యలేరంటుంది ఇందుమతి. నాన్నగారి

ముందు అబద్ధం చెప్పడానికి నాకు నోరు రావడంలేదు"

సుధేష్ణాదేవి కళ్ళముందు తన మొదటి రాత్రే పనిమనిషితో కులికిన భర్త మెదిలాడు.

"నువ్వు తీసుకున్న నిర్ణయం సమంజసమైనదే అని నీ మనసు నమ్మితే ఒక్క నిజాన్ని దాచి ఆమెని పెళ్ళిచేసుకున్నా ఫర్వాలేదు"

రామచంద్ర మనసు తేలికపడింది. ఆ రాత్రే అతను తండ్రి దగ్గర ఇందుమతి ప్రస్తావన తెచ్చాడు.

కొడుకు ఎవరో అమ్మాయిని ప్రేమిస్తున్నానని చెప్పగానే హరిశ్చంద్ర భ్రుకుటి దగ్గరయింది.

"ఎవరా అమ్మాయి? అమెరికనా? ఇండియనా? "

"మన ఆంధ్రా అమ్మాయే నాన్నగారూ! ఆమె తండ్రి అక్కడ యూనివర్సిటీలో ప్రొఫెసరు. వాళ్లు అక్కడ స్థిరపడి పది సంవత్సరాలవుతోంది. నాతో బాటు ఎమ్. ఎస్ చేసింది"

"మన కులమేనా? "

"మన కులమే"

"సరే! నీకిష్టమైన అమ్మాయితో నీ పెళ్లి జరిపించడం తండ్రిగా నా ధర్మం. కానీ ఈ విషయాన్ని ప్రతిమకి ఎట్టి పరిస్థితులలోనూ తెలియనివ్వకు. నీ ప్రేమ పెళ్లిని అంగీకరించానని రేపు అది ఎవరినో ప్రేమించానంటుంది. ప్రేమించడం తప్పని నేను అనను. కాని వయసు వేడిలో ఆకర్షణనే ప్రేమ అని భ్రమపడి జీవితాన్ని నాశనం చేసుకుంటారీ ఆడపిల్లలు"

"చెప్పను నాన్నగారూ"

"ఆ అమ్మాయి తండ్రి ఫోన్ నెంబర్ ఇయ్యి. మాట్లాడతాను"

"అలాగే నాన్నగారూ" తండ్రి ఇంత సులువుగా అంగీకరిస్తాడనుకోలేదతను.

హరిశ్చంద్రప్రసాద్ మనసుని అసంతృప్తి దొలుస్తూనే వుంది. ఎమ్.పిగారి బావమరిది కూతురిని కొడుక్కి చేసుకుని తమ మధ్య వున్న స్నేహాన్ని వియ్యంగా మార్చుకుని కాంట్రాక్టర్‌గా సుస్థిర స్థానాన్ని సంపాదించుకోవాలనుకున్నాడు. ఆ ఆశలని వమ్ము చేస్తూ కొడుకు ఎవరినో ప్రేమించానంటున్నాడు. కొంతలో కొంత నయం. సంఘంలో హోదా వున్న తనతో సమానంగా చదివిన తమ కులపు అమ్మాయినే ప్రేమించాడు. ఆయన అసంతృప్తిగానే కొడుకు పెళ్లికి అంగీకరించాడు.

★ ★ ★

జ్వాల ఆఫీసు గది బయట నిలబడి పిలిచింది 'సార్'

సదాశివం తల ఎత్తి చూశాడు. జ్వాలని చూడగానే అతని కళ్లలో ఎర్రజీర మెరిసింది.

"ఏమిటిలా వచ్చావు? "

"అది... అది.. నా ఉద్యోగం గురించి మీతో మాట్లాడదామని"

"ఏం చదివావు? "

"ఇంటర్ చదివాను. కానీ పరీక్షలు రాయలేదు"

"అయ్యగారికి చెబుతాలే"

"దయవుంచండి సార్!" ఆమె చేతులు జోడించి నమస్కరించి వెనుదిరిగినదల్లా మళ్లీ వెనక్కి వచ్చింది.

"ఒక్క విషయం సార్"

"ఏమిటి"

"పోలీసులు వస్తే నన్ను పిలవకండి. నాకు వాళ్లని చూస్తే భయం" ఆ క్షణంలో ఆమె ముఖంలో కనిపించిన భయానికి, అమాయకత్వానికి సదాశివం ఫ్లాటయిపోయాడు.

"ఆ ఖాకీ యూనిఫారం చేతిలో లాఠీ చూస్తేనే నాకు దడదడలాడిపోతుంది. అందుకే ఆ రోజు ఆయా చెప్పమన్నట్టు కాకుండా ఏదేదో చెప్పాను. సుస్మితాసేన్ చెప్పిన దాన్ని ఆ ఇన్‌స్పెక్టర్ నమ్మబట్టి కాని లేకపోతే ఎంత గొడవ జరిగి వుండేది?

నాపై కోపం వుంచుకోకుండా దయవుంచి నాకేదైనా ఉద్యోగం ఇప్పించమని అయ్యగారితో చెప్పండి" ఆమె గొంతులోని నిజాయితీ, దైన్యం అంత లావు సదాశివాన్ని కదిలించివేశాయి.

"అలాగే! రేపు అయ్యగారు ఇక్కడకి వచ్చినప్పుడు నీ గురించి మాట్లాడతాను"

"థ్యాంక్స్ సార్! మీ ఋణం తీర్చుకోలేను" ఆమె చేతులు జోడించింది.

★ ★ ★

ప్రతిమ, రవి రెస్టారెంట్‌లో ఎదురెదురుగా కూర్చున్నారు. అతని ముఖంలో దాచుకుందామన్నా దాగని బాధావేదనలు ప్రతిఫలిస్తుంటే అతను జయని తలచుకుని బాధపడుతున్నాడని ప్రతిమ గ్రహించగలిగింది. ఆమె మనసు ఆర్ద్రమై కళ్లలో నీటి పొర కదలాడింది. అతని మూడ్‌ని మార్చే ప్రయత్నంలో అంది.

"మా అన్నయ్య స్టేట్స్ నుంచి వచ్చాడు"

"మీకో అన్నయ్య వున్నాడా? మీరా విషయం ఎప్పుడూ చెప్పలేదే"

"సందర్భం రాలేదు"

"మీ అన్నయ్య అమెరికాలో వుంటారా? "

"బి. టెక్ ఇక్కడ చదివి ఎమ్. ఎస్. చెయ్యడానికి అమెరికా వెళ్లాడు. చదువు పూర్తయింది. ఇక్కడే వుండి మా నాన్నగారికి బిజినెస్‌లో సాయపడతాడు"

"అలాగా"

"మీరొకసారి మా ఇంటికి వస్తే మా అన్నయ్యని పరిచయం చేస్తాను"

"కొంచెం బిజీగా వున్నానండి. తర్వాత వీలు చూసుకుని వస్తాను"

"మీకు మా ఇంటికి రావడం ఇష్టంలేదు కదూ? "

"అలా ఎందుకనుకుంటున్నారు? "

"కాలేజీ అయ్యాక మా ఇంటికి రావచ్చుగా? "

"ఏదో రాస్తున్నాను... పూర్తి చెయ్యాలని"

"మనసుంటే మార్గం వుండకపోదు"

"అర్థం చేసుకోండి"

"మీరెందుకు మా ఇంటికి రానంటున్నారో తెలుసులెండి. మా నాన్నగారు నా హెచ్చరికను పెడచెవిన పెట్టి మీకీ ఉద్యోగం రావడానికి రికమండ్ చేశారని నోరు జారారనేగా? "

"నా ఉద్యోగం రికమండేషన్ వలన వచ్చిందని నాకు తెలియడం వలన వచ్చిన ప్రమాదమేమీలేదు"

"మీ ఆత్మాభిమానం ఎలాంటిదో నాకు తెలుసు"

"ఆత్మాభిమానం కడుపు నింపదని తెలుసుకుని చాలా ఏళ్లయింది"

"మా నాన్నగారు మీ మనసుని బాధపెట్టి వుంటే ఆయన తరపున నేను మిమ్మల్ని క్షమాపణ కోరుకుంటున్నాను"

"అయ్యయ్యో! అదేం లేదండీ. మీరు ఏవేవో ఊహించుకుంటున్నారంతే"

"ఎలా వుంది మీ ఉద్యోగం"

"నా స్టూడెంట్సు నేను పెద్ద మేధావినన్నట్టు ఎడ్మైరింగ్‌గా చూస్తుంటే కాస్త థ్రిల్లింగ్‌గా మరి కొంచెం సిగ్గుగా వుంది"

"మీరు మేధావి కాదని ఎవరన్నారు? కాలం కలిసిరాక కాని లేకపోతే ఇంకా పెద్ద ఉద్యోగమే వచ్చేది"

"నాకు పెద్దపెద్ద ఆశలు లేవండీ. నా కనీస అవసరాలు తీరితే చాలు. మిగతా డబ్బు పేదవాళ్లకోసం వెచ్చించాలని మాత్రం ఆశ వుంది. మరచిపోయాను. ఇవాళ జీతం అందుకోగానే శరణాలయానికి వెళ్లి సగం జీతాన్ని మా చెల్లెలి పేర విరాళంగా ఇచ్చాను"

ప్రతిమ మెరుస్తున్న కళ్లతో అతన్ని చూస్తూ అభినందనగా అంది. "వెరీగుడ్! ఈ విషయం చెప్తే మా నాన్నగారికి మీరు తప్పక నచ్చుతారు. ఆయన ఆశయాలకి సమ ఉజ్జీ అయిన వ్యక్తి దొరికినందుకు"

"మీ నాన్నగారికి నేను నచ్చడమేమిటి? "

"ఏమీ లేదులెండి" ప్రతిమ బుగ్గలలో రేకులు విప్పుకున్న మందారాలు అతనికి అనేక కథలని చెప్పాయి.

★ ★ ★

రాత్రి పది గంటలవేళ సదాశివంతో కలిసి గెస్ట్‌హవుస్ వైపు నడుస్తోంది జ్వాల. ఏదో జరగబోతోందని ఆమె సిక్స్‌సెన్స్ హెచ్చరిస్తోంది. హరిశ్చంద్ర ఎమ్.పిగారికి తన గురించి చెప్పారని, ఆయన తనని ఒక సారి చూడాలనుకుంటున్నారని చెప్పాడు సదాశివం.

ఆయన తనని చూడ్డమెందుకో ఆమెకి అర్థం కాలేదు. తన అర్హతలకి తగిన ఉద్యోగమేదైనా ఖాళీ వుంటే ఆయన నిజంగా తనకి ఉద్యోగం ఇప్పించదలచుకుంటే ఆ ఉద్యోగానికి తనని రికమండ్ చెయ్యవచ్చు అంతే గాని తనని చూడ్డ మేమిటి? జయల క్ష్మిని కూడా ఇలాగే సదాశివం గెస్ట్‌హవుస్‌కి తీసుకొచ్చి వుంటాడా? ఆమెని దారుణంగా రేప్ చేసి ఆమె చావుకి కారకుడైన వ్యక్తి ఎవరు?

"నువ్విక్కడ వుండు" అని సదాశివం బెడ్ రూమ్ ముందు ఆగి తలుపు తట్టాడు.

"కమిన్" లోపల నుంచి వినిపించింది. అతను తలుపు తీసుకుని ఆ గదిలోకి వెళ్తూ జ్వాలని వెంట రమ్మని సైగ చేశాడు.

జ్వాల గదిలోకి నడిచింది.

"నమస్కారం సార్! అయ్యగారు మీకు చెప్పినది ఈ అమ్మాయి గురించే. పేరు సీత. తమరు దయతలచి ఈమెకేదైనా ఉద్యోగం ఇప్పిస్తే మీకు జీవితాంతం ఋణ పడి వుంటుంది"

ఎదురుగా విశాలమైన డబుల్ బెడ్ మీద కూర్చుని వున్న ఎమ్.పి గారిని చూస్తూనే ఆయన ఫొటోని పేపర్లలో చాలాసార్లు చూసిన జ్వాల వెంటనే గుర్తుపట్ట గలి గింది.

"నమస్తే సార్" చిరునవ్వుతో చేతులు జోడించింది. హుందాగా తలపంకిస్తున్న ఆయన కళ్లలోని మెరుపు జ్వాల దృష్టిని దాటిపోలేదు.

"ఏం చదువుకున్నావ్?"

"ఇంటర్మీడియెట్ చదివాను సార్! పరీ క్షలు రాయలేదు" సదాశివం చల్లగా అక్కడ నుంచి జారుకున్నాడు.

"ఇలా కూర్చో" ఆయన తన పక్కన చోటు చూపించారు.

"ఫర్వాలేదు సార్"

"నీ సర్టిఫికెట్లు..."

ఆమె అందించిన కవరు ఓపెన్ చేసి చదివిన ఆయన ముఖంలో సంతృప్తి కనిపించింది. "నీకీ ఉద్యోగం వచ్చేసి నట్టే సీతా"

"మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను సార్"

"ఈ జన్మలోని ఋణాలని వచ్చేజన్మకి వాయిదా వెయ్యకూడదు. నా ఋణమెలా తీర్చుకోవాలో చెబుతాను"

ఆయన కూర్చున్న చోటునుంచి లేచి ఆమె దగ్గరకి నడిచి ఆమె భుజంపై చెయ్యి వేశాడు.

జ్వాల అమాయకంగా ముఖంపెట్టి భయంగా చూసింది. ఆమె భుజంపై వేసిన తన చేతిని విసిరికొట్టక పోవడంతో ఆమె ఇష్టంతోనే అక్కడకి వచ్చిందనుకుని కాంక్ష బుసలు కొడుతున్న ఎర్రటి కళ్లతో చూశారాయన.

"నువ్వు నాకు నచ్చావు. నిన్ను పెర్మనెంటుగా వుంచుకుంటాను. నువ్వింక అనాథ శరణాలయంలో వుండక్కర్లేదు. నీకోసం పెద్ద బంగ్లా, కార్లు, నౌకర్లు..."

ఆయన కళ్లల్లోకి చూస్తూ నవ్వింది జ్వాల. తన నవ్వు ఎదుటి మనిషిని ఎలా పిచ్చెక్కిస్తుందో ఆమెకి తెలుసు. ఒక అడుగు వెనక్కి వేసి ఓరగా పక్కకి చూసింది. మంచం పక్కన టీపాయ్ మీద వున్న పెద్ద ఇత్తడి ఫ్లవర్ వేజుపై ఆమె దృష్టిపడింది. మరో అడుగు ముందుకు వేసి ఆయన ఆమె పైట తొలగించబోయాడు. మెరుపు వేగంతో ఫ్లవర్ వేజుని అందుకుని ఆయన తలపై బలంగా కొట్టింది. కనురెప్ప పాటులో ఇదంతా జరిగిపోయింది. తల దిమ్మెక్కి కళ్ల ముందు నక్షత్రాలు కనిపించి ఆయన నేల కూలారు. జ్వాల చెయ్యి జాపి బెడ్ మీదున్న తన సర్టిఫికెట్లని అందుకుని ఒక్కంగలో తలుపు వైపు పరిగెట్టింది. తలుపు తీసుకుని ఆ గది లోనుంచి బయటకి వస్తూనే ఆ గది తలుపు బయట గడియపెట్టింది. వరండాలో నిలబడివున్న సెక్యూరిటీ గార్డులు ఆమెని అనుమానంగా చూశారు.

తాపీగా నడుస్తూ అక్కడకి వచ్చిన జ్వాల వాళ్లవైపు చూసి నవ్వింది.

"సార్ నిద్రపోతున్నారు. నన్ను రేపు రమ్మన్నారు"

అలాగా అన్నట్టు చూశారు వాళ్లు.

జ్వాల గేటు తీసుకుని బయటకి వచ్చేవరకు తాపీగా నడిచి అక్కడనుంచి పరుగు మొదలుపెట్టింది. విజయ్ పని చేస్తున్న టుటౌన్ పోలీస్‌స్టేషన్ దాకా అలా పరిగెడుతూనే వుంది.



"నీకసలు బుద్ధుందా? అనాథవని చెప్పి అనాథాశ్రమంలో నాలుగు నెలలు వుంటావా? నేను చచ్చాననుకున్నావా?" కోపంతో మండిపడుతోంది శాంతమ్మ.

"బావకి ఇన్వెస్టిగేషన్‌లో సహకరించడం కోసం..."

జ్వాల మాట పూర్తి కాకుండానే తాడెత్తున లేచింది. "దానివలన ఎదురయ్యే పరిణామాలేమిటో ఆలోచించావా? ఆ ఎమ్.పి గారు నిన్ను ఏమైనా చేసివుంటే"

చేసివుంటే ఆయన్ని అక్కడే చంపేసి నేను పోలీసులకి లొంగిపోయేదాన్ని. శరణాలయంలో జరుగుతున్న అరాచకాలని, అక్రమాలని లోకానికి చాటి చెప్పేదాన్ని"

"ఏరా నీకు మాత్రం బుద్ధిలేదా? నీ ఆఫీసు గొడవలు నువ్వు చూసుకోక దీనికి చెప్పడమెందుకు? అది లేడీ జేమ్స్‌బాండ్‌లా అవతారం ఎత్తి ఆశ్రమంలో చేరి ఇంత సాహసం చెయ్యాలా? అక్కడేదైనా జరగకూడనిది జరిగివుంటే జ్వాలని నీకిచ్చి పెళ్లి చేసి నా గుండెల్లో పెట్టుకుని దాన్ని కాపాడుకుంటానని మీ మామయ్యకిచ్చిన మాట వమ్ము అయిపోయేది. కాస్తలో ఎంత ప్రమాదం తప్పింది" ఆవిడ కళ్లలో నీళ్లూరుతున్నాయి.

"క్షమించు అత్తయ్యా! నీకు చెప్పకుండా ఆశ్రమానికి వెళ్లడం నా తప్పే. అక్కడ జరిగే..."

"ఇంకేం చెప్పకు. మరోసారి ఆశ్రమం మాట ఎత్తావంటే కాళ్లు విరగ్గొడతాను" ఆవిడ కోపం వెనుక తన భద్రత గురించి ఆదుర్దా వుందని తెలిసిన జ్వాల హాయిగా నవ్వింది.

"నా కాళ్లు విరగ్గొడితే నీకే నష్టం. ఇంత అందగాడైన మీ అబ్బాయికి కుంటిపిల్లనిచ్చి ఎలాగ పెళ్లి చేశావ్ శాంతమ్మా అని అందరూ నిన్నే అడుగుతారు"

"చాల్లే సంబరం" అని కోపంగా ముఖం తిప్పుకున్న ఆవిడ మరో అరగంటలో "ఇంతకీ ఆశ్రమంలో ఏవో అరాచకాలు జరుగుతున్నాయన్నావు. ఏమిటే అవి?" అని అడిగింది.

జ్వాల చెప్పిన విషయాలను విస్తుపోతూ వింది. తులసి, జయలక్ష్మిల మరణం గురించి చెబుతుంటే కన్నీళ్లు పెట్టుకుంది.

"దత్తత ముసుగులో పసిపిల్లలని అమ్మే పీటర్ సుబ్బయ్యలు, వీధి బాలలపై లైంగిక అత్యాచారాలు చేసే పర్వీరాజ్‌లు అన్ని చోట్లా వున్నారు. వీళ్లని ప్రభుత్వం ఎలా శిక్షిస్తుందో మరి! నాలుగైదు రోజులు పేపర్లలో వీళ్ల గురించి వార్తలొస్తాయి. జనం వేడెక్కిపోతారు. తర్వాత మరచిపోతారు. మరెక్కడో ఏదో జరుగుతుంది. పత్రికలు రాస్తాయి. జనం చదివి పేపరు పక్కన పడేస్తారు" ఆవేదనగా అందావిడ.

"అవినీతి అనేది వేరు మొక్క కాదమ్మా! వేళ్లూనిన మహావృక్షం. అది అన్ని రంగాలలో శాఖోపశాఖలుగా విస్తరించిపోయింది. హరిశ్చంద్రలాంటి వాళ్లకి రాజకీయంగా పలుకుబడి, పోలీసు వర్గాలలో పెద్ద వాళ్లతో పరిచయాలు వున్నాయి. ఉదాహరణకి జయలక్ష్మి కేసు విషయంలో నేను పట్టుదలగా ఆమెని రేప్ చేసి హత్య చేసిన వాళ్లని బయటపెట్టాలని ప్రయత్నించాను. పై అధికారుల నుంచి కేసు మూసెయ్యమని వార్నింగ్. నాలాంటి చిన్న ఆఫీసర్ ఏమీ చెయ్యలేడు. చూస్తూ వూరుకోలేడు"

"ఆశ్రమంలో జరిగే అన్యాయాలకి తగిన ఆధారాలు నా దగ్గరున్నాయి బావా! ఇప్పుడైనా నువ్వు ప్రతిస్పందించకపోతే నీ ఒంటి మీదున్న ఖాకీ యూనిఫారాన్ని అవమానించినట్టే"

"కోర్టుకి వచ్చి నువ్వు సాక్ష్యం చెబుతావా? "

"చెబుతాను"

"సరే! ఇంక నేను విజృంభిస్తాను. నా ఉద్యోగం పోయినా ఫర్వాలేదు. హరిశ్చంద్రని మాత్రం వదలను" పట్టుదలగా అన్నాడు విజయ్.

★ ★ ★

"అధి పిల్ల కాదు పిడుగు. నా తలపై ఫ్లవర్‌వేజ్‌తో కొట్టి పారిపోయింది"

ఫోన్‌లో ఎమ్.పిగారు చెప్పినది వినగానే హరిశ్చంద్ర కోపంతో వణికిపోయాడు.

వెంటనే సదాశివానికి ఫోన్ చేశాడు.

"ఏది ఆ పిల్ల? వెంటనే నా దగ్గరకి తీసుకురా"

"ఎవరు సార్? "

"నిన్న ఎమ్.పిగారి కోసం గెస్ట్‌హవుస్‌కి తీసుకొచ్చిన పిల్ల సీత"

"ఆమె ఇంకా ఆశ్రమానికి రాలేదు సార్! ఎమ్.పిగారు ఈ రాత్రికి కూడా అక్కడే వుంచుకుంటారేమో అనుకున్నాను"

"అది పిల్లకాదు. పిశాచం, దెయ్యం" ఆయన ప్రళయకాల రుద్రునిలా వూగిపోతున్నాడు. మూడో కన్ను తెరిచిన శివుడిలా వున్నాడాయన. తన గెస్ట్‌హవుస్‌కి గెస్టుగా వచ్చిన అతిథికి జరిగిన అవమానాన్ని భరించలేకుండా వున్నాడు.

"ఆ పిల్ల అలాంటిది కాదయ్యగారూ! చాలా భయస్థురాలు. బెదిరిపోయి వుంటుంది. ఇంతకీ ఏం జరిగిందండి? "

"నోర్మూయ్! బెదిరిపోయేదైతే ఎమ్.పిగారి మాడు పగిలేలా కొడుతుందా? అసలు ఎవర్తది? ఎక్కడనుంచి వచ్చింది"

"తెలీదు సార్! తనకెవరూ లేరని చెప్పింది. అనాథ కదా అని జాలిపడి.."

"వెనకా ముందూ ఆలోచించకుండా ఆశ్రయమిచ్చావు. నీకు బుర్రవుందటయ్యా" ఆయన ఉద్రేకంతో వూగిపోతున్నాడు. ఇంతలో ఫోన్ మ్రోగింది. హరిశ్చంద్ర రిసీవ్ చేసుకున్నాడు. ఫోన్‌లో అవతలి వ్యక్తి చెప్పినది విన్న ఆయన ముఖంలో కుటిలానందం వ్యక్తమవుతోంది.

"దానికీ జన్మలో మరచిపోలేని గుణపాఠం చెప్పండి" ఫోన్ పెట్టేసి పళ్లు కొరుకుతూ అన్నాడాయన.

"ఆ బిచ్ కనిపించిందిట"

"ఎక్కడ సార్? " ఆత్రంగా అడిగాడు సదాశివం. "బజారులో మన వాళ్లు దాన్ని

ఫాలో అవుతున్నారు" ఆ క్షణంలో ఆయన ముఖంలోకి చూడ్డానికి భయపడ్డాడు సదా శివం.

★ ★ ★

"అన్నయ్యా! వదిన ఎలా వుంటుంది? " ప్రతిమ అడిగింది.

"ఎలా అంటే? "

"అందంగా వుంటుందా? "

"చాలా అందంగా వుంటుంది"

"వదిన పేరేమిటన్నయ్యా"

"ఇందుమతి"

"ఓ అందుకే నీకు మతిపోయిందామెని చూసేప్పటికి"

"ఏడ్చావులే" ఉడుక్కున్నాడు రామచంద్ర.

"సర్లే! ఏం చదువుకుంది? "

"ఇంజనీరింగ్. నాతో పాటు ఎమ్.ఎస్ చేసింది"

"ఏ యూనివర్సిటీలో చదివింది? "

"నేను చదివిన వెస్ట్‌వర్జీనియా యూనివర్సిటీలోనే"

"ఓ ఇంకేం? ఇద్దరూ ఒకే యూనివర్సిటీ అన్నమాట. ఒకే క్లాసులో ఒకే బెంచీపై కూర్చునేవారా? "

"అమెరికాలో కాలేజీల్లో బెంచీలుండవు.. కుర్చీలు వుంటాయి. అయినా ఎందుకడుగుతున్నావ్ ఇన్ని ప్రశ్నలు"

"మీ ఇద్దరిదీ లవ్ మేరేజేమో అనే అనుమానం వచ్చి" తడబడిపోయాడతను.

"లవ్వు లేదు ఏం లేదు. ఇందుమతి వాళ్ల నాన్నగారు అదే యూనివర్సిటీలో ప్రొఫెసరు. ఆయన నన్ను చూసి ఇందుమతిని నేను పెళ్లి చేసుకుంటే బాగుంటుందని అభిప్రాయపడ్డారు. మా నాన్నగారితో మాట్లాడండి అన్నాను. ఆయన నాన్నగారికి ఈ-మెయిల్ పంపడం, ఫొటోలు, జాతకాలు నచ్చడం, నాన్నగారు ఆ సంబంధాన్ని ఒకే చేయడం జరిగాయి"

వాళ్ల సంభాషణను చిరునవ్వుతో వింటున్న సుధేష్ణాదేవికి కొడుకు తనది ప్రేమ వివాహం కాదని ఎందుకు అబద్ధం చెబుతున్నాడో అర్థం కాలేదు.

★ ★ ★

జ్వాల షాపింగ్ ముగించుకుని ఆటో స్టాండ్ దగ్గరకి వచ్చింది. ఆమె చేతిలోని బ్యాగ్ సరుకులతో నిండి బరువుగా వుంది. అడ్రస్ చెప్పి ఆటో ఎక్కి కూర్చుంది. ఆటో డ్రైవర్ స్టార్ట్ చేశాడు.

జ్వాల ఆలోచిస్తోంది. 'ఆశ్రమంలో తను కనిపించక తనేమయిందని కంగారుపడుతూ వుంటారు. అసలు ఎమ్.పి.గారు తను కొట్టిన దెబ్బకి చచ్చిపోయాడో లేక స్పృహ తప్పి పడిపోయాడో తెలియదు. చచ్చిపోయి వుంటే పేపరులో ఆ వార్త వచ్చి వుండాలే! స్పృహ తప్పివుంటాడంతే' ఆలోచిస్తున్న జ్వాల ఆటో ఆగడంతో ఉలిక్కిపడి చుట్టూ చూసింది. ఆటో నిర్జన ప్రదేశంలో ఆగివుంది.

"ఇక్కడ ఆపావేమిటి? " అయోమయంగా అడిగింది.

"కాస్సేపాగు. నీకే తెలుస్తుంది" నవ్వాడు డ్రైవర్. జ్వాలకేదో అనుమానం వచ్చి గభాల్న ఆటో దిగింది. అప్పుడే అక్కడకి వచ్చి ఆగిన మోటారుసైకిల్‌ని దానిమీద నుంచి దిగిన ఇద్దరు దృఢకాయులని చూసి ఆమె నిటారుగా అయింది. కరడు కట్టిన కసాయితనం వాళ్ళ ముఖాలలో వ్యక్తమవుతోంది. ఒక పథకం ప్రకారమే ఆటోని అక్కడకి తీసుకొచ్చారని అర్థమైంది.

"ఎవరు మీరు? " కోపంగా అడిగింది.

"ప్రస్తుతానికి నీ మొగుళ్ళం" వెకిలిగా నవ్వాడు ఒకడు.

"ఏమిటి మీ ఉద్దేశం? " వణికిపోతూ అరిచింది.

"నిన్ను రేప్ చెయ్యడం" జ్వాల జారిపోతున్న ధైర్యాన్ని కూడదీసుకుని తనని సమీపిస్తున్న ఒకడి ముఖంపై పిడికిలి బిగించి గుద్దబోయింది. మరుక్షణం ఆమె చెయ్యి వాడి ఉక్కుపిడికిలిలో బిగుసుకుపోయింది.

"హెల్ప్! హెల్ప్!" గొంతు చించుకుని అరుస్తోందామె.

"అరిచి గోలచెయ్యక మమ్మల్ని సుఖపెట్టి నువ్వు సుఖపడు" రెండవవాడు ఆమె చున్నీ లాగేశాడు. గింజుకుంటున్న ఆమెని ఇద్దరూ కలిసి పక్కనున్న పొదలలోకి లాక్కెళ్ళారు.

"ఒరేయ్! నువ్వు ఆటో దగ్గర వుండు" ఆటోడ్రైవరుతో చెప్పాడొకడు.

"ఇది అన్యాయం. మీ పథకంలో సహకరించి దాన్ని ఇక్కడికి తీసుకొచ్చినవాడిని నేను. అనుభవించేవాళ్ళు మీరూనా? "

"నీకూ ఛాన్స్ ఇస్తాంలే. ఏడవకు"

ఆ సమాధానంతో తృప్తిపడి ఆటోడ్రైవరు తిరిగి ఆటో దగ్గరకి వెళ్ళాడు.

వాళ్ళామెని పొదల వెనుక కటికనేలపై పడదోశారు. ఒకడు ఆమెని కదలకుండా పట్టుకుంటే రెండవ వ్యక్తి ఆమెని వివస్త్రని చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు. అవమానం, అసహాయత, సిగ్గు ఒక్కుమ్మడిగా చుట్టుముట్టి ఆమెకి దుఃఖం ముంచుకొస్తోంది. తన పవిత్రత మంట కలవబోతోందని అర్థమయింది. 'భగవంతుడా! నన్ను కాపాడు' మూగగా రోదిస్తోందామె.

దూరంగా ఏదో వాహనం వస్తోన్న శబ్దం. జ్వాలలో అణగారిపోతున్న ఆశ తిరిగి జీవం పోసుకుంది. ఎవరో వచ్చి తనని రక్షిస్తారనే నమ్మకం కలిగింది. వాహనం మరింత దగ్గరయింది.

★ ★ ★

"హరిశ్చంద్ర ప్రసాద్ స్పీకింగ్!"

"నేను ఇన్‌స్పెక్టర్ విజయ్‌ని సార్"

"నువ్వా! ఏమిటి విశేషం? "

"ద్రౌపదీ మానసంరక్షణ దిగ్విజయంగా ముగిసింది. కీచక వధ ఘట్టం మొదలవబోతోందనీ మీకు చెబుదామని చేశాను సార్"

"వాట్ నాన్సెన్ ఆర్ యు టాకింగ్!"

"మిస్టర్ హరిశ్చంద్రప్రసాద్! మీరు సీత అనే అమ్మాయిపైకి ఉసికొల్పిన మీ కిరాయి రౌడీలు ప్రస్తుతం నా కస్టడీలో వున్నారని చెప్పడానికి సంతోషిస్తున్నాను"

"హౌ డేర్ ఆర్ యు!" కోపంతో, ఉద్రేకంతో వణికిపోతూ ఫోన్ విసిరేశాడు హరిశ్చంద్ర.

హరిశ్చంద్రతో మాట్లాడి ఫోన్ పెట్టేసిన విజయ్ సంతృప్తిగా నిట్టూర్చాడు. మకుటం లేని మహారాజులా చెలామణి అవుతున్న ఆయనకిది తొలి అపజయం కావచ్చు. ఆయన మనుషులని తను అరెస్టు చేసిన విషయం ఆయనంతట ఆయనే తెలుసుకోవడం వేరు. తను ఫోన్‌చేసి చెప్పడం ఆయన అహాన్ని ఎంతగా దెబ్బతీస్తుందో ఊహించగలడు.

★ ★ ★

"మీకో శుభవార్త!"

సంతోషంతో దీప్తివంతమైన ఆమె ముఖం చూస్తూ అడిగాడు రవి.

"ఏమిటది? "

"మా అన్నయ్య పెళ్ళి నిశ్చయమయింది"

"అలాగా! ఆయనకి నా శుభాకాంక్షలందచేయండి"

ప్రతిమ రవిని నిశితంగా చూస్తూ అడిగింది.

"వివాహంపై మీ అభిప్రాయమేమిటి రవీ!" క్షణం ఆలోచించి అన్నాడు.

"రెండు మనసులని కలిపి రెండు జీవితాలని ముడివేసే పవిత్ర బంధం"

"మీరెలాంటి అమ్మాయిని భార్యగా కోరుకుంటున్నారు? " అతను ఫక్కున నవ్వేస్తూ అన్నాడు.

"బాగుంది. ఏదో ఇంటర్వ్యూలాగా అడుగుతున్నారేమిటి? "

ప్రతిమ నవ్వలేదు. "చెప్పండి"

"పెళ్ళా! నాకా? నాకింతవరకు ఆ ఆలోచనే రాలేదండీ"

"పోనీ రాజకుమార్తెలాంటి ఒక అమ్మాయి మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చి 'మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను. మీ కోసం

నా ఆస్తిని, అంతస్థుని వదులుకోడానికి సిద్ధంగా వున్నాను' అందనుకోండి. మీరేం చేస్తారు? "

రవి ప్రతిమవైపు ఒకసారి చూసి ముఖం తిప్పుకున్నాడు.

"మీరు వింతగా మాట్లాడుతున్నారీవేళ"

"ఇకముందు జరిగేవన్నీ మీరూహించని వింతలే! మీరే చూస్తారుగా" ఆమె చిరుదర హాసం పెదవులపై నర్తిస్తుండగా మనసు లోని మధురోహలు చెంపలపై కెంజాయలద్దుతుండగా ఛెంగున లేచి కారు దగ్గరకి వెళ్ళింది.

కారు డ్రైవ్ చేస్తోందన్న మాటేగాని, ఆమె మనసు రవి దగ్గరే వుంది.

'రవితో తన పెళ్ళికి తండ్రి తప్పకుండా ఒప్పుకుంటాడు. సమయం చూసి ఆయనతో రవి గురించి చెప్పాలి!' ఆమె మనసు ఊహలలో ఊయలలూగుతోంది.

★ ★ ★

జ్వాల ఆటో దిగి లోపలకి వస్తుండగా ఆమెని చూసిన శాంతమ్మ కంగారుపడిపోయింది. కడుపు చేత్తో పట్టుకుని కొద్దిగా వంగి నడుస్తున్న ఆమెని ఆత్రుతగా పొదివి పట్టుకుని అడిగింది.

"ఏమయిందే! ఏమిటీ అవతారం? "

జ్వాల మంచంమీద పడుకుంది. మేనత్తని చూస్తూ చిరునవ్వుతో అంది.

"ముందు నువ్వలా కూర్చో"

ఆవిడ అర్థం కానట్టు చూస్తూ కూర్చుంది.

"నేను హాస్పిటల్ నుంచి వస్తున్నాను"

"ఒంట్లో బాగాలేదా? "

"ట్యూబెక్టమీ చేయించుకున్నానత్తయ్యా!"

ఆవిడ కళ్లు వెడల్పయ్యాయి. "పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకున్నావా? నీకు మతిపోయిందా? పెళ్ళయి పిల్లలు పుట్టకుండానే"

"పిల్లల్ని కంటేనే అమ్మ అవక్కర్లేదు. అసలు పెళ్లే చేసుకోకుండా పిల్లల్ని కనకుంతా ఎందరో ఆర్తులకి, అనాథలకి అమ్మ అయిన మదర్ థెరిసా నిజమైన అమ్మ కాదా? నేను చెప్పేది నీకు ఉపన్యాసంలా అన్పిస్తోందా? నిజం అత్తా! నాకీ ఆలోచన నేను అనాథాశ్రమంలో వుండగానే వచ్చింది. అక్కడున్న పిల్లల్ని చూస్తే నా మనసు క్షోభించేది. తల్లిదండ్రులెవరో తెలియని అభాగ్యులు కొందరైతే తల్లిదండ్రులని కోల్పోయిన అనాథలు కొందరు. వాళ్లలో ఇద్దరు పిల్లలని తెచ్చి పెంచుకోవాలనుకుంటున్నాను. నాకు పిల్లలు పుడితే వాళ్ళని నా స్వంత బిడ్డల్లా ప్రేమించలేను. నాలో స్వార్థం పెరుగుతుంది. ఆ స్వార్థం నా కన్నబిడ్డలపట్ల పక్షపాత ధోరణిని పెంచుతుంది. అందుకే ఆపరేషన్ చేయించుకోవాలని నిర్ణయించుకున్నాను. ముందుగా చెప్తే నువ్వు అభ్యంతర పెడతావని నీకు చెప్పలేదు. నన్ను క్షమించు అత్తా"

శాంతమ్మ కళ్లలో నీళ్ళూరుతున్నాయి.

"మరోమాట. నేను బావని పెళ్ళి చేసుకోలేను. ఎందుకంటే నావల్ల మీ వంశాభివృద్ధి జరగదు. మరో మంచి అమ్మాయిని చూసి బావకి పెళ్ళి చెయ్యి. నాకు ఒంట్లో స్వస్థత చేకూరగానే ఈ ఊరినుంచి ఎక్కడికైనా వెళ్ళిపోతాను"

"కాని నువ్వు నాకు కావాలి జ్వాలా!"

విజయ్ స్వరం విని ఆమె ఉలిక్కిపడి తల తిప్పి చూసింది. అతను చిరునవ్వుతో ఆమెనే చూస్తున్నాడు.

"నా పసితనంనుంచి నువ్వు నా మేనమామ కూతురివనే అభిమానం వయసుతో బాటు గాఢమై ప్రేమగా మారింది. కాని ఇప్పుడు నీ వ్యక్తిత్వంపై గౌరవం కూడా కలుగుతోంది. నేను నిన్ను మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. నిన్ను తప్ప మరెవరినీ పెళ్ళి చేసుకోలేను"

"నా వలన వంశాభివృద్ధి జరగదని తెలిసీ..." ఇంకా ఏదో అనబోతుండగా అతను అడ్డుపడ్డాడు.

"రక్తం పంచితేనే మన బిడ్డలని భావించే

మనుషులున్న ఈ సమాజంలో ప్రేమ పంచితే అందరూ నీ బిడ్డలే అని రుజువు చేశావు. సంతానం లేదని ఫెర్టిలిటీ సెంటర్ల చుట్టూ తిరుగుతారు తప్ప ఒక్క అనాథక యినా తల్లిదండ్రుల ప్రేమని పంచాలని ఈ మనుషులెందుకనుకోరు? "

"బావా!" జ్వాలకి కన్నీళ్లు వచ్చాయి. దుఃఖంలోనే కాదు, ఆనందంలో కూడా కళ్లు వర్షిస్తాయి.

"ఎప్పటిదాకానో ఎందుకు? రేపే నీకు నచ్చిన ఇద్దరు పిల్లలని ఆశ్రమం నుంచి తెచ్చుకుందాం"

"అవునమ్మా! విజయ్ చెప్పినట్టు చెయ్యి. తన పిల్లల ఆకలిని తప్ప ఎదుటి పిల్లల ఆకలిని పట్టించుకోని స్వార్థపరులున్న ఈ సమాజంలో కనకుండానే అమ్మవవుతు న్నావు. చాలా సంతోషం" అంది శాంతమ్మ కన్నీళ్లు తుడుచుకుంటూ.

"మీరిద్దరూ నా ఆశయాన్ని ప్రోత్సహించి సమర్థించడం నా అదృష్టం. కాని పిల్లలని తెచ్చుకోడానికి నేను శరణాలయానికి వెళ్తే నేను ఎమ్.పి.గారి బుర్ర బద్దలు కొట్టినం దుకు నా బుర్ర బద్దలు కొట్టడానికి సదా శివం రెడీగా వుంటాడక్కడ. అందుకని. నువ్వెళ్ళి రమని తీసుకురా అత్తా. మరో పిల్లనీ అబ్బాయినీ తర్వాత తెచ్చుకుందాం" అంది జ్వాల.

"అలాగేనమ్మా" అందావిడ.

★ ★ ★

ఆ రాత్రి హరిశ్చంద్ర కూతురితో చెప్పాడు.

"అన్నయ్య పెళ్లి కుదిరింది. నీక్కూడా పెళ్ళి చేసేస్తే నా బాధ్యత తీరిపోతుం దమ్మా" ఆయన ఒక ఫోటోని ఆమెకి అందించాడు.

"ఈ అబ్బాయి పేరు విష్ణువర్ధన్. ఇంజ నీరింగ్ పాసయి తండ్రికి బిజినెస్‌లో సహా యపడుతున్నాడు. ఆస్తి, అంతస్థులలో మనతో సరితూగే కుటుంబం"

తండ్రి దగ్గర రవి ప్రస్తావన ఎలా తీసు కురావాలా అని ఆలోచిస్తున్న ప్రతిమకి ఇది అవకాశంగా అనిపించింది.

"దాదాపు అన్నీ నిశ్చయమయినట్టే. అబ్బాయి నీ ఫొటో చూసి ఇష్టపడ్డాడు. నువ్వు కూడా ఒకసారి చూస్తే... ప్రతిమ గుండె వేగంగా కొట్టుకుంటోంది. జీవితంలో అతి ముఖ్యమైన పెళ్ళి విషయంలో తన ఇష్టాఇష్టాలేమిటో తెలుసుకోకుండా తండ్రి అన్నీ నిర్ణయించి చివరగా తనకి చెప్పడం ఆమెకి బాధని కలుగచేసింది.

"ఏమంటావ్ ప్రతిమా! నీకు నచ్చిన ట్టేనా? "

"క్షమించండి నాన్నగారూ!" తలదించు కుని అంది. "నేను రవిని ప్రేమిస్తున్నాను. అతనితో జీవితాన్ని పంచుకోవాలనుకుంటు న్నాను"

హరిశ్చంద్ర భ్రుకుటి ముడిపడింది.

"నువ్వతన్ని ప్రేమిస్తున్న విషయం అత నితో చెప్పావా? "

"లేదు"

"మీమధ్య పెళ్ళి ప్రస్తావన అతను తెచ్చాడా? నువ్వు తెచ్చావా? "

"అతను తేలేదు. నేనూ చెప్పలేదు. ముందు మీ అనుమతి, ఆశీస్సులు తీసుకుని తర్వాత చెప్పాలని" ఆమె సిగ్గుపడుతూ అంది.

"నేను అనుమతిస్తాననే అనుకుంటు న్నావా? " అంతవరకు సంస్కారం ముసు గులో దాచివుంచిన కోపం బి.పి.లా రెయి జయిందాయనలో.

"నాన్నా! వీడిని ప్రేమించాను. వీడిని తప్ప పెళ్ళి చేసుకోను అని చెప్పడానికి నీకెంత ధైర్యమే. అసలు అందుకే ఈ ఆడ ముండలకి చదువు చెప్పించకూడదు. నాలుగు అక్షరం ముక్కలు నేర్చుకునేసరికి కళ్లు నెత్తికెక్కి స్త్రీ స్వేచ్ఛ, సమానత్వం అని వీధికెక్కుతారు"

ప్రతిమ తండ్రి నోటివెంట వస్తున్న

దుర్భాషలని అప్రతిభురాలయి వింటోంది. స్త్రీలు చదువు కోవాలని, నిరాక్షరాస్యతే వారి పురోగమనానికి అవరోధాన్ని కలిగిస్తోందని వేదికలెక్కి ఉపన్యాసం ఇచ్చే తండ్రికి స్త్రీలపై ఇంత చులకన భావమా? ఇన్నాళ్లుగా తను ఎరిగివున్న తండ్రిలో మరో వ్యక్తి వున్నాడు. ఆ వ్యక్తి వికృతమైన తన విశ్వరూపాన్ని చూపిస్తున్నాడు.

'పిచ్చి పిచ్చి వేషాలేస్తే కాళ్ళు విరగ్గొడ తాను. ఇకపైన నువ్వు ఇల్లు కదిలినా, రవిని కలుసుకున్నా నిలువునా నిన్ను చీరే స్తాను" ఆయన సభ్యతని మరచిపోయి వికృతంగా అరుస్తుంటే ప్రతిమ ఏడవడం మరచిపోయి స్తంభించిపోయింది.

ఆయన కోపం వున్నట్టుండి భార్యపైకి మళ్ళింది. "తల్లివి ఆడపిల్లని అహర్నిశలూ కనిపెట్టుకుని వుండవలసిన దానివి. అదేం చేస్తోందో, ఎవడితో తిరుగుతోందో కనిపెట్ట కుండా ఏం చేస్తున్నావు? " దూకుడుగా భార్య గదిలోకి వెళ్ళి క్రోధంగా అడిగాడు.

సుభేష్ణాదేవి జవాబివ్వలేదు. ఆవిడ మౌనం ఆయన్ని మరింత రెచ్చగొట్టింది.

"అడిగినదానికి జవాబివ్వవేమే దొంగ లం.." విసురుగా చెయ్యెత్తి ఆమె చెంప ఛెళ్ళుమనిపించాడు. "పిల్లల్ని నాకు ఎదురు తిరగమని ప్రోత్సహిస్తున్నావా? నీ కొడుకు నా పెత్తనం లేకుండా వాడి పెళ్ళి వాడే నిర్ణయించుకునేంత పెద్దవాడయ్యాడు. ఇప్పుడు నీ కూతురు కూడా అదే బాటలో నడుస్తానంటోంది. వాళ్ళని ఇలా తయారు చేసింది నువ్వే"

ఆధారంలేని ఆ అభియోగాలకి ఆవిడ ఉద్రేకపడలేదు. చిరునవ్వు నవ్వింది. "అవును. వాళ్ళు నా పిల్లలు. అందుకే వాళ్ళ జీవితాలను వాళ్ళకి కావలసినట్టు మలుచుకున్నారు"

'నోర్ముయ్" మరోసారి చెంప ఛెళ్ళుమంది. "నా కళ్ళు కప్పి నాటకాలాడాలని చూస్తే పెళ్లాన్ని, పిల్లలని కూడా చూడను. చంపి పారేస్తాను జాగ్రత్త" ఆయన మండిప డుతూ అవతలకి వెళ్ళాడు.

ఆవిడ భర్తని అదే చిరునవ్వుతో చూసి కూతుర్ని వెతుక్కుంటూ వెళ్ళింది. గదిలో ప్రతిమ వెక్కివెక్కి ఏడుస్తోంది. ఆమెని గుండెలలో పొదువుకుందావిడ.

ఆ రాత్రి ప్రతిమ ఆత్మహత్యా ప్రయత్నం చేసింది. సమయానికి సుభేష్ణాదేవి అడ్డుప డింది.

★ ★ ★

శాంతమ్మ అనాథాశ్రమం ముందు రిక్షా దిగి గేటుదాటి లోపలకి రాబోతుండగా గేటు దగ్గర వాచ్‌మెన్ అడ్డగించాడు.

"ఎవరు కావాలి? "

"మేనేజరుగారు"

"అసలు ఎవరు మీరు? "

"నా పేరు శాంతమ్మ. నా ఒక్కగానొక్క కొడుకు డాక్టరు చదివి అమెరికాలో స్థిరప డ్డాడు. స్వంత ఇల్లు, చెప్పుకోదగిన ఆస్తిపా స్తులు వున్నాయి. కాని నాకంటూ ఒక తోడులేదు. అందుకే ఆశ్రమంలోని ఒక పాపని దత్తత తీసుకోవాలనుకుంటున్నాను"

"లోపలకి వెళ్ళండి" అన్నాడు దారి ఇస్తూ.

ఆవిడ లోపలకి నడిచింది. ఆఫీసు రూమ్‌లో కూర్చుని వున్న సదాశివాన్ని చూడగానే ఆవిడకి జ్వాల అతన్ని గురించి చెప్పిన విషయాలు గుర్తుకొచ్చి కోపం, అసహ్యం, జుగుప్స ఇత్యాది భావాలు ఒక్కు మ్మడిగా కలిగాయి. వాటిని మనసులోనే దాచిపెట్టి అతనికి నమస్కరించింది.

"చెప్పండి. ఏంపనిమీద వచ్చారు? "

శాంతమ్మ చెప్పింది.

"ఒక అనాథ జీవితంలో వెలుగు నింపా లనుకుంటున్న మీ ఆలోచన అభినంద నీయం. కాని ఈ వయసులో పసిపిల్లలని పెంచడం మీకు బాదరబందీ అవుతుం దేమో"

"మరీ పసిపిల్లలని పెంచడానికి నా

వయసు సహకరించదు నాయనా! పద కొండు పన్నెండేళ్ళ వాళ్ళయితే మరో పదేళ్ళలో నా చేతికి అందివస్తారు"

సదాశివం ఆయాని పిలిచి, శాంతమ్మని పిల్లలున్నచోటుకి తీసుకెళ్ళమన్నాడు. అప్పుడు క్లాస్‌రూమ్‌లో వున్నారు వాళ్ళు.

పదిమంది పిల్లలున్నారు. ఎనిమిదిమంది మగపిల్లలు. ఇద్దరు ఆడపిల్లలు. వాళ్ళలో రమని సులువుగానే గుర్తించగలిగిందావిడ జ్వాల చెప్పిన దాన్నిబట్టి.

"ఆ పాప కావాలి!" అంది రమవైపు చూపిస్తూ.

"రమా! ఈవిడ నిన్ను పెంచుకుంటారట. ఈవిడతో వెళ్తావా? " అడిగింది ఆయా.

రమకి గందరగోళంగా వుంది. "సీతక్క తనని తీసుకెళ్తానని భవిష్యత్తుపై ఎన్నో ఆశలని కల్పించింది. కాని వున్నట్టుండి మాయమయిపోయింది. ఈవిడకి బదులు సీతక్క వచ్చి తనని తీసుకెళ్తే బాగుండేది"

"నాతో మా ఇంటికి వస్తావామ్మా? " అడిగిందావిడ.

"వస్తానండీ" అని ఆవిడ చేతిని అందుకుంది.

తను ఇంక ఆశ్రమంలో వుండక్కర్లేదనుకుంటే ఆమెకి ఆనందంగా వుంది. సదాశివం ఆకలి చూపులను తప్పించుకోవచ్చు. కానీ సీతక్క ఏమయింది? అన్నదే ఆమెకి అర్థమవడంలేదు.

శాంతమ్మతోపాటు ఆఫీసు రూమ్‌లోకి అడుగుపెడుతున్న రమని చూడగానే సదాశివం కళ్ళు వెడల్పయ్యాయి.

"ఆడపిల్ల నీకు తోడవుతుందా. అసలు ఏ ఉద్దేశంతో ఈ పిల్లని పెంచుకోవాలనుకుంటున్నావ్? ఇంటికి తీసుకెళ్ళి పాచిపని చేయిస్తావా? లేకపోతే వయసు వచ్చాక వ్యాపారం చేయిస్తావా? "

అవమాన పూరితమైన అతని ప్రశ్నలకి ఆవిడ ముఖం ఎర్రబడింది. పొంగి పొరలుతున్న ఆగ్రహావేశాలను అదుపులో పెట్టుకుంటూ అంది.

"మీ అనుమానం సహజమే. లోకంతీరు అలావుంది. కానీ, ఏ ప్రమాణం చెయ్యమన్నా చేస్తాను. నేను ఈ పిల్లని నా కూతురిగా స్వీకరించడానికే నాతో తీసుకెళ్ళాలనుకుంటున్నాను. నా దృష్టిలో ఆడ మగల మధ్య వ్యత్యాసం లేదు. నా దరఖాస్తుతోబాటు అవసరమైన కాగితాలన్నీ తెచ్చాను. వాటిని పరిశీలించి, మీరు సంతృప్తి చెందితేనే ఈ పాపని నాకు దత్తత ఇవ్వండి"

సదాశివం ఆ కాగితాలను పరిశీలించి, సంతృప్తిగా తల పంకించాడు.

"రమా! ఈవిడ నిన్ను పెంచుకుంటారుట. వీళ్ళింటికి వెళ్తావా? " రమవైపు చూస్తూ అడిగాడు.

రమ అతని కళ్ళలోకి చూడ్డానికే భయపడింది. ఆ క్షణంలో సీతని, ఆమె భవిష్యత్తుపై కనబరిచిన ఆశలని మరిచిపోయింది. ఈ సదాశివం బారినుంచి తప్పించుకుంటే చాలు.

"వెళ్తానంకుల్" అంది.

"సరే! తీసుకెళ్ళండి" అన్నాడతను.

"రామ్మా" అందావిడ రమ చేతిని అందుకుంటూ.

ఇద్దరూ బయటికి వచ్చి రిక్షా ఎక్కారు. రిక్షా కాస్త దూరం వెళ్ళాక అంది శాంతమ్మ.

"నిన్ను తీసుకురమ్మని సీతక్క నన్ను పంపింది" రమ చటుక్కున తల తిప్పి చూసింది. వెంటనే ఆ కళ్ళలో సంభ్రమానందాలు వెల్లువలా వచ్చాయి.

★ ★ ★

"నువ్వు రవిని ప్రేమిస్తున్నావు. అతను నిన్ను ప్రేమిస్తున్నాడా? " తల్లి ఆ ప్రశ్న ఎందుకడిగిందో తెలియకపోయినా చెప్పింది.

"ప్రేమిస్తున్నాడు"

"ఆ విషయాన్ని నీతో చెప్పాడా? "

"లేదు... అతను చెప్పకపోయినా తని




చూపులలోని ఆరాధన నాకు తెలుసు. నాపై ప్రేమను వ్యక్తం చెయ్యడానికి అతనికి భయం"

"భయమా? "

"అవును. నేను తనకి అందనంత ఎత్తులో వున్నానని భయం. నా చేతిని అందుకోవాలంటే అతను నా అంతస్థుకి ఎదగాలి. లేదా అతని స్థాయికి నేను దిగాలి. రెండూ అసాధ్యమైనవే అని కాబోలు అతని భయం"

"భవిష్యత్తులో ఏమవుతాడో చెప్పలేను కానీ, ప్రస్తుతం అతను ఒక సాధారణమైన నెల జీతగాడు. నువ్వు ఒక రకమైన జీవన విధానానికి, సుఖాలకి అలవాటుపడ్డదానివి. అతన్ని పెళ్ళి చేసుకుని జీవితంలో సర్దుకు పోగలవా? "

"అతని సాహచర్యాన్ని కోరుకున్న నేను జీవితంలో ఎలాంటి కష్టాలెదురైనా భరించ గలననే అనుకున్నాను. మా పెళ్ళికి నాన్న గారిని ఒప్పించగలననే అనుకున్నాను. కానీ ఆయననుంచి అంత వ్యతిరేకత ఎదురవు తుందని ఊహించలేకపోయాను" ప్రతిమ కన్నీళ్ళు ఆమె ఎదని తడుపుతున్నాయి.

సుధేష్ణాదేవి ఒకసారి కూతుర్ని చూసి బీరువామీద వున్న సూట్‌కేసుని అందుకుని ఆమె బట్టలని అందులో సర్దడం మొదలు పెట్టింది. ప్రతిమ ఆశ్చర్యంగా కన్నీటి తెర లమధ్య తల్లిని చూస్తోంది.

"ఈ రాత్రికే రవితో కలిసి నువ్వీ ఊరి నుంచి వెళ్ళిపో"

ప్రతిమ ఎంత షాక్‌కి గురయిందంటే వెంటనే సమాధానం చెప్పలేకపోయింది.

"అమ్మా! ఇప్పటికిప్పుడు అంటే..." తడ బాటుగా అంది.

"ఇప్పుడే వెళ్ళాలి. పక్కగదిలో మీ నాన్న గారు గాఢనిద్రలో వున్నారు. ఆయనకే మాత్రం అనుమానం వచ్చినా నువ్వీ బంది ఖానానుంచి ఎప్పటికీ తప్పించుకోలేవు. ఇష్టంలేని పెళ్ళి అనే శిక్ష తప్పదు నీకు"

"అమ్మా" ఆమె బావురుమంది. ఆవిడకీ కన్నీళ్ళు వచ్చాయి.

"త్వరగా బయలుదేరు. తెల్లవారకముందే మీరీ ఊరినుంచి దూరంగా వెళ్ళిపోవాలి" ఆవిడ కొంత డబ్బు తీసి ఆమె చేతిలో పెట్టింది.

"వద్దమ్మా! ఈ ఇంటినుంచి నీ తియ్యని ప్రేమ తాలూకూ జ్ఞాపకాలను తప్ప ఏమీ పట్టుకెళ్ళను"

"రవికి మరో ఊళ్ళో ఏదైనా ఉద్యోగం వచ్చే వరకూ మీ ఇద్దరూ కాలం గడపాలిగా? "

అయిష్టంగానే ఆ డబ్బు తీసుకుని తల్లి పాదాలకి నమస్కరించింది. రవితో జీవన ప్రయాణాన్ని మొదలుపెట్టబోతున్నాననే ఆనందం, తల్లికి దూరమయిపోతున్నాననే బాధ చిత్రమైన మానసిక స్థితి.

సుధేష్ణాదేవి ఒక చేత్తో కూతురి చేతినీ, మరొక చేత్తో సూట్‌కేసుని పట్టుకుని ముందడుగు వేసింది. మేడ దిగి హాల్లోకి వచ్చారిద్దరూ. హాలులో జీరో వాల్టు బల్బ్ మందంగా వెలుగుతోంది. ఆ వెలుతురులో సింహద్వారపు తలుపు తెరవబోయిందా విడ. వున్నట్టుండి హాలులో ట్యూబ్‌లైటు వెలిగింది. ఉలిక్కిపడి వెనుదిరిగిన ఆ ఇద్దరూ కొయ్యబారిపోయారు.

హాలుమధ్యగా హరిశ్చంద్ర నిలబడి వున్నాడు.

"శభాష్" అన్నాడాయన.

భర్త గదిలో గాఢనిద్రలో వుండగా కూతు రును ఈ ఇల్లు దాటించే ప్రయత్నం చేసింది తను. కానీ ఆయన అక్కడ హఠా త్తుగా ప్రత్యక్షమైన షాక్‌నుంచి ఆవిడ ఇంకా తేరుకోలేదు.

"ఏ తల్లి అయినా కూతురికి పెళ్ళిచేసి అత్తవారింటికి సాగనంపుతుంది. కానీ నువ్వు... పెళ్ళికాని కూతుర్ని ఎవడితోటో లేచిపోవడానికి సాగనంపుతున్నావు"

తేరుకున్న ఆవిడ, "లేచిపోవడం అనే అస

హ్యాకరమైన పదాన్ని ఉపయోగించి ప్రేమకి కళంకాన్ని ఆపాదించకండి. ప్రతిమ మీ ఆశీస్సులతో రవిని పెళ్ళి చేసుకోవాలనుకుంది. మీరు దాని మనసుని అర్థం చేసుకోలేదు. అందుకే ధైర్యంగా అతని చేతిని అందుకుని జీవనప్రయాణం ప్రారంభించాలనుకుంది" అంది తొణక్కుండా,

"ఓహో! అది లేచిపోవడానికి ప్రేరణ, ప్రోత్సాహం నువ్వన్నమాట. మరి నీకు సత్కారంచేసి అభినందించవద్దూ? " ఆయన ఒక్క ఊపుతో గోడకి వున్న హంటర్‌ని అందుకుని ఝుళిపించాడు. ఆయన చేతిలోని హంటర్ ఆవిడ ఒంటిమీద కరాళ నృత్యం చెయ్యసాగింది.

సుధేష్ణాదేవి చిరునవ్వుతో ఆ దెబ్బలని భరిస్తోంది.

"అమ్మా!" ప్రతిమ విహ్వలంగా చూస్తూ ముందుకొచ్చింది.

"ప్రీతీ! నువ్వు రవి దగ్గరకి వెళ్లమ్మా! వెంటనే బయలుదేరు" హరిశ్చంద్ర భార్య అన్నమాటలతో మరింత రెచ్చిపోయాడు. కసిగా కొరడాని ఆవిడ వంటిమీద ఝుళిపించసాగాడు. ప్రతిమ భయోత్పాతంతో వణికిపోతూ తండ్రి పాదాలపై పడింది.

"నాన్నగారూ! నన్ను క్షమించి అమ్మనేమీ చెయ్యకండి. రవిని మరిచిపోతాను. మీరు చెప్పిన సంబంధానికి ఒప్పుకుంటాను"

హరిశ్చంద్ర విజయగర్వంతో నవ్వాడు. హంటర్‌ని విసిరేసి అక్కడనుంచి వెళ్లిపోయాడు. ప్రతిమ రక్తసిక్తమైన తల్లి ఒంటిమీది గాయాలని చూసి వెక్కివెక్కి ఏడుస్తూ ఆదుర్దాగా ఆవిడని కుదిపింది. అప్పటికే ఆవిడ స్పృహ కోల్పోయింది.



కింద జరుగుతున్న ఈ గందరగోళం రామచంద్రకి తెలియదు. మేడమీద తన గదిలో వున్న అతను ఇందుమతితో తన వైవాహిక జీవితాన్ని గురించి తియ్యని కల కంటున్నాడు.

ఇన్‌స్పెక్టర్ విజయ్ ఆశ్రమం ముందు జీపు ఆపి నేరుగా సదాశివం ఆఫీసు గదిలోకి వెళ్ళాడు.

"యు ఆర్ అండర్ అరెస్ట్ మిస్టర్ సదాశివం"

"నేనేం చేశాను సార్? " క్షణకాలం బిత్తరపోయిన అతను మరుక్షణం తేరుకుంటూ అడిగాడు.

"పసిపిల్లలపై లైంగిక అత్యాచారాలకి పాల్పడినందుకు, ఆశ్రమంలోని అనాథ యువతులకి ఉద్యోగం ఎర చూపించి వ్యభిచారం చేయిస్తున్న నేరాలకి నిన్ను అరెస్టు చేస్తున్నాను"

"నేనా? నేనేం చేశాను? నాకేమీ తెలియదు" కీచుమంది అతని స్వరం.

"నువ్వేం చేశావో నీ నోటితోనే చెప్పిస్తాను. పద..."

"అయ్యగారితో మాట్లాడండి. ఈ విషయాలన్నీ" బింకంగా అన్నాడు.

"మీ అయ్యగారితో నేను మాట్లాడను. ఆయనచేత మాట్లాడిస్తాను" అతను బేడీలు తీసి అతని చేతులకి తగిలించాడు. ఆశ్రమంలోని జనమంతా నిశ్చేష్టులయి చూస్తుండగా అతను అవమానంతో అసహాయంగా పళ్ళు కొరుక్కుంటూ జీపెక్కాడు. జీపులో పోలీసులమధ్య కూర్చుని వున్న గెస్ట్ హౌస్

వాచ్‌మెన్‌ని అప్పుడు చూశాడతను.

జీపు పోలీస్‌స్టేషన్ ముందు ఆగింది. ఆ ఇద్దరినీ లాకప్‌లోకి నెట్టి ప్రశ్నించడం మొదలుపెట్టాడు విజయ్. అతనేం అడిగినా ఇద్దరూ కూడబలుక్కున్నట్లు ఒకటే సమాధానం చెప్పారు.

"నాకేం తెలియదు"

విజయ్ మానవత్వాన్ని మరిచిపోయి లాఠీకి పని కల్పించాడు. అప్పుడు నోరు విప్పారిద్దరూ.

వాళ్ళు చెబుతున్న భయంకరమైన నిజాలని విని దిమ్మెరపోయాడతను.

పేరులో 'ఆర్' అనే మొదటి అక్షరంగల అధికార పార్టీలో వున్న ఎమ్.పి.గారికి కన్నెపిల్లల పిచ్చి. తన వ్యాపారాన్ని విస్తృత పరచుకోవడానికి హరిశ్చంద్ర డాక్టరు వర్జినిటీ సర్టిఫికెట్ ఇచ్చిన ఆశ్రమంలోని అమ్మాయిలను ఆయనకి కానుకగా ఇస్తున్నాడు. ఎమ్.పి.గారు జయలక్ష్మిని బలవంతంగా అనుభవించినందుకు ఆమె చనిపోయింది. ఆమె శవాన్ని ఊరవతల తాటితోపులోకి చేర్చారు హరిశ్చంద్ర మనుషులు.

సదాశివం, గెస్ట్‌హౌస్ వాచ్‌మెన్ చెప్పినది విన్నాక అడిగాడు విజయ్.

"తులసి ఎందుకు చచ్చిపోయింది?"

"రక్త విరేచనాలయి చచ్చిపోయింది"

"నిజం చెప్పరా" అతని చేతిలోని లాఠీ సదాశివం మోకాళ్ళమీద బలంగా తగిలింది.

బాధతో ఆర్తనాదం చేసిన అతను మరుక్షణం చెప్పడం మొదలుపెట్టాడు.

"నాకు చిన్నపిల్లలంటే ఇష్టం. తులసికి స్వీట్లు కొనిస్తానని ఆశ చూపించి లొంగదీసుకున్నాను" అంటూ తులసిని బెదిరించి భయపెట్టి తనెలా అనుభవించిందీ చెప్పాడు. "వారంవారం ఆశ్రమంలోని వాళ్ళకి వైద్యం చెయ్యడానికి వచ్చే డాక్టరమ్మ ఆ పిల్ల నెల తప్పిందని చెప్పింది. నా గుట్టు బయటపడుతుందని భయపడి నేను, వార్డెన్ కలిసి ఆ పిల్లచేత నాటుమందు మింగించాం. ఆమె ఓవర్ బ్లీడింగ్‌తో ప్రాణాపాయ స్థితిలో వుండగా హాస్పిటల్‌లో ఎడ్మిట్ చేశాం. వైద్యం చేసినా ఫలితం లేకపోయింది. ఆ పిల్ల చచ్చిపోయింది"

"బాస్టర్డ్స్!" పళ్ళు కొరుకుతూ ఇవతలకి వచ్చాడు విజయ్. ఆవేదన, అసహాయతతో కూడిన ఆగ్రహం అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. కళ్ళముందు హరిశ్చంద్ర కనిపిస్తుంటే అతని ఒళ్ళు ఉడుకులెత్తసాగింది. అప్పటికప్పుడు ఆయన్ని అరెస్టు చేయడానికి వారెంటు సిద్ధంచెయ్యసాగాడు.

బూట్ల చప్పుడు విని తల ఎత్తాడు. డి.ఎస్.పి. ఓబుల్‌రెడ్డి లోపలకి వస్తున్నాడు. విజయ్ వెంటనే లేచి అటెన్షన్‌లో నిలబడి సెల్యూట్ చేశాడు.

"మిస్టర్ విజయ్! రాజాగారి గెస్ట్‌హవుస్ వాచ్‌మెన్‌ని, శరణాలయం కేర్‌టేకర్ సదాశివాన్ని ఏ ఆధారంతో అరెస్టు చేశావు?" ఆగ్రహంగా అడిగాడాయన.

"వాళ్ళు దోషులని ఆధారాలు దొరికాయి కాబట్టే అరెస్టు చేశాను సార్"

"ఏమిటో ఆ ఆధారాలు?" వ్యంగ్యంగా అడిగాడు.

"కొన్నినెలల కిందట సుమతి అనే వేశ్య ఆత్మహత్య చేసుకునేముందు మనని ఉద్దేశించి రాసిన ఉత్తరంలోని విషయాలన్నీ నిజాలే సార్. అనాథ శరణాలయంలోని ఆడపిల్లలపై కన్యత్వ పరీక్షలు జరపడం నిజం. ఆ అభాగ్యులకి ఉద్యోగం ఎరగా చూపించి, ఎమ్.పి.గారికి కానుకగా ఇచ్చి హరిశ్చంద్ర ప్రసాద్ తన వ్యాపారాన్ని విస్తృతపరచుకోవడం నిజం"

"ఇవన్నీ నీకెలా తెలిశాయి. ఊహా? లేక సదాశివాన్ని, వాచ్‌మెన్‌ని రక్తం కారేలా కొట్టి ఒప్పించావా?" సెల్‌లో నేలమీద పడి మూలుగుతున్న ఆ ఇద్దరినీ చూస్తూ అడిగాడు.

"నా మేనమామ కూతురు జ్వాల

అందుకు సాక్ష్యం సార్. తనో అనాథనని అబద్ధంచెప్పి సీత అనే మారుపేరుతో శరణాలయంలో నాలుగు నెలలుంది. అక్కడ జరుగుతున్న అన్యాయాలకీ, అరాచకాలకీ ఆమే సాక్ష్యం. ఉద్యోగం ఎర చూపించి ఈ సదాశివం ఆమెని ఎమ్.పి.గారికి తార్చబోతే ఆయన మాడు పగలగొట్టి అక్కడినుండి బయటపడింది"

"వ్వాట్!" అదిరిపడ్డాడాయన.

"నిజం సార్. ముందు బుకాయించినా సదాశివాన్ని, వాచ్‌మెన్‌ని నాలుగు తన్నాక ఆ విషయాలను వాళ్ళ నోటితోనే ఒప్పుకున్నారు"

"సంఘసేవ ముసుగులోని సంఘవిద్రోహక శక్తులను రూపుమాపడానికి నువ్వు చేస్తున్న కృషి అభినందనీయం. రియల్లీ ఐ అప్రషియేట్ యు. నీకు ప్రమోషన్ ఇప్పిస్తాను"

"థాంక్ యూ సార్" విజయ్ చిరునవ్వుతో అన్నాడు.

"హరిశ్చంద్రప్రసాద్‌ని అరెస్టుచేసే అవకాశం మాత్రం నాకివ్వు"

"అలాగే సార్"

"ఈ స్కౌండ్రల్స్ పారిపోకుండా చూడు. లాకప్ తలుపులని బద్దలుకొట్టి పారిపోగల కంత్రీ వెధవలు వీళ్ళు"

"అలాగే సార్"

డి.ఎస్.పి. వెళ్ళిపోయాడు. విజయ్ రిలాక్స్‌డ్‌గా కుర్చీలో వెనక్కి వాలి కూర్చున్నాడు.

"సదాశివాన్ని అరెస్టుచేసి తెచ్చినందుకు తనపై తీవ్రస్థాయిలో విరుచుకుపడతాడనుకున్న డి.ఎస్.పి. తనకి సపోర్టునివ్వడం, ఆయనే స్వయంగా హరిశ్చంద్రని అరెస్టు చేస్తాననడం అతనికి చాలా సంతోషాన్ని కలుగచేసింది. న్యాయం ఎప్పటికైనా గెలుస్తుందనే అతని నమ్మకం వమ్ము కానందుకు తృప్తిగా వుంది.

★ ★ ★

జ్వాల రమకి జడవేసింది. "త్వరగా టిఫిన్ తిను, స్కూలుకి టైమవుతోంది? " అంది.

రమలో ఉత్సాహం పరవళ్ళు తొక్కుతోంది. ఆశ్రమజీవితం ఒక పీడకలలా వుంది. ఇక్కడ తననెవరూ చీదరించుకోరు. తన ఆకలెరిగి అన్నం పెట్టే శాంతమ్మ, ఆప్యాయత పంచే జ్వాలక్క, ఒక అన్నయ్యలా ఆదరిస్తూ తెలియని పాఠాలను చెప్పే విజయ్ అందరూ తనవాళ్ళే. కానీ తన నేస్తం తులసి మాత్రం లేదు. ఆమె కళ్ళలో నీళ్ళూరాయి.

ఆమె కన్నీళ్ళు చూసి జ్వాల కంగారుపడింది. "ఏమయిందమ్మా? స్కూలులో ఎవరైనా ఏమైనా అన్నారా నిన్ను? " లాలనగా అడిగింది.

"తులసి బతికివుంటే నువ్వు ఆమెని ఇక్కడికి తీసుకొచ్చేదానివా అక్కా? "

జ్వాల కడుపులో ఎవరో దేవినట్లయింది. తను ఆశ్రమానికి ఇంకొన్ని రోజులు ముందుగా వెళ్ళివుంటే తులసిని సదాశివం విషకౌగిలి నుంచి రక్షించేదే.

"తులసిని ఒక్కర్తినేకాదు, ఆశ్రమంలోని పిల్లలందరినీ తెచ్చి పెంచుకోవాలని వుంది. కానీ ఎలా రమా? అది సాధ్యపడుతుందా? "

"నేను బాగా చదువుకుని పెద్ద ఉద్యోగం చేస్తాను. ఆ డబ్బుతో మనం ఒక ఆశ్రమం కట్టించి అక్కడున్న వాళ్ళందరినీ మన ఆశ్రమంలో చేర్చుకుందాం. ఏం? " అంది.

"మరి బాగా చదువుకునే పిల్లలు స్కూలుకి ఆలస్యంగా వెళ్తారా? చూడు టైం ఎనిమిది కావస్తోంది. ఆటో వచ్చేవేళయింది. నువ్వింకా టిఫిన్ తినలేదు"

"సారీ అక్కా!" రమ గభాల్న లేచి వంటింట్లోకి పరుగెట్టింది, "మామ్మగారూ! టిఫిన్ పెట్టండి" అంటూ.

★ ★ ★

మోటార్ సైకిల్ ఆపి, లోపలికి వచ్చాడు విజయ్. అతని ముఖం నిద్రలేమితో పీక్కుపోయి వున్నా కళ్ళు విజయగర్వంతో వెలిగి

పోతున్నాయి.

"జ్వాలా! నీకో గుడ్ న్యూస్"

"ఏమిటది?" ఆసక్తిగా అడిగింది.

"సదాశివాన్నీ, గెస్ట్ హౌస్ వాచ్‌మెన్‌ని నిన్న మధ్యాహ్నం అరెస్టు చేశాను"

"నిజంగానా? అయినా నిన్న మధ్యాహ్నమనగా అరెస్టు చేస్తే ఇప్పుడా నాకు చెప్పడం?" నిష్ఠూరంగా అంది.

"వెంటనే ఫోన్ చేసి చెప్పాలనుకున్నాను. కాని నీ కళ్లలో మెదిలే సంతోషం ఫోన్‌లో కనిపించదుకదా!"

"నేరం ఒప్పుకున్నారా వాళ్లు"

"ముంధు తమకేమీ తెలియదని బుకాయించారు. నాలుగు తగిలిస్తే ఒప్పుకున్నారు"

"పులి తినగా మిగిలిన మాంసపు ముక్కలకోసం ఆశపడే నక్కలాంటి వాడు వాచ్‌మేన్. నక్కని బంధిస్తే ప్రయోజనమేమిటి? పులిని బంధించాలి"

"హరిశ్చంద్ర ఇవాళ అరెస్టవుతాడు. చూస్తుండు మా డి.ఎస్.పీ ఆయన్ని తను అరెస్టుచేసి తెస్తానన్నాడు. లేకపోతే ఆ బాస్టర్డ్‌ని రాత్రే లాకప్‌లో కటిక నేలపై పడుకోబెట్టి వాడి రక్తాన్ని దోమలకి రుచి చూపించేవాడిని"

"హరిశ్చంద్రని డి.ఎస్.పీ అరెస్టు చేస్తాడంటావా?"

"ఖచ్చితంగా. సుమతి ఉత్తరాన్ని కారుకూతలుగా, జయలక్ష్మి మరణాన్ని ఒక మామూలు ఆడపిల్ల చావుగా కొట్టి పారేసిన ఆయన హరిశ్చంద్ర దోషి అనే సాక్ష్యాలను చూపించగానే మాట్లాడలేకపోయాడు. నా ప్రమోషన్‌కి రికమండ్ చేస్తానన్నాడు" ఆనందంగా చెప్పాడతను.

జ్వాలకి డి.ఎస్.పీ హరిశ్చంద్రని తను అరెస్టు చేస్తానని చెప్పడంలో ఏదో అపశ్రుతి ధ్వనించింది.

★ ★ ★

మధ్యందిన మార్తాండునిలా మండిపడుతున్నాడు హరిశ్చంద్ర.

"సదాశివాన్ని, వాచ్‌మేన్‌ని అరెస్టుచేసి లాకప్‌లో పెట్టి కుళ్లబొడిచారు సార్! వాళ్లు నిజం చెప్పేశారు. విజయ్ నెక్స్ట్ టార్గెట్ మీరే! మిమ్మల్ని అరెస్టు చెయ్యాలని తెగ ఉబలాటపడుతున్నాడు"

"స్కౌండ్రల్! వాడికి మూడింది. అందుకే పులి నోట్లో తల దూర్చాలనుకుంటున్నాడు" పళ్లు కొరుకుతూ అన్నాడు.

"అక్కడకీ నేను చెబుతూనే వున్నాను సార్! పెద్ద వాళ్లతో పెట్టుకోకు. చూసీ చూడనట్టు వూరుకోమని. ఎంతైనా ఉడుకు నెత్తురు కదా" ఎగసనదోసాడు.

"వాడు ఇక్కడ వుండడానికి వీల్లేదు" ఆయన కళ్లు అగ్నిగోళాల్లా మండుతున్నాయి.

"పనిష్మెంట్ ఏరియాకి ట్రాన్స్‌ఫర్ చేయిస్తే సరి"

"వాడు ఇక్కడ వుండడానికి వీల్లేదు" మళ్లీ అన్నాడాయన.

ఆయన స్వరం పగపట్టిన పాము బుసలా ధ్వనిస్తుంటే డిఎస్పీకి ఎ.సి. రూమ్‌లో కూడా చెమటలు పట్టేశాయి.

"రేపటి నుంచి వారం రోజులు నేను సెలవు పెడుతున్నాను సార్" అన్నాడు.

"గుడ్" నవ్వాడు హరిశ్చంద్ర.

★ ★ ★

రాత్రి పదకొండు గంటలు కావస్తోంది. జ్వాల పుస్తకం పట్టుకుని కూర్చుని వుంది. ఆమె చేతులలో పుస్తకం వున్నా చూపులు మాత్రం మాటిమాటికీ వీధిగేటు వైపు మరలుతున్నాయి. చిరపరిచితమైన బైక్ శబ్దం కోసం చెవులు నిరీక్షిస్తున్నాయి. శాంతమ్మ కుర్చీలో వెనక్కివాలి కూర్చునే నిద్రపోతోంది. జ్వాల ఆవిడని లేపింది.

"వెళ్లి మంచంమీద పడుకో అత్తా! బావ వస్తే నేను అన్నం పెడతాను"

"విజయ్ ఇంకా రాలేదుటే" ఆవలిస్తూ అడిగింది.

"లేదత్తా! నేనూ బావకోసమే చూస్తు న్నాను"

"ఒకవేళ ఏదైనా ముఖ్యమైన పనిబడి స్టేషన్‌లోనే వుండి పోయాడేమో! ఫోన్ చేసి కనుక్కో పోనీ"

ఇంతలో ఫోన్ మ్రోగింది.

"ఫోన్ చేసినది వాడే! భోజనానికి రానని రాత్రి స్టేషన్‌లోనే వుంటానని చెబుతాడు. వాడికిష్టమని చేసిన కాలీఫ్లవర్ కూర అలాగే వుంది. ప్రాప్తం వుండద్దూ! అసలేమైనా తిన్నాడో లేదో! పనిలోపడితే తిండి ధ్యాసే వుండదు వాడికి" అత్త స్వగతాన్ని విని నవ్వు కుంటూ వెళ్లి ఫోన్ లిఫ్ట్ చేసింది జ్వాల.

ఫోన్‌లో అవతలి వ్యక్తి చెప్పినది విన్న ఆమె కాళ్లలో వణుకు మొదలయింది.

"ఏ హాస్పిటల్? బావ ఎలా వున్నాడు" అడగలేక అడిగింది.

"గవర్నమెంటు హాస్పిటల్‌లో వున్నారు. వెంటనే బయలు దేరండి" అవతలి వ్యక్తి ఫోన్ డిస్ కనెక్ట్ చేశాడు.

జ్వాల చేతులలో నుంచి ఫోన్ జారిపో యింది. 'విజయ్‌నెవరో కొట్టారు. హాస్పిట ల్‌లో వున్నాడు' అనే మాటల దగ్గరే ఆమె మెదడు కేంద్రీకృతమై వుంది.

"ఏమయిందే హాస్పిటల్ అంటున్నావు? ఎవరికి సుస్తీ" ఆదుర్దాగా అడిగింది శాంతమ్మ.

"బావకి దెబ్బలు తగిలాయిట, హాస్పిట ల్‌లో వున్నాడు. వెళ్దాం పదత్తా" తేరు కుంటూ అంది.

ఆవిడ ఏడవడం మొదలుపెట్టింది. జ్వాల ఆవిడకి ధైర్యం చెప్పి పర్సులో డబ్బు వేసుకుని పక్కింటావిడని లేపి రమకి సాయం పడుకోమని మేనత్తతో బయలుదే రింది.

కానిస్టేబుల్స్ హాస్పిటల్ బయట ఆమె కోసమే నిరీక్షిస్తున్నారు.

"బావకి ఎలా వుంది? దెబ్బలు గట్టిగా తగిలాయా" అడిగింది జ్వాల.

వాళ్లు ఒక నిముషం మాట్లాడలేదు. ఒక తను మెల్లిగా అన్నాడు.

"ధైర్యంగా వుండండమ్మా"

వాళ్ల ముఖాలలోని దైన్యం, కళ్లలో నీళ్లు చూస్తే ఆమె మనసేదో కీడు శంకించింది.

"ఎక్కడున్నాడు బావ"

"రండి" మార్చురీవైపు నడిచారు వాళ్లు.

విజయ్ మృతదేహాన్ని చూస్తూనే కెవ్వున కేకపెట్టింది జ్వాల. అతని శరీరంపై కత్తి పోటు పడని చోటులేదు. పెదవులు విడి వడి నిర్జీవంగా వుందతని ముఖం.

"బావా" అస్పష్టంగా పిలుస్తూ అతనిపై వాలిపోయి హృదయ విదారకంగా విలపిం చసాగింది.

కొడుకు మృతదేహాన్ని చూసి కుప్పకూ లిన శాంతమ్మకి స్పృహ తప్పింది.

★ ★ ★

మరునాడు అన్ని పేపర్లలో విజయ్ ఫొటోని ప్రచురించి అతని మరణవార్త గురించి రకరకాలుగా రాశారు.

విజయ్ నిజాయితీపరుడైన పోలీస్ ఇన్ స్పెక్టరని ఎన్నో ఉన్నత పదవులని అధిరో హించవలసిన అతను చిన్న వయసులోనే మృత్యువాతపడడం దురదృష్టమని ఒక పేపరు రాసింది.

"ఇన్‌స్పెక్టర్ విజయ్‌ని చంపిన హంతకు లెవరు? " అని ప్రశ్నార్థకాన్ని మరో పేపరు మిగిలిస్తే ఇది నక్సలైట్ల దుశ్చర్య అని మరో పేపరు ఘోషించింది. అతని మృతదేహం దగ్గర విలపిస్తున్న తల్లి శాంతమ్మ, మర దలు, కాబోయే భార్య అయిన జ్వాలల ఫొటోలని మరో పేపరు ప్రచురించింది.

పేపరులో జ్వాల ఫొటోని చూస్తూ కసిగా నవ్వేడు హరిశ్చంద్ర.

"అనాథనని నాటకమాడి శరణాల యంలో చేరావుకదూ? అందుకే భగవం తుడు నిన్ను నిజంగానే అనాథని చేశాడు. భగవంతుడు కాదు నేను నిన్ను అనాథని

చేశాను"

ఆ పేపరుని రామచంద్ర కూడా చూశాడు. మరణించిన విజయ్ ఫొటోని, అతని మృతదేహం దగ్గర విలపిస్తున్న జ్వాల ఫొటోని చూడగానే అతని మనసుని మెలితిప్పిన బాధ కలిగింది.

"జ్వాల! అతనిపై ఎన్నో ఆశలు పెంచుకున్న ఆమె అతని మరణంతో ఏమయిపోతుంది" అతనికి ఆమెపై జాలి, సానుభూతి కలిగాయి.

కాని భవిష్యత్తులో ఆ అమ్మాయిని తను కలుసుకుంటాడని తన జీవితంలో ఆమె పెనుమార్పుకి నాంది పలుకుతుందని ఆ క్షణంలో అతను ఊహించలేకపోయాడు.

★ ★ ★

ప్రతిమ- విష్ణువర్ధన్, ఇందుమతి- రామచంద్రల పెళ్ళిళ్ళు ఘనంగా జరిగాయి. ప్రతిమ చుట్టూ వున్న సందడితో సంబంధం లేదన్నట్టు, తను నిమిత్తమాత్రురాలినన్నట్టు యోగినిలా కూర్చుంది. తన కలలు కరిగిపోయినందుకు కంటే తండ్రిలోని మరో రూపం బయటపడ్డందుకే ఆమెకి ఎక్కువ బాధగా వుంది.

ప్రతిమలోని నిర్లిప్తతని కనిపెట్టిన ఇందుమతి భర్తని అడిగింది.

"మీ చెల్లెలికి ఈ పెళ్ళి ఇష్టంలేదా? "

అతను ఉలిక్కిపడ్డాడు. "ఛ! ఎవరన్నారలా"

"ఎవరూ అనలేదు. ఆమెని చూస్తే నాకే ఎందుకో అలా అనిపించింది"

"నీ ఊహ తప్పు. తను పుట్టి పెరిగిన ఇంటిని, మమ్మల్ని విడిచి వెళ్లాలని బాధపడుతోందంతే"

ఇందుమతికి ఆ సమాధానం సంతృప్తిని కలిగించలేకపోయింది. కన్నవాళ్లని విడిచి వెళ్లడానికి ఏ ఆడపిల్లయినా బాధ పడడం సహజమే. కానీ మూడు ముళ్లు పడ్డ మరుక్షణం నుంచీ బాధపడదు. ప్రతిమకీ పెళ్లి ఇష్టంలేదని ఖచ్చితంగా చెబుతోందామె మనసు.

పెళ్లి, రిసెప్షన్ ఘనంగా జరిగిపోయాయి. మూడు నిద్రలకి అత్తవారింటికి ప్రయాణమయింది ప్రతిమ. కారులో ప్రయాణం. ఎ.సి చల్లదనం, తన పక్కనే కూర్చున్న భర్త శరీరపు చిరుస్పర్శ... ఆమె స్థానంలో మరో ఆడపిల్ల వుండివుంటే ఆ క్షణాలు మధురమైన జ్ఞాపకాలుగా ఆమె మనసులో మిగిలిపోయేవి. కానీ ఆమె మనసు, తనువు గడ్డ కట్టుకుపోయాయి.

ప్రతిమ చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అడిగాడు విష్ణు.

"నిన్ను ఒక విషయం అడగవచ్చా? "

ఆమె అభావంగా అతడిని చూసింది. "అడగండి"

"నువ్వెవరినైనా ప్రేమించావా? "

ప్రతిమ గుండె క్షణం వేగంగా కొట్టుకుంది.

"మీకెందుకొచ్చిందా అనుమానం" తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అడిగింది.

"మన పెళ్లిలో నీ ముఖంలో నిర్లిప్తత, నీ ప్రతి చర్యలో యాంత్రికత తప్ప సంతోషం కనిపించలేదు"

"అర్ధరాత్రి ముహూర్తం కదా! నిద్రలేమి, అలసటవల్ల మీకలా అనిపించి వుంటుంది"

"నీ నుంచి ఎలాంటి సమాధానం వినవలసి వస్తుందోనని భయపడ్డాను" క్షణం ఆగి అన్నాడతను. "పెళ్లికి ముందు నీకు నా గురించి నాకు నీ గురించి ఏమీ తెలియదు. కాని నిన్ను చూసిన మొదటి క్షణంలోనే నీ పట్ల గాఢమైన ఇష్టం కలిగింది. నీకు వాగ్దానమిస్తున్నాను. నీకు కష్టం కలిగించేలా ఎప్పుడూ ప్రవర్తించను. నీ మెడలో తాళి కట్టాను కదా అని భర్తగా నీపై ఎప్పుడూ పెత్తనం చెలాయించను. మనం మానసికంగా దగ్గరయ్యే వరకు స్నేహితులుగానే వుందాం"

ప్రతిమ మనసులో తీవ్రసంచలనాన్ని కలిగించాయి ఆ మాటలు.

'ఇంతమంచి మనసున్న వ్యక్తి దగ్గర జీవితాంతం భార్య పాత్రని పోషించగలదా? రవిని మరచిపోయి ఇతనితో కాపురం చెయ్యగలదా?' ఆమె ఆవేదనగా నిట్టూర్చింది.

పెద్దగా హారన్ వినిపించింది. తాము ప్రయాణిస్తున్న కారు ఎదురుగా వస్తున్న లారీకి ఢీకొనడం మాత్రం తెలుసు ఆమెకి. తర్వాతేం జరిగిందో తెలియడానికి ఆమెకి స్పృహలేదు.

★ ★ ★

రవి గదిలో పడుకుని వున్నాడు. ప్రతిమ పెళ్లి జరిగిందని అతను విన్నాడు.

ఆ రోజు ఆమె తనని చివరిసారిగా కలుసుకున్నప్పుడు ఆమె అన్న మాటలు గుర్తు వస్తున్నాయతనికి.

"రాజకుమార్తెలాంటి ఒక అమ్మాయి మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చి మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను. మీ కోసం నా ఆస్తిని, అంతస్థుని వదులుకోడానికి సిద్ధంగా వున్నానందనుకోండి. మీరేం చేస్తారు?"

ఆమె తనపై చూపించిన చనువు, చిలిపిగా కవ్విస్తున్నట్టుగా మాట్లాడిన మాటలు అన్నీ కేవలం స్నేహభావంతోనే అంటే ఎందుకో నమ్మశక్యంగా లేదతనికి. ప్రతిమ తనని కోరుకుందా? . ఆ ఊహ ఒకప్పుడు అతని గుండెని లయ తప్పేలా చేసింది.

కాని ప్రతిమ మరొకరి భార్య అయిందని తెలియగానే అతని గుండెల్లో వ్యక్తం చెయ్యలేని బాధ సుళ్లు తిరుగుతోంది. విజ్ఞత తప్పని వారిస్తోంది. నింగిలోని చందమామని అందుకోవాలనుకోవడం దురాశే అవుతుంది. జీతం రాళ్లు తప్ప ఏ ఆధారంలేని తనెక్కడ? లక్ష్మీ పుత్రురాలైన ఆమె ఎక్కడ? అలా అనుకోగానే అతని మనసు చల్లబడింది.

పది రోజులక్రిందట అతన్ని ఉద్యోగం నుంచి తొలగిస్తున్నట్టు ప్రిన్సిపాల్ నుంచి ఉత్తర్వు అందిందతనికి. కారణం అతని టీచింగ్ సంతృప్తికరంగా లేదని. అది అబద్ధమని అతనికి తెలుసు.

కాని తనతో స్నేహితంగా వుండే ప్రతిమ హఠాత్తుగా తనని కలుసుకోకపోవడమే కాదు, తనకి కనీసం ఆమె పెళ్లి శుభలేఖ అయినా పంపని కారణంతో తన ఉద్యోగం పోయిన కారణాన్ని కలిపి ఆలోచిస్తే అతనికి బోధపడివుండేది దాని వెనుక హరిశ్చంద్రప్రసాద్ హస్తముందని.

రవికి ఇంక ఆ ఊళ్లో వుండాలనిపించలేదు. అతను తనకివున్న కొద్దిపాటి సామాన్లని సర్దుకుని కాత్యాయని దగ్గరకి వెళ్లాడు.

"నేను హైదరాబాదు వెళ్తానమ్మా"

"ఏదైనా ఉద్యోగానికి ఇంటర్వ్యూ వచ్చిందా?" అడిగిందావిడ.

"ఉద్యోగం వెతుక్కోడం కోసమే అక్కడకి వెళ్తున్నానమ్మా" అదొక్కటే కారణం కాదు. ఇక్కడ ఈ ఊళ్లో వుంటే జయ అస్తమాటికీ గుర్తొస్తోంది. ఊరు మారితే మనసు కుదుటపడుతుందని ఆశ.

"నీ పట్ల నా ప్రవర్తనకి మన్నించు బాబూ" కన్నీళ్లతో అందావిడ.

"అదంతా నేనెప్పుడో మరచిపోయాను. మీరే గుర్తు చేస్తున్నారు"

"నువ్వు వెళ్లిపోతే నేను రాసిన కథలని చదివి తప్పుల్ని ఎవరు దిద్దిపెడతారన్నయ్యా" అంది సుజాత.

"నువ్వింకా తప్పులు రాసే స్థితిలో వున్నావనుకోను. మొన్న పత్రికలో వచ్చిన కథ చాలా బాగుంది. నువ్వింకా ఎదగాలి. రచయిత్రి సుజాతకి నేను అన్నయ్యనని గర్వంగా చెప్పుకుంటాను"

"కాదు రవిశంకర్ చెల్లెలినని చెప్పుకోడమే నాకు ఇష్టం"

రవికి ప్రతిమ గుర్తుకొచ్చింది. సుజాతలోని మార్పుకి కారణం ఆమె. మనిషి తను బతకడానికే కాదు ఇతరులని బతికించడానికి కూడా సంపాదించాలని తనకి ఉద్యోగం రావాలని తనకంటే ఆమె

ఎక్కువగా తపించిపోయింది. అలాంటి మంచి స్నేహితురాలు తనకి దూరమయిపోయింది. "ప్రతిమ కనిపిస్తే ఆమె నన్ను అడిగితే చెప్పు నేను హైదరాబాదు వెళ్లానని"

"తనకసలు మనం గుర్తున్నామా అని! వున్నట్టుండి కాలేజీకి రావడం మానేసింది. పెళ్లి శుభలేఖయినా పంపకుండా పెళ్లి చేసుకుంది. నాకే కాదు మా క్లాస్‌మేట్స్, తన ఫ్రెండ్స్ ఎవరికీ పంపలేదు. స్నేహితులని ఇంత త్వరగా మరచిపోతారా ఎవరైనా"

"హడావుడిలో మరచిపోయి వుంటుంది. కాని ఆమె స్నేహితులని మాత్రం మరచిపోదు" అన్నాడు రవి.

"నా అనుమానం ప్రతిమ ఎవరినో ప్రేమించి వుంటుంది. వాళ్ల నాన్నగారు ఆ ప్రేమని వ్యతిరేకించి హడావుడిగా ఆమె పెళ్లి చేసి వుంటారు"

ఉలిక్కిపడ్డాడు రవి. 'ప్రతిమ ప్రేమించినది నిన్నే' అని అతని మనసు చెబుతోంది. అతను ఆమెని ఊహలలో సాక్షాత్కరింపచేసుకున్నాడు. ఆమె కళ్లలోని ఆరాధన తనపై ఇష్టంకాదా? ప్రేమా? తను గుర్తించలేకపోయాడెందుకని? 'ప్రతిమ నిన్ను ప్రేమించిందని తెలిస్తే మాత్రం ఏం చేస్తావ్? ఆమె మరొకరి భార్య. ఆమె గురించి ఆలోచించకు' మనసు మందలించింది.

అతను బలవంతాన మనసు మరల్చుకున్నాడు. ఆ రాత్రే అతను హైదరాబాదు వెళ్లడానికి ప్రయాణమయ్యాడు.

★ ★ ★

కారు యాక్సిడెంటులో ప్రతిమ భర్త చనిపోయాడనే వార్త గాలికంటే వేగంగా వ్యాపించింది. సుధేష్ణాదేవి మొదలు నరికిన మ్రానులా కూలబడిపోయింది.

ఆ ఇంట్లో విషాదం తాండవిస్తోంది. మెడలోని పసుపుతాడు తడి ఆరకముందే ప్రతిమ విధవ అయింది.

చేతులలో ముఖం దాచుకుని కుమిలిపోతున్న హరిశ్చంద్రగారి కళ్లముందు తను కిరాయి రౌడీలచేత చంపించిన ఇన్‌స్పెక్టర్ విజయ్ కన్పించాడు. ఆ రోజు తను చేసిన పాపం ఈ రోజు తన అల్లుడిని బలి కోరిందా? క్షణ కాలపు పశ్చాత్తాపం ఆయన మనసుని ఆర్ద్రం చేసింది. అంతలోనే తనని తాను సంబాళించుకున్నాడు.

అతనికి ఆయుర్దాయం లేదు అంతే! అయినా రోజూ ఎంతమంది యాక్సిడెంట్సులో చనిపోవడంలేదు? తను చేసిన నేరాలను, ఘోరాలను ఒప్పుకోడానికి ఆయన అహం అంగీకరించలేదు. కాని స్వర్గనరకాలనేవి ఎక్కడో లేవని, మనిషి చేసిన పాపపుణ్యాల ఫలాన్ని భూమి మీదే అనుభవించవలసి వుంటుందని ఆయనకి తెలియదు. ప్రతిమ కన్నీళ్లలో ఎందరో అభాగినుల కన్నీళ్లని చూడగలిగి వుంటే ఆయన తన తప్పుని తాను తెలుసుకోగలిగేవాడు. కాని హరిశ్చంద్ర లాంటి మనుషులకి పాపపుణ్యాలని బేరీజు వేసుకునే తీరిక వుండదు. కావలసినవల్లా కీర్తిప్రతిష్టలు. అవి ఇనుమడించడానికి అవసరమైన ధనం. వాటిని నిలుపుకోడానికి, సంపాదించడానికి ఎన్ని అకృత్యాలను చెయ్యడానికైనా వెనుదియ్యరు.

★ ★ ★

ప్రతిమ కిటికీ చువ్వలకి ముఖమానించి శూన్యంలోకి చూస్తోంది. "పెళ్ళి ఒక కలలా, జీవితం భ్రమలా కరిగిపోయింది. తనకి ఇష్టం లేకుండానే అతనితో పెళ్ళికి తలవంచింది. పెళ్ళిపీటలమీద అతని పక్కన కూర్చున్నది కొన్ని గంటలు మాత్రమే. కారులో ప్రయాణం. అతనంటే తనకిష్టం లేదేమో అని అతని అనుమానం. అతను మంచి మనసుతో చేసిన వాగ్దానం. ఇదంతా నిజమేనా? యాక్సిడెంటులో డ్రైవరు, వెనుక కూర్చున్న అతను మరణించారు. తను మాత్రం తలకి దెబ్బ తగిలి రెండురోజులు అపస్మారకస్థితిలో వుండి బతికి బయటపడింది.

'తనకి పెళ్ళికూతురిగా అలంకరించడానికి

పోటీపడిన ముత్తైదువలు, తన అందానికి దిష్టి తీసిన అమ్మలక్కలు తన నుదుట బొట్టు చెరిపి, తన గాజులు విరగ్గొట్టి, తనకి తెల్లచీర కట్టించి విధవని చేశారు. తనది దురదృష్ట జాతకం అని పైకి అనకపోయినా వాళ్ళ కళ్లలో వ్యక్తమయ్యే భావమదే. తన జీవితం అస్తవ్యస్తమయినా తనకి దుఃఖం రాదేం? విష్ణుని తనకిష్టం లేకుండా పెళ్ళి చేసుకున్నందుకా? మూడు ముళ్ల బంధంతో మొదలై ఏడడుగులు నడిచిన జీవన ప్రయాణం అతని సాహచర్యంతో బలపడేదేమో! అతను తనతో మాట్లాడిన మొదటి మాటలని ఎప్పటికీ మరచిపోదేమో!

"నీకు వాగ్దానమిస్తున్నాను. నీకు కష్టం కలిగించేలా ఎప్పుడూ ప్రవర్తించను. నీ మెడలో తాళి కట్టానుకదా అని భర్తగా నీపై ఎప్పుడూ పెత్తనం చెలాయించను. మనం మానసికంగా దగ్గరయ్యేవరకు స్నేహితులుగానే వుందాం"

"ఆ యాక్సిడెంటులో అతను చనిపోకుండా వుండివుంటే అతని మంచి మనసుకి లొంగిపోయి అతన్ని ప్రేమించగలిగేదా? లేక జీవితాంతం ప్రేమని, సంతోషాన్ని నటించి వుండేదా? రవిని ఈ జన్మలో మరచిపోగలదా? తన హృదయ పీఠంపై ప్రతిష్టించుకున్న అతని రూపాన్ని తొలగించడం ఈ జన్మలో సాధ్యపడేదేనా?" రవి గుర్తు రాగానే ఆమె వెన్నులో గగుర్పాటు.

"తను రవిని గనుక పెళ్ళిచేసుకుని వుంటే తన దురదృష్టం అతన్ని కాటు వేసేది!" ఆ ఊహనే భరించలేని ఆమెకి దుఃఖం ముంచుకొచ్చింది.

ఆమె భుజంపై ఎవరిదో చెయ్యి పడింది. నీళ్ళు నిండిన కళ్ళకి ఆమె రూపం మసగ్గా కనిపించింది.

ఇందుమతి!

"వూరుకో ప్రతిమా!" ఆమెని గుండెల్లో పొదువుకుని ఓదార్చసాగింది. ఆ ఓదార్పు ఆమె దుఃఖాన్ని రెట్టింపు చేసింది.

★ ★ ★

పనిపిల్ల కోసిన మల్లెమొగ్గలని మాలకట్టింది ఇందుమతి. కట్టడం పూర్తయ్యాక మూడు భాగాలుగా దండని తుంచింది. చేతిలో పూలతో అత్తగారి గదిలోకి నడిచింది. గదిలో సోఫాలో కూర్చునివున్న సుభేష్ణాదేవి చేతులలో పుస్తకం వున్నా ఆమె దృష్టి మాత్రం పుస్తకం మీద లేదు. ఆవిడ ముఖం ఆలోచనలలో చిక్కడినట్టుంది. ఆవిడని పిలవడానికి ఆమె క్షణం సందేహించింది. తటపటాయిస్తూ గుమ్మంలో నిలబడింది. సన్నని గాజుల సవ్వడి, ఆమె పాదాలకి వున్న మంజీరాల ధ్వనితో తల తిప్పిందావిడ. వెంటనే ఆవిడ పెదవులపైకి చిరునవ్వు పాకి వచ్చింది.

"లోపలకి రామ్మా! అక్కడే నిలబడిపోయావేం?" ఆదరంగా అడిగింది.

ఇందుమతి లోపలకి వచ్చి పూలమాలని ఆవిడ చేతులలో పెట్టింది.

"మన పెరట్లో పూసిన పూలత్తయ్యా! నేనే దండ కట్టాను పెట్టుకోండి"

ఆవిడ చిరునవ్వుతో ఆ పూలని అందుకుని వాటిని అక్కడ బల్లమీద వున్న కృష్ణ విగ్రహానికి అలంకరించింది.

"మీరు పూలు పెట్టుకోరా అత్తయ్యా?"

ఆవిడ తల అడ్డంగా వూపింది.

"ప్రతిమ అలంకరించుకోవడం లేదని మీరూ మానేశారా?"

"కాదు. నేను పూలు పెట్టుకోవడం మానేసి కొన్ని సంవత్సరాలయింది"

"ఎందుకని అత్తయ్యా?"

"భగవంతుని పాదపద్మాలని అలంకరించవలసిన పూలని మన ఆనందం కోసం నలపడం నాకిష్టంలేదు"

"జంధ్యాలవారి పుష్పవిలాపము చదివారా?"

"చదివాను" నవ్విందావిడ. "నువ్వు చదవాలనుకుంటే ఆ పుస్తకం నా దగ్గర వుంది"

"ఎంత చక్కని అభిరుచి మీది" గదిలో

రాక్స్‌లో వున్న పుస్తకాలని చూస్తూ అంది.

“నిజమైన స్నేహితులున్నారు మీకు!” నవ్వింది సుశేష్మాదేవి.

“వస్తానత్తయ్యా! మిమ్మల్ని డిస్టర్బ్ చేసి వుంటే క్షమించండి” ఆమె ప్రతిమ గదిలోకి నడిచింది.

ప్రతిమ గదిలో స్తబ్దంగా కూర్చునివుంది. విధి విసిరేసిన పావులా, వేటగాడి బాణం వేటుకి కుప్పకూలిన పక్షిలా వుందామె. బొట్టులేని నుదురు, కళ్ళకింద నల్లటి వలయాలతో రంగు వెలసిన బొమ్మలా వుంది. ఆమెనే చూస్తున్న ఇందుమతి మనసు ద్రవించిపోయింది.

“ప్రతిమా!” భుజంపై చెయ్యి వేస్తూ పిలిచింది.

ఆమె కళ్ళెత్తింది.

“ఇదుగో పూలు. మన పెరటి తోటలోని మల్లెపందిరికి పూసినవి. పెట్టుకో”

“నేను పూలు పెట్టుకోవాలా? ” చిత్రంగా నవ్వింది. “నేను విధవని. పూలు పెట్టుకునే అర్హత లేదు నాకు”

“ఒక ఆదర్శవాది కూతురు మాట్లాడవలసిన మాటలేనా ఇవి? మీ నాన్నగారు సనాతన సాంప్రదాయాలను నిరసిస్తున్న మనిషి. ఆయన కూతురిగా ఆయన ఆశయాలను పాటిస్తూ ఆయన అడుగుజాడలలో నడవవలసినదానివి నువ్విలా మాట్లాడకూడదు”

“ఆదర్శవాది!” ప్రతిమ పెదవులపై విరిగిన పాలలాంటి నవ్వు కదలాడింది. తండ్రి నిజస్వరూపం తెలిశాక ఆయనపై వున్న భక్తి, గౌరవం మటుమాయమై ఏదో తెలియని బాధ కలుగుతోందామెకి.

“ఆడముండలకి చదువు చెప్పించడమే తప్పు. ఆడముండ...” ప్రతిమకి ఆయన మాటలు గుర్తు వచ్చినప్పుడల్లా గుండెల్లో శూలం గుచ్చినట్టవుతోంది. ‘ఆయనకి ఆడవాళ్ళపై చులకన భావమా? లేక తను రవిని ప్రేమించిందని చెప్పగానే కోపంలో ఆవేశంతో అలా మాట్లాడాడా? ”

“నువ్వు బొట్టు ఎందుకు పెట్టుకోవు ప్రతిమా? పురుటి కందుగా వుండగా తల్లి దిద్దిన తిలకాన్ని భర్త పోగానే చెరిపేసే నీచ సాంప్రదాయాన్ని ఎవరు కనిపెట్టారు. ఎవరో మూర్ఖులు చెప్పిన సాంప్రదాయాన్ని చదువుకున్న నువ్వు ఆచరించాలా? మీ నాన్నగారు మాత్రం ఈ దురాచారాన్ని ఎలా ఒప్పుకున్నారు? ” ఆవేశంగా అడిగింది.

“మనకిష్టం వున్నా లేకపోయినా, సంఘం కోసం కొన్ని ఆచరించాలి. అదీగాక బొట్టు పెట్టుకున్నంత మాత్రాన నేను ముత్తయిదువనవుతానా? ” ప్రతిమ కళ్లలో నీళ్ళూరుతున్నాయి.

“నీ మనసుని నొప్పించాను క్షమించు. ఇలాంటి సాంప్రదాయాలకి దూరంగా ఎక్కడో అమెరికాలో పెరిగాను నేను. పది సంవత్సరాలు అమెరికాలో వున్నా మన సాంప్రదాయాలని మరచిపోకుండా నన్ను పెంచిన మా నాన్నగారు ఆ సాంప్రదాయాలలోని చీకటి కోణాలని నిరసించారు. కాని నువ్విలా మోడులా బతకడం నేను సహించలేకపోతున్నాను. నా మాట విను. పూలు పెట్టుకో. బొట్టు పెట్టుకో. నలుగురిలోకి రా’ ’

“క్షమించు వదినా” ప్రతిమ ఆమె తనకిచ్చిన పూలని అక్కడ టేబుల్‌మీద వున్న వినాయక విగ్రహం పాదాల దగ్గర వుంచింది.

హతాశురాలయిన ఇందుమతి వెనుదిరిగి వచ్చేసింది.

★ ★ ★

“ఇవాళ రోజూ కంటే ఎంతో అందంగా వున్నావు. కాని నీ అలంకరణలో ఏదో లోపం కనిపిస్తోంది. ఏమిటబ్బా అది? ” రామచంద్ర భార్యని ఆపాదమస్తకం పరిశీలిస్తున్నవాడల్లా అన్నాడు.

“ఆం జడలో పూలు పెట్టుకోలేదు. ఎందు

కని ఇందూ"

"ముందు నా ప్రశ్నకి జవాబివ్వండి. ప్రతిమ ఏం పాపం చేసిందని ఆమెకా శిక్ష? "

"అది భగవంతుడి లీల. మనుషులు చేసినది కాదు"

"మనం మనుషులం. కాబట్టే మానవత్వంతో ఆలోచించాలంటున్నాను. ఆమెకి మళ్ళీ పెళ్ళి చెయ్యాలనే ఆలోచన మీకు రాలేదా? అసలు మీ నాన్నగారికే ఆ ఆలోచన వచ్చివుండాలే ఈ పాటికి"

"నాన్నగారు, నేను అనుకుంటే మాత్రం ప్రతిమని పెళ్ళి చేసుకోడానికి ఎవరు ముందుకొస్తారు? "

"అసలు మీ ఆలోచనని బయటపెడితేనే కదా ఎవరు ముందుకు వస్తారో తెలిసేది? "

"ఆలోచిస్తాను. తప్పకుండా ఆలోచిస్తాను"

"మీరొక్కరే గదిలో కూర్చుని జుట్టు నెరిసిపోయేలా ఆలోచించడం కాదు. మీ నాన్నగారితో కలిసి ఆలోచించండి. ఆ ఆలోచనని సాధ్యమైనంత తొందరలో అమలు పరచండి"

"ఓ. కే" బుద్ధిమంతుడిలా అన్నాడు.

"ఇంక పడుకోండి" తలగడ తీసుకుని కార్పెట్ మీద వేసుకుంటూ అంది.

"అక్కడ పక్క ఎవరికి? "

"నాకు"

"మరి నేను? "

"మీరు మంచంమీద. నేనిక్కడ"

"ఇదేమిటి కొత్తగా? "

"ప్రతిమ పెళ్ళయ్యేవరకు మనం స్నేహితుల్లా వుండాలి. అలా అని వ్రతం పట్టాను. మీకు నిగ్రహం లేకపోతే బయట బాల్కనీలో పడుకోండి"

రామచంద్రకి సిగ్గేసింది. 'ఇన్నాళ్ళూ తను చెల్లెలి కష్టాన్ని పట్టించుకోకుండా భార్యతో ఎలా సుఖపడ్డానా అని? '

"నేను అదృష్టవంతుడిని ఇందూ!"

"మీకంటే నేనే అదృష్టవంతురాలిని. నన్ను అర్థం చేసుకునే భర్త దొరికినందుకు. ఇంక నిద్రపోండి. గుడ్‌నైట్" అటువైపు తిరిగి నిండా దుప్పటి ముసుగేసుకుంటూ అంది.

★ ★ ★

అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా లేడీస్ క్లబ్‌వారు ఏర్పాటుచేసిన సభ అది. సిటీలోని ప్రముఖ వ్యక్తులందరూ హాజరయ్యారా సభకి. వేదికమీద రాజాహరిశ్చంద్రప్రసాద్‌గారు ఉపన్యసిస్తున్నారు.

"రాజా రామమోహన్‌రాయ్, వీరేశలింగం పంతులు వంటి మహనీయులు జన్మించిన ఈ గడ్డమీద స్త్రీ వరకట్న దురాచారానికి బలి అవుతోంది. వితంతు పునర్వివాహాలు ప్రోత్సహింపబడాలన్న ఆ మహనీయుల ఆదర్శం ఆచరణలోకి రాలేకపోయింది. ఈ దురాచారాలని రూపుమాపడానికి యువతరం..."

"ఆపండి" సభలో రెండవ వరసలో వేసివున్న కుర్చీలో కూర్చుని అంతవరకు ఆయన ఉపన్యాసాన్ని వింటున్న జ్వాల లేచి నిలబడి ఆవేశంగా అరిచింది.

హరిశ్చంద్ర ఆమెని చూస్తూనే నిటారుగా అయ్యాడు. ఆమె ఇన్‌స్పెక్టర్ విజయ్ మరదలని ఆమె ఫొటోని పేపరులో చూసిన ఆయన వెంటనే గుర్తుపట్టగలిగాడు. 'సీత అనే మారుపేరుతో శరణాలయంలో కొన్నాళ్ళుండి అక్కడ జరిగే అరాచకాలకి సాక్ష్యాలను సేకరించి ఎమ్.పి.గారి బుర్ర బద్దలు కొట్టిన ఈమె...' ఆయన కళ్ళలో ఎర్రజీర మెరిసింది.

"ఆపండి మీ ఊకదంపుడు! మీరు ఆచరించని ఆశయాలని వల్లించే అర్హత మీకు లేదు. అభ్యుదయం అనే పదానికే అర్థం తెలియని మీరు ఆదర్శం అంటూ గొంతు చించుకునే మీరు, మీరు నమ్మిన ఆశయాలని ఎంతవరకు ఆచరణలో పెడుతున్నారు. ఎందుకీ ఉపన్యాసాలు? కరతాళ

ధ్వనుల కోసమా? పేరు కోసమా? పేపరులో ఫొటోల కోసమా? "

సభలో కలకలం రేగింది. సభికులు ఆశ్చర్యంగా, ఆగ్రహంగా ఆమెని చూస్తున్నారు. మంత్రముగ్ధుల్లా హరిశ్చంద్రగారి ఉపన్యాసాన్ని వింటున్నవాళ్ళు అనుకోని ఈ రసాభాసకి నివ్వెరపోయారు. 'శరత్కాల మేఘంలా గర్జిస్తున్న ఈమె ఎవరు? ఎందుకిలా హరిశ్చంద్రగారి ప్రసంగానికి అంతరాయం కలిగిస్తోంది? ' హరిశ్చంద్ర గారంతటి పెద్దమనిషిని నిలదీస్తున్న ఆమె సాహసానికి ఆశ్చర్యపడుతున్నారు.

కార్యకర్తలలో ఒకరు ఆమెని బలవంతంగా బయటికి పంపబోయారు.

హరిశ్చంద్ర అతన్ని వారించాడు.

"ఆమెకి నన్ను గురించి ఏవో సందేహాలున్నట్టున్నాయి. అడగనివ్వండి. రామ్మా! వేదికపైకి వచ్చి నీ సందేహాలేమిటో చెప్పు"

జ్వాల చరచర వేదికపైకి వచ్చింది. మైక్ ముందు నిలబడింది.

"సభకి నమస్కారం. హరిశ్చంద్రగారి ప్రసంగం మధ్యలో నేను అంతరాయం కలిగించినందుకు మీ అందరికీ నాపై కోపంగా వుందని నాకు తెలుసు. కాని నాకు వారిని గురించి కొన్ని సందేహాలున్నాయి. నాకే కాదు. మీక్కూడా కలగవలసిన సందేహాలవి. అందుకే సభాముఖంగా వాటిని వ్యక్తం చెయ్యదలచుకున్నాను. శ్రీ హరిశ్చంద్రప్రసాద్‌గారి స్త్రీ జనోద్ధరణ, అనాథసేవ నాకు కాదు, మీకు, అందరికీ తెలుసు. వారు మంచి వక్తలని మీకు తెలుసు. కాని మంచి నటులని నాకు మాత్రమే తెలుసు. చెప్పేదొకటి, చేసేది మరొకటి అన్నట్టుగా వారు వల్లించే ఆదర్శాలను ఒక్కటైనా వారు ఆచరణలో పెట్టలేకపోయారు. వరకట్న దురాచారాన్ని ఖండిస్తూ మైక్ బద్దలు కొడుతున్న శ్రీ హరిశ్చంద్ర తన కూతురికి కట్నం ఇవ్వలేదా? తన కొడుక్కి కట్నం తీసుకోలేదా? వితంతు పునర్వివాహాలు జరగాలని ప్రోత్సహించే ఆయన వితంతువైన తన కూతురికి పునర్వివాహం ఎందుకు చెయ్యలేదని ప్రశ్నిస్తున్నాను"

సభలో గుసగుసలు.

హరిశ్చంద్ర ముఖంలోకి ఓరగా చూసి తిరిగి కొనసాగించింది. "ఇక అనాథసేవ విషయానికి వస్తే అక్కడా స్వార్థమే. నిజానికి అదొక వ్యాపారం. నిజం చెప్పాలంటే అది అనాథ శరణాలయం కాదు" ఎవరో విసిరిన రాయి వచ్చి బలంగా నుదుటిని తాకడంతో 'అబ్బా!' అంటూ దెబ్బ తగిలిన చోట అదిమిపట్టింది. చివ్వున రక్తం ఎగిసింది. కళ్లు చీకట్లు కమ్ముకున్నాయి.

మున్సిపల్ స్టేడియం గ్రౌండ్స్‌లో జరుగుతున్న ఆ సభలో కాలేజీ విద్యార్థినులే కాక ప్రత్యేక ఆహ్వానితులు, బయటి జనం చాలా మంది వున్నారు. ఆమె మీదకి మొదటి రాయిని ఎవరు విసిరారో తెలియదుకాని, వరసగా శరపరంపరలా రాళ్ళు వేదికమీద ఇంకా నిలబడేవున్న ఆమె శరీరాన్ని తాకుతూనే వున్నాయి.

జనం కకావికలై పరుగులు తీస్తున్నారు. పోలీస్ కానిస్టేబుల్స్ చెరొకవైపు నిలబడి హరిశ్చంద్రని వేదిక దింపారు. భద్రతా వలయంలా చుట్టుముట్టిన తన అనుయాయుల మధ్య నడుస్తూ ఆయన కారెక్కారు. కారు ముందుకి సాగిపోయింది.

కెవ్వున కేకలు, దెబ్బలు తగిలినవాళ్ళ ఆర్తనాదాలు, జనం తొక్కిసలాట, ఇంకా రాళ్ళ వర్షం కురుస్తూనే వుంది.

రామచంద్ర జనం మధ్యనుంచి వేదికవైపు దూసుకుపోతున్నాడు.

"ఆగండి అబ్బాయిగారూ!" హరిశ్చంద్ర అనుయాయులలో ఒకతను అతన్ని వారించ ప్రయత్నించాడు. "బయట మీ కోసం కారు సిద్ధంగా వుంది. మీరు ఇంటికి వెళ్ళిపోండి"

అతను వినకుండా ఛరాలున వేదికనెక్కాడు.



ఆమె అప్పటికే కుప్పకూలిపోయింది. విసురుగా తన శరీరానికి తాకుతున్న రాళ్ళ నుంచి తప్పించుకోడానికి ప్రయత్నిస్తోంది. రామచంద్ర ఆమెకి అడ్డంగా నిలబడ్డాడు. ఆమె శరీరాన్ని కమ్ముకున్న అతని శరీరం ఆమెని రక్షించడానికి పెట్టని కోటగోడలా వుంది. ఆ ప్రయత్నంలో ఒకటి రెండు రాళ్లు అతని వీపుని బలంగా తాకాయి.

అతను జ్వాలని ఆదుకోవడం అనేది హరిశ్చంద్ర అనుయాయులకి మింగుడు పడకపోయినా రాళ్ళు అతనికి తగులుతు న్నాయని విసరడం ఆపారు.

రామచంద్ర దాదాపు స్పృహ కోల్పోయిన ఆమె ముఖంపై వేదికమీద వున్న బల్లపై అతిథులకోసం మూతపెట్టి వుంచిన గ్లాసు లోని నీళ్ళని జల్లాడు. ఆమె కళ్లు తెరిచి, గాయాల బాధకి "అమ్మా!" అని మూలి గింది.

"మీరెవరు? " అతను అడిగాడు.

"న్యాయం కోసం పోరాడుతూ, ఆ పోరా టంలో ఓడిపోతున్నా, ఎప్పటికైనా గెలుస్తా ననే నమ్మకంతో బతుకుతున్నదాన్ని" ఆమె పళ్ళ బిగువున మాట్లాడుతోంది.

"మీరు అనాథాశ్రమంలో వుంటున్నారా? "

"కొన్నాళ్ళు వున్నాను. నేను అనాథని కాను. ఆశ్రమంలో జరిగే అక్రమాలని బయట పెట్టడానికి, హరిశ్చంద్ర ప్రసాద్ నిజస్వరూపాన్ని లోకానికి తెలియచెప్పడా నికి నేను అక్కడ వున్నాను"

"అనాథాశ్రమంలో అక్రమాలా? మీరు స్పృహలోనే వున్నారా? "

"మీరు ఆశ్రమంలో కొన్నాళ్ళు వుంటే మీకే తెలుస్తుంది"

"పనిగట్టుకుని హరిశ్చంద్రగారిని విమ ర్శిస్తూ ఆయనపై అభాండాలని వేస్తున్నారు. పర్యవసానమేమిటో చూశారుగా. లోకం దృష్టిలో దేవుడాయన. దేవుడిని దూషిస్తే రాళ్ళదెబ్బలు తప్పవు"

"దేవుడా? దెయ్యమా? " హేళనగా అడి గింది.

"ఆ డెవిల్‌ని ఇంతగా వెనకేసుకుని వస్తు న్నారు. ఆయన గురించి మీకేం తెలుసని? "

"మీకంటే ఎక్కువే తెలుసు. నేను హరి శ్చంద్రప్రసాద్ గారబ్బాయిని. నా పేరు రామచంద్రప్రసాద్"

ఫక్కున నవ్వింది. "హరిశ్చంద్ర... రామ చంద్ర. మీరు తండ్రి అడుగుజాడలలో నడిచే శ్రీరామచంద్రులయితే అవచ్చుగానీ మీ నాన్నగారు మాత్రం సత్యహరిశ్చంద్రుడు కాదు. అవినీతి, అక్రమం, అబద్ధం రూపుదా లిస్తే అది హరిశ్చంద్రప్రసాద్ అవతారం"

"ఏ ఆధారంతో మా నాన్నగారిని అను మానిస్తున్నారు? " భ్రుకుటి ముడిచి చూస్తూ అడిగాడు.

"నేను నిరాధారమైన అనుమానాలతో మీ నాన్నగారిపై అభాండాలు మోపడం లేదు. మీరు కొన్నాళ్ళు... అక్కర్లేదు. ఒక్కరోజు మీ అనాథాశ్రమంలో వుంటే అన్నీ మీకే తెలుస్తాయి" ఆమె వేదిక మెట్లుదిగి నడుస్తూ వెళ్ళిపోయింది.

ఆమెనే చూస్తున్న రామచంద్ర దగ్గరకి వచ్చాడు సదాశివం.

"మీరు చేసిన పని నాకు నచ్చలేదు. మీరు దానికి ఉపచర్యలు చెయ్యడమేమిటి అబ్బాయి గారూ. సరిగ్గా తగల్లేదుకానీ కణతమీద తగి లేలా రాయి విసిరి వుంటే చచ్చేది" పళ్ళు కొరుకుతూ అన్నాడు.

"ఎవరామె? "

"ఒక కుర్ర పోలీస్ ఇన్‌స్పెక్టర్ వుండేవా డులెండి. వాడి మరదలు"

"వుండేవాడు అంటున్నారు. అంటే ఇప్పుడు లేడా? "

"లేడు... ఎవరో పెద్దవాళ్ళతో పెట్టుకు న్నాడు. చంపిపారేశారు"

"ఎవరా ఇన్‌స్పెక్టర్? ఆమధ్య హత్యా చెయ్యబడిన విజయా? " అనుమానంగా ప్రశ్నించాడు.

"అవును..."

"ఆ అమ్మాయి అతని మరదలా? పేరు?"

"జ్వాల"

'యస్... ఆమె పేరు జ్వాల. ఇన్‌స్పెక్టర్ విజయ్ మరణవార్తని ప్రచురించిన పేపరులో అతని మృతదేహం దగ్గర రోదిస్తున్న ఆమె ఫొటో వేశారు. తను గుర్తుపట్టలేకపోయాడామెని, రామచంద్రకి ఆమె ఎవరో గుర్తువచ్చింది.

"జ్వాల నాన్నగారిని విమర్శిస్తూ ఎందుకలా మాట్లాడుతోంది?"

"ఒళ్ళు కొవ్వెక్కి. అది తక్కువ లం... కాదుబాబూ. సీత అనే మారుపేరుతో మన ఆశ్రమంలో కొన్నాళ్ళుండి నానా గొడవా చేసింది. దానికి ఉద్యోగం ఇప్పిద్దామని అయ్యగారు దాన్ని ఎం.పి.గారి దగ్గరకి పంపిస్తే ఆయన బుర్ర బద్దలుకొట్టి పారిపోయింది"

"ఉద్యోగంకోసం ఎం.పి.గారి దగ్గరకి పంపడమేమిటి?"

"అదేబాబూ... రికమండేషన్‌కోసం"

"రికమండేషన్‌కోసం ఎం.పి.గారి దగ్గరకి వెళ్ళి ఆయన దయతలిస్తే తప్ప ఉద్యోగం రాదని తెలిసీ ఆయన బుర్రబద్దలు కొట్టడమేమిటి?" అతనికి అర్థంకాలేదు.

కళ్ళముందు కొద్దిసేపటి కిందట నుదుటికి గాయమై రక్తం స్రవిస్తూ ఆమె కనిపిస్తోంది. ఆవేశంగా, ఖంగున మోగే స్వరంతో నిలదియ్యడం గుర్తుకొస్తోంది.

"వితంతు పునర్వివాహాలు జరగాలని ప్రోత్సహించే ఆయన వితంతువైన తన కూతురికి పునర్వివాహం ఎందుకు చెయ్యలేదని ప్రశ్నిస్తున్నాను"

"మీ చెల్లెలికి మళ్ళీ పెళ్ళి చేయాలనే ఆలోచన మీ నాన్నగారికి ఎందుకు రాలేదు" అంటున్న ఇందుమతి గుర్తుకొచ్చింది.

'నిజమే ఆయనకి ఆ ఆలోచన ఎందుకు రాలేదు?' అనే సందేహం వచ్చిందతనికి.

★ ★ ★

"అయ్యయ్యో... ఒళ్ళంతా ఈ దెబ్బలేమిటక్కా? నుదిటిమీద నుంచి రక్తం కూడా వస్తోంది" ఆదుర్దాగా అడిగింది రమ.

"చిన్న దెబ్బలే. ఫర్వాలేదు" జ్వాల నవ్వబోయింది. కానీ అడుగు కదపడానికి కాళ్ళు సహకరించడంలేదు. రాళ్ళదెబ్బలతో ఒళ్ళంతా పచ్చిపుండులా వుంది.

"చిన్నదెబ్బలేమిటి? నడవలేకపోతున్నావు. అసలు ఎలా తగిలాయి ఇన్ని దెబ్బలు? వుండు... ఆటో పిలుస్తాను. డాక్టరు దగ్గరకు వెళ్దాం" జ్వాల వద్దని వారిస్తున్నా వినకుండా రమ ఆటో పిలుచుకుని వచ్చింది.

డాక్టరు జ్వాలని పరిశీలిస్తూ అడిగాడు, "ఈ దెబ్బలేమిటి? ఎలా తగిలాయి?"

"రాళ్ళ గుట్టమీద జారిపడ్డాను" అంది జ్వాల ముభావంగా.

"జారిపడినట్టులేదు. ఎవరో కావాలని కొట్టినట్టువుంది. ఏ ఉద్యమంలోనైనా పార్టిసిపేట్ చేశారా?"

'ఉద్యమమే. సంఘసేవ ముసుగులో అకృత్యాలకి పాల్పడుతున్న ఒక సంఘవిద్రోహి నిజస్వరూపాన్ని బయటపెట్టే ఉద్యమం' మనసులోనే అనుకుంది.

నుదుటికైన గాయాన్ని క్లీన్‌చేసి కట్టుకట్టి ఇంజక్షన్ చేసి మందులు రాసిచ్చాడు డాక్టరు.

ఇంటికి వచ్చేవరకూ ఎలాగో ఉగ్గబట్టుకున్న రమ అడిగింది.

"నిన్నెవరు కొట్టారక్కా?"

"హరిశ్చంద్ర మనుషులు"

ఉన్నట్టుండి ఏడవడం మొదలుపెట్టింది. "వద్దక్కా! వాడిజోలికి వెళ్ళకు. బావని చంపేసినట్టే నిన్నూ చంపేస్తారు వాళ్లు"

"నేను చచ్చిపోయినా ఫర్వాలేదు. ఆ హరిశ్చంద్ర నిజస్వరూపాన్ని బయటపెట్టాలి" కసితో, ద్వేషంతో రగిలిపోతూ అంది.

"బావ చచ్చిపోయాడు. మామ్మ చచ్చిపోయింది. నువ్వు తప్ప నాకెవరున్నారక్కా?"

జ్వాల గుండెని తాకాయి ఆ మాటలు.

"నీకోసం, కేవలం నీకోసమే నా పగని మరచిపోతాను" అంది వాగ్దానమిస్తున్నట్టు.

★ ★ ★

వారపత్రికలో 'నింగిలోని జాబిలి' అనే కథని చదువుతోంది ప్రతిమ. పేదవాడు, నిరుద్యోగి అయిన ఒక యువకుడిని డబ్బున్న ఒక అమ్మాయి ఇష్టపడుతుంది. తండ్రితో చెప్పి అతనికి ఉద్యోగం ఇప్పిస్తుంది. అతనిలోని రచయితని గుర్తించి ప్రోత్సహిస్తుంది. ఆమె అతనితో చనువుగా సరదాగా మాట్లాడుతూ అతనిపై తనకి వున్న ఇష్టాన్ని వ్యక్తంచేస్తుంటే అతను తన హద్దులు తెలిసి ఆమెతో ముభావంగా వుంటాడు.

ఒకరోజు ఆమె అతనితో ఇలా అంటుంది.

'రాజకుమార్తెలాంటి ఒక అమ్మాయి మిమ్మల్ని వెతుక్కుంటూవచ్చి 'మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను, మీకోసం నా ఆస్తిని, అంతస్థుని వదులుకోడానికి సిద్ధంగా వున్నాను' అందనుకోండి, మీరేంచేస్తారు?'

చదువుతున్న ప్రతిమ భృకుటి ముడిపడింది. చప్పున ఆ కథ రాసిన రచయిత పేరుకోసం చూసింది.

రవిశంకర్. ఆమె కళ్ళు వెడల్పయ్యాయి. రవి రాశాడా ఈ కథని? రవి పేరు చూస్తుంటే అతన్ని చూస్తున్నట్టే అన్పిస్తోంది. ఆమె చేతివేళ్ళు అపురూపంగా, ప్రియంగా రవిశంకర్ అనే అక్షరాలని స్పృశిస్తున్నాయి.

'రవిని చివరిసారిగా కలుసుకున్నప్పుడు తను అన్నమాటలివి. అవును. చివరిసారి... అదే చివరిసారి తను అతన్ని కలుసుకోడం. ఆ రాత్రే తండ్రి తన వివాహ ప్రస్తావన తెచ్చి విష్ణు ఫొటోని చూపించాడు. తను రవిని ప్రేమిస్తున్న విషయాన్ని చెప్పింది. అంతే! తండ్రి నిజస్వరూపాన్ని చూసింది. తన కలలన్నీ భగ్నమయిపోయాయి' ప్రతిమ చెక్కిళ్ళని అశ్రుధారలు తడిపేస్తున్నాయి.

'తనన్న మాటలని యధాతధంగా కథలో రాశాడంటే అది తమ కథేనా?'

ఆమె కన్నీళ్ళని తుడుచుకుని మళ్ళీ చదవనారంభించింది.

"మీకోసం నా ఆస్తిని, అంతస్థుని వదులుకోడానికి సిద్ధంగా వున్నాను అందనుకోండి మీరేంచేస్తారు?" అనే ఆమె మాటలు అతనికి అర్ధంకావటంలేదు. కాని ఆమెకి తనపై ఇష్టాన్ని మించి ఏదో వుందని అతనికి తెలుసు. మరునాటినుంచి ఆమె అతనికి కనిపించడం మానేసింది. పదిరోజుల తరువాత ఆమె పెళ్ళివార్తని విన్నాడతను"

"ఆమె తనని ప్రేమించిందని, అది తెలిసి ఆమె తండ్రి ఆమెని అర్ధాంతరంగా చదువు మానిపించి, ఆమె పెళ్ళి నిశ్చయించాడని అర్ధమయిందతనికి. ఆమె తనని ప్రేమించిందని, తను ఆమెని ప్రేమిస్తున్నాడని తెలిసినా ఏం చెయ్యగలడు అతను? రాజకుమార్తెలాంటి ఆమె ఎక్కడ? జీతంరాళ్ళే ఆధారంగా బతికే తను ఎక్కడ? నింగిలోని జాబిలిని అందుకోవాలనుకోవడం దురాశే అవుతుంది... వేదనగా అనుకున్నాడతను" కథ చదవడం పూర్తిచేసిన ప్రతిమ కళ్ళు అవిరామంగా వర్షిస్తున్నాయి.

తను రవిని కోరుకున్నట్టే అతను కూడా తనని కోరుకున్నాడు. కాని, తమ జీవితాలు ఎప్పటికీ కలవని సమాంతర రేఖల్లా మిగిలిపోయాయి.

★ ★ ★

"శుక్లాం బరదరం ఇష్టం
శశివరణం చతుర్భుజం..." రాగయుక్తంగా చదువుతూ గేదెలని కడుగుతున్నాడు దుర్గయ్య.

"వెధవ! వెధవన్నర వెధవాని. బరదరం కాదురా బరధరం. ఇష్టంట ఇష్టం.

శ్లోకాన్ని ఎందుకలా భ్రష్టు పట్టిస్తున్నావు? చదవడం రాకపోతే నోర్మూసుకో" వేపచెట్టు కింద వాలుకుర్చీలో కూర్చుని పేపరు చూస్తున్న హరిశ్చంద్ర విసుగ్గా అడిగాడు.

"బడిలో పంతులుగారు చెప్పారయ్యగారూ"

"పంతులుగారు చెప్తేమాత్రం నీకు ఉచ్ఛరించడం రావద్దూ? తక్కువ జాతి వెధవ్వి"

దుర్గయ్య అపరాధిలా తల వంచుకున్నాడు.

"శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం

ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోప శాన్తయే

వ్యాసం వశిష్ట నప్తారం శక్తేః పౌత్రమకల్మషం..."

ఇందుమతి తులసికోట దగ్గర దీపారాధన చేస్తూ చదువుతోంది.

"అదీ అలా చదవాలి" ప్రశంసగా కోడలి వైపు చూశాడు.

"త్రిసామా సామగస్సామ నిర్వాణం భేషజం భిషక్" తన్మయత్వంతో వింటున్నాడు హరిశ్చంద్ర.

"సంకీర్త నారాయణ శబ్దమాత్రం విముక్త దుఃఖా సుఖినోభవన్తు"

పారాయణ పూర్తిచేసి మామగారి దగ్గరకి కాఫీ గ్లాసుతో వచ్చిందామె.

"అమ్మా ఇందుమతీ! నీకో విషయం తెలుసా? ఈ చుట్టుపక్కలవాళ్ళెవరూ మన కులంపేరు చెబితే నమ్మరమ్మా! సాంప్రదాయంలోగానీ, ఆచార వ్యవహారాలలోగానీ, బ్రాహ్మణులని మించిపోయామంటారు. కానీ నువ్వు విష్ణు సహస్రనామాన్ని చదువుతుంటే సాక్షాత్తూ ఆ సరస్వతీదేవి వచ్చి నా గుమ్మంలో నిలబడి విష్ణుమూర్తిని కీర్తిస్తున్నట్టుంది"

"సాధన చేస్తే దుర్గయ్య నాకంటే బాగా చదవగలడు మామయ్యగారూ" చిరునవ్వుతో అంది.

"దుర్గయ్యా! మాట్లాడ్డానికే నాలుక తిరగని హరిజనుడికి సంస్కృత శ్లోకాలేం నోరు తిరుగుతాయి? "

"మరి నేను విష్ణు సహస్రనామాన్ని చదువుతుంటే సరస్వతీదేవి విష్ణుమూర్తిని కీర్తిస్తున్నట్టుందన్నారుకదా మామయ్యా" నవ్వాపుకుంటూ అంది.

"అదేనమ్మా నేను చెబుతున్నది కూడా. తెలియనివాళ్ళు మన భాష, ఉచ్చారణలను చూసి మనల్ని బ్రాహ్మణులమనే అనుకుంటారు"

"మనం అని నన్ను కలపకండి మామయ్యా"

"అమెరికాలో పదేళ్ళు వున్నంతమాత్రాన నువ్వు దొరసానివయిపోయానంటావామ్మా? " నవ్వుతూ అడిగాడు.

"దుర్గయ్య కులమే మాది కూడా. మేం హరిజనులం"

హరిశ్చంద్ర చేతిలోని కాఫీ కప్పు తొణికి సలాడి ఆయన ఒళ్ళో కాఫీ ఒలికింది.

"నువ్వు చెప్పేది...? " షాకింగ్‌గా చూస్తూ అడిగాడు.

"నిజం మామయ్యా! అమెరికాలో పది సంవత్సరాలుగా వున్నా, మాకు ఎప్పుడూ ఎదురవని కుల సమస్య పెళ్ళి విషయంలో ఎదురయ్యేసరికి ఏం చెయ్యాలో తోచలేదు మామయ్యా! రామచంద్రని వదులుకోలేని బలహీనత నాది. నేను లేనిదే బతకలేనంత గాఢమైన ప్రేమ ఆయనది. నా కులమేమిటో తెలిస్తే మీరు మా పెళ్ళికి ఒప్పుకోరేమో అని భయం. అక్కడికీ నేను చెబుతూనే వున్నాను. మీలాంటి ఆదర్శవాదికి కులమతాల పట్టింపు ఉండదని. కానీ ఆయన భయపడ్డారు. మిమ్మల్ని ఎదిరించి పెళ్ళి చేసుకునే ధైర్యం ఆయనకి లేదు. అటు మిమ్మల్ని వదులుకోలేక, ఇటు నన్ను వదులుకోలేక మానసిక సంఘర్షణని అనుభవిస్తూ వుంటే..."

"మీది మా కులమే అని నన్ను నమ్మించి ఈ ఇంటి కోడలివయ్యావు. ఈ పథకం ఎవరిదమ్మా? మీ నాన్నగారిదా?" ఆయన నవ్వుతూ అడిగారు. ఆయన ముఖంలోని నవ్వు చూశాక ఇందుమతికి ధైర్యం వచ్చింది.

"మా నాన్నగారు అది తప్పని, అలా మోసం చెయ్యకూడదని చెబుతూనే వున్నారు. నేనే రామచంద్రకి మీతో అబద్ధం చెప్పమని ఒప్పించాను"

"నువ్వు చాలా తెలివైనదానివమ్మా! ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగల నన్నే బుట్టలో పడేసి ఈ ఇంటికోడలివయ్యావు" హరిశ్చంద్ర కళ్ళలో ఆ క్షణంలో మెరిసిన ఎర్రజీరని కనిపెట్టలేక పోయింది ఇందుమతి.



రామచంద్ర ఆశ్రమంలో అడుగుపెట్టేసరికి ఘాటైన మసాలా వాసన ముక్కుకి సోకింది. అది నాన్‌వెజ్ వంటకం వండుతున్నప్పుడు వచ్చే వాసన అని అతను గ్రహించగలిగాడు.

సదాశివం అతన్ని చూడగానే ఆడంబరంగా ఆహ్వానించాడు.

"నమస్కారం... రండి అబ్బాయిగారూ!"

అతను ఆఫీసు రూమ్‌లోకి నడిచాడు.

"ఎకౌంట్ బుక్స్ చూపించండి"

"అవన్నీ నాన్నగారు నిన్ననే చూశారు. మీకెందుకు బాబూ శ్రమ?"

"నాన్నగారి వారసుడిగా నేనూ తెలుసుకోవాలనుకుంటున్నాను"

సదాశివం ఎకౌంటు బుక్స్ అతని ముందుంచాడు.

రామచంద్ర దీక్షగా ఆ నెల ఖర్చులని చూస్తున్నాడు.

వారానికి రెండుసార్లు చికెన్, మటన్ కొన్నట్లు ఖర్చురాసివుంది. కూరగాయలు, పాలు, గుడ్లు సంతృప్తిగా కనిపించిందతని ముఖంలో.

"ఆశ్రమంలోని ఇంతమందికీ పోషక విలువలున్న భోజనం పెట్టాలంటే చాలా ఖర్చుతో కూడిన పనికదా. మరి ఆశ్రమానికి ఆదాయం..."

"అయ్యగారి దాతృత్వం... పది ఎకరాల భూమిని ఆశ్రమానికి రాసి ఇచ్చారు. దానిపై వచ్చే దిగుబడితోను, కొందరు ధర్మాత్ములు విరాళాల రూపంలో ఇచ్చే డబ్బుతోనూ ఇక్కడివాళ్ళు కడుపునిండా తింటున్నారు. నిజానికి వాళ్ళని అయ్యగారు కన్నతండ్రికంటే ఎక్కువగా చూసుకుంటున్నారు. వాళ్ళు అనాధలెలా అవుతారు?"

ఆ మాటలతో అతనిలో తండ్రి ఎడల వున్న గౌరవం ఆరాధనా భావంగా మారింది.

భోజనాలవేళ అయిన సూచనగా బెల్ మోగింది. రామచంద్ర ఇంటికివెళ్ళే ప్రయత్నమేమీ చెయ్యకపోవడంతో సదాశివం అన్నాడు.

"మీకు అభ్యంతరం లేకపోతే మీరూ ఇక్కడే భోజనం చేసి వెళ్ళండి అబ్బాయిగారూ"

"లేదు... నేను ఇంటికి వెళ్తాను. అందరూ భోజనాలకి వెళ్తున్నారుకదా... అందరికీ అన్నీ అందాయో లేదో చూస్తాను" అంటూ బయటకి వచ్చాడు.

"వడ్డన చూసుకోవడానికి ఆయాలున్నారు" అతన్ని భోజనాల దగ్గరకి వెళ్ళనివ్వకుండా సదాశివం ఆపబోయాడు. కానీ రామచంద్ర

ఆగలేదు.

వంటశాల దగ్గర క్యూలో నిలబడి వున్న జనాలకి పళ్ళాలలో అన్నం, సాంబారు వడ్డిస్తున్న ఇద్దరు ఆయాలని ముడివడిన భ్రుకుటితో చూశాడు.

సదాశివానికి చెమటలు పడుతున్నాయి.

"వట్టి సాంబారేనా? కూరలేవీ? "

అతనికేం సమాధానం చెప్పాలో అర్థంకావడం లేదు.

"ఈరోజు సోమవారం. ఎకౌంటుబుక్‌లో రాసినదాని ప్రకారం ఈరోజు చికెన్ వండాలి. కూర వడ్డించడం మరిచిపోయారా? "

నీళ్ళు నములుతున్న సదాశివాన్ని చూసి ఒక వృద్ధుడు అన్నాడు, "రోజూ సాంబారన్నమే బాబూ. కూర వండరు. వండినా మాదాకా రాదు"

"కూరలేదా? అని అడిగితే ఇంటిదగ్గర ఎప్పుడైనా కూర తిన్నావా? ఇక్కడ కూర కావలసి వచ్చిందా అని అడుగుతారు" చెప్పిందో నడివయసు స్త్రీ.

'ఒక్కరోజు మీ ఆశ్రమంలో గడిపి చూడండి అక్కడ జరిగే అక్రమాలన్నీ బయటపడతాయి' జ్వాల మాటలు అతని చెవులలో మార్మోగాయి.

"మేనేజర్. ఏమిటిది? ఏం జరుగుతోందిక్కడ" తీవ్రస్వరంతో అడిగాడు.

సదాశివానికి మాట పడిపోయింది. పాలిపోయిన ముఖంతో చూస్తున్నాడు గుడ్లప్పగించి.

రామచంద్ర కిచెన్‌లోకి వెళ్ళాడు. అక్కడ చికెన్ కర్రీ, మీగడ పెరుగు మూతపెట్టి వున్నాయి.

"ఇవి ఎవరికి? "

వంటమనిషి గడగడా వణికిపోయింది.

"మేనేజరు బాబుని అడగండి. ఆయన చెప్పినట్లు చెయ్యడంతప్ప జరిగినదాంట్లో నా ప్రమేయంలేదు"

అతను తిరిగి సదాశివం దగ్గరకి వచ్చాడు. ఉక్రోషంతో పళ్ళు కొరుక్కుంటున్న అతను రామచంద్రని చూడగానే "మీరిలా రండి" అని ఆఫీస్ రూమ్‌కి తీసుకొచ్చాడు.

"కిచెన్‌లో వున్న చికెన్ కర్రీ, మీగడపెరుగు ఎవరి కోసం? "

"ఇక్కడ జరిగేదంతా అయ్యగారికి తెలుసు. మీరు ఆయనతో మాట్లాడండి"

"నాన్నగారికి తెలుసా? "

"తెలుసు అబ్బాయిగారూ"

"సరే! మాట్లాడతాను" అతను విసురుగా కారు తాళాలని అందుకుని బయటకి వెళ్ళిపోయాడు.

★ ★ ★

"నేను మీతో కొంచెం మాట్లాడాలి నాన్నగారూ" తండ్రి గదిలోకి వెళ్తూనే అన్నాడు రామచంద్ర

"చెప్పు"

"మన అనాథాశ్రమంలో చాలా అవకతవకలు జరుగుతున్నాయి. ఎవరికీ పోషకాహారం అందడంలేదు. ఎకౌంటు బుక్స్‌లో మాత్రం వారానికి రెండుసార్లు చికెన్ లేదా మటన్ కొంటున్నట్టు రాసివుంది. ఖర్చు చూపిస్తున్నారు. ఆ డబ్బు ఎవరు కైంకర్యం చేస్తున్నారు? సదాశివాన్ని అడిగితే ఇవన్నీ మీకు తెలుసని చెబుతున్నాడు"

"నాకు తెలుసు" నవ్వేడు హరిశ్చంద్ర.

"తెలిసీ ఆ అన్యాయాన్ని అరికట్టలేకపోయారా నాన్నగారూ? ఆ సదాశివాన్ని పనిలోనుంచి వెళ్లగొట్టక ఎందుకు ఉపేక్షిస్తున్నారు? "

"కొన్ని చూసీచూడనట్టు వూరుకోడమే ఉత్తమం"

"అదేమిటి నాన్నగారూ? అతను మనని మోసం చేస్తున్నాడు"

"కడుపున పుట్టిన పిల్లలే కన్నవాళ్లని మోసం చేస్తున్న రోజులివి. జీతం రాళ్ల కోసం పనిచేసే ఒక నెల జీతగాడు కక్కుర్తి పడడంలో ఆశ్చర్యమేముంది" రామచంద్ర

ముఖం జేవురించింది.

"అతను ఒక్కడు కక్కుర్తిపడడం వలన వందమంది అర్ధాకలి భోజనం చేస్తున్నారు. నేను కిచెన్‌లోకి వెళ్లి చూశాను. అక్కడ చికెన్ కర్రీ, మీగడ పెరుగు మూత పెట్టి వున్నాయి. అవి ఎవరికోసం దాచుకున్నట్టు? "

"స్టాఫ్ తింటారు. చూడు రామ్! అనాథాశ్రమంలోని వాళ్లకి రోజూ చికెన్ కర్రీ వండించి పెట్టడానికి వాళ్లేమైనా వి.ఐ.పి.లా? తినడానికి తిండిలేక కూలి పని చెయ్యడానికి సత్తువ లేక అక్కడకొచ్చిన వాళ్లే. మనం వాళ్లకి సాంబారన్నమైనా పెడుతున్నాం. బయట వాళ్లకి గంజినీళ్లు కూడా దొరకవు. నువ్వు చెప్పినట్టు వాళ్లందరికీ రాయల్ ట్రీట్‌మెంటు ఇచ్చి స్పెషల్ మీల్స్ ఇస్తే మన ఆస్తి తెగనమ్మినా చాలదు"

అతను తండ్రి నుంచి ఇలాంటి జవాబు వస్తుందని ఊహించలేదు. అసంతృప్తిగా వెనుదిరగబోయాడు.

"అన్నట్టు ప్రొద్దుట నీ భార్య విష్ణు సహస్రనామాన్ని చదువుతుంటే సరస్వతీదేవి ఆమె నాలుకపై నర్తించిందేమో అనిపించింది. హరిజనుల పిల్ల అయివుండీ ఆమె స్వచ్ఛమైన ఉచ్చారణ, ఆమెలోని సంస్కారం ఓహ్! నాకే ఆశ్చర్యమనిపించింది"

రామచంద్ర చెవులు పనిచెయ్యడం మానేశాయి. తండ్రి నోటి వెంట హరిజనులపిల్ల అనే మాట వినగానే అతను స్తంభించిపోయాడు.

నోటమాట రానట్టు చూస్తున్న కొడుకుని చూసి నవ్వుతూ అడిగాడు.

"నువ్వు నా నుంచి దాచాలనుకున్న రహస్యం నాకెలా తెలిసిపోయిందా అని నీ ఆశ్చర్యం! ఇందుమతే స్వయంగా చెప్పింది"

"ఇందుమతి చెప్పిందా? " అతను ఊపిరి పీల్చుకోడం మరచిపోయాడు.

"నీ భార్య చాలా తెలివైనది. ఇంత పెద్ద సంసారాన్ని నడపడానికి ఆమాత్రం తెలివితేటలు అవసరమేలే"

రామచంద్ర చప్పున తండ్రి పాదాలని తాకాడు. "నేను తప్పు చేశాను. నన్ను క్షమించండి నాన్నగారూ"

"నాకు నీపై కోపం లేదురా! నీ వయసు అలాంటిది. నువ్వు ఇందుమతిని ప్రేమించావు. మీ ప్రేమకి ఆమె కులం అడ్డురాలేదు. కాని పెళ్లికి అడ్డు అవుతుందేమో అనే భయంతో ఆమె మన కులమేనని అబద్ధం చెప్పావు. బహుశా నీ పాతికేళ్ల జీవితంలో నువ్వు చెప్పిన మొదటి అబద్ధం ఇదేనేమో! మన వంశంలో అటు ఏడు తరాలు, ఇటు ఏడు తరాలలో ఇంతవరకు ఎవరూ కులాంతర వివాహం చేసుకోలేదు. నీ పెళ్లే మొదటిది. అఫ్‌కోర్స్ ఈ రోజుల్లో ఇవన్నీ మామూలే అనుకో. ఈ విషయాన్ని బయటపెట్టద్దు. మన ముగ్గురి మధ్యనే వుండిపోవాలి. అర్థమయిందా? " రామచంద్ర తల వూపి బయటకి వచ్చాడు.

"తండ్రి మంచివాడు. తన మనసెరిగినవాడు. తను చేసిన తప్పుల్ని గుండెల్లో దాచుకుని ఇందుకి కోడలిగా ఈ ఇంట్లో స్థానమిచ్చాడు. నిజానికి పెళ్లికి ముందు ఇందు కులమేమిటో తెలిసినా తమ పెళ్లికి ఒప్పుకునేవాడే. తనే అనవసరంగా భయపడి అబద్ధంతో ఆమెని పెళ్లి చేసుకున్నాడు. అతనికి తండ్రిపట్ల మనసులో వున్న భయసంకోచాలన్నీ పటాపంచలయ్యాయి.

★ ★ ★

రామచంద్ర గదిలోకి వెళ్లేప్పటికి ఇందుమతి పుస్తకం చదువుతోంది. భార్యని చూసిన అతనికి ఒక చిలిపి ఆలోచన వచ్చింది. విషాదాన్ని, గాంభీర్యాన్ని ముఖంలో అరువు తెచ్చుకుని అన్నాడు.

"ఎంత పని చేశావ్ ఇందూ? "

ఆమె అదిరిపడింది. చేతిలోని పుస్తకం జారి నేల మీద పడడం కూడా గమనించ

నంత దిగ్భ్రమతో అడిగింది.

"నేనా! నేనేం చేశాను? " అడిగింది అయో మయంగా.

"మా నాన్నగారితో నువ్వు హరిజనుల అమ్మాయివని చెప్పావా? "

"చెప్పాను. అయితే ఏమిటి? "

"మన ఇద్దరి గుండెలలో నిక్షిప్తం కావల సిన నిజాన్ని ఎందుకు వెల్లడి చేశావ్ ఇందూ? "

"దుర్గయ్య విఘ్నేశ్వరస్తుతిని ఉచ్ఛారణా దోషాలతో చదువుతుంటే తక్కువ కులం వాళ్లకి మాట్లాడ్డానికే నోరు తిరగదని మామయ్యగారు ఈసడిస్తుంటే భరించలేక పోయాను. నేను విష్ణుసహస్రనామాన్ని చదివితే విని మామయ్యగారే పొగిడారు నన్ను"

"అంటే! తక్కువ కులం వాళ్లు కూడా బ్రాహ్మణుల కంటే స్వచ్ఛంగా మాట్లాడగల రని, సంస్కృత శ్లోకాలని అభ్యాసం చేస్తే పండితులకంటే బాగా చదవగలరని అందుకు ఉదాహరణగా నిన్ను నువ్వు చూపించుకున్నావ్. అంతేనా" అదే సీరి యస్‌నెస్‌ని స్వరంలోనే కాదు ముఖంలో కూడా మెయింటెయిన్ చేస్తూ అన్నాడు.

"అవును. అయినా నా కులమేమిటో తెలిసి మామయ్యగారు ఆగ్రహించలేదు సరి కదా నేను తెలివైన దాన్నని అభినందిం చారు. మీరేమిటి ఏదో కొంప మునిగిపో యినట్టు మీరు గాభరాపడి నన్ను గాభరా పెట్టేస్తున్నారు? "

"నిన్ను ముఖస్థంగా ఎందుకంటారు? ఆయనో ఆదర్శవాది అని ప్రపంచమంతా కీర్తిస్తోందికదా! నన్ను పిలిచి ముక్క చివాట్లు పెట్టారు. తనని మోసం చేసినం దుకు నన్ను నిలదీశారు. నీకీ ఇంట్లో స్థానం లేదని తెగేసి చెప్పారు"

అప్పటికే ఇందుమతి ముఖం పాలిపో యింది. "మరి మీరేం అన్నారు? "

"మీకిష్టం లేదని తెలిశాక ఇందుమతికి భార్యగా స్థానం ఇవ్వలేను. ఆమెకి విడాకు లిచ్చి మన కులంలో మీకు నచ్చిన అమ్మా యిని పెళ్లి చేసుకుంటానని చెప్పాను"

"మన ప్రేమని మరచిపోయి నన్ను వది లేస్తానన్నారా? మీ నాన్నగారికి ఇష్టంలేక పోతే నాకు విడాకులివ్వాలా? ఆయనకి ఇష్టం లేకపోతే మనం ఇక్కడ నుంచి వెళ్లి పోదాం. అమెరికాలో మన చదువులకి ఉద్యోగాలు దొరక్కపోవు"

"అక్కడ ఎవరి దగ్గరో ఊడిగం చేస్తూ బతకడం నావల్ల కాదు బాబూ! ఇక్కడైతే అడుగడుగునా నౌకర్లు, ముఖ్యంగా ఈ సిరి సంపదలని హోదాని వదులుకోడం నావల్ల కాదు. విడాకులిచ్చి నీకు అన్యాయం చేస్తాన నుకోకు. నా ఆస్తిలో సగభాగాన్ని మెయిం ట్‌నెన్స్‌గా ఇస్తాను. అమెరికాలో ఎలాగా నీ చదువుకి మంచి ఉద్యోగమే వస్తుంది. మా నాన్నగారికి ఇష్టంలేని పని నేను చెయ్య లేను, నీ కులాన్ని దాచి పెళ్లిచేసుకోలేనని చెప్పాను. నువ్వు వినలేదు. నాచేత పెద్ద అబద్ధం చెప్పించావు. పూర్తిగా నీ తప్పే కాదనుకో. నిన్ను వదులుకోలేని బలహీన తతో నేనూ అబద్ధం చెప్పాను. కాని మా నాన్నగార్కి మనం చేసిన మోసం తెలిసి నీకు ఈ ఇంట్లో స్థానం లేదని చెప్పాక మనం ఆయనకి ఎదురు తిరిగి ఏం సుఖప డగలం? అందుకే మనం విడాకులు తీసు కుందాం. రేపే లాయర్‌ని సంప్రదిస్తాను"

"యూ చీట్! నన్నింత మోసం చేస్తావా? ప్రేమించేటప్పుడు నా కులమేమిటో తెలి యదా? ప్రేమకి అడ్డురాని కులం పెళ్లికి అడ్డు వచ్చిందా? తండ్రి అడుగుజాడలలో నడిచే అపర శ్రీరామచంద్రుడు. మీ నాన్న గార్కి ఇష్టంలేదని నాకు విడాకులిస్తావా? " శివంగిలా విరుచుకుపడిన ఇందుమతి ఆవే శంతో అతని షర్టుకాలర్‌ని పట్టుకుంది.

ఆమెని చేతులతో చుట్టేస్తూ పకపకనవ్వే డతను. "ఇదంతా నిజమనుకున్నావా? నీ రియాక్షన్ ఎలా వుంటుందో అని నిన్ను

టెస్ట్ చేశానంతే"

ఇందుమతి తెల్లబోయంది. "నిజం కాదా? మీ నాన్నగారు కోడలిగా నాకు ఈ ఇంట్లో స్థానం లేదని.."

"అనలేదు. ఆయన్ని నీ తెలివి తేటలతో బోల్తా కొట్టించినందుకు మెచ్చుకున్నారు"

"ఏయ్! నీకు ఆటగా వుందా?" పిడికెళ్లతో అతని గుండెల మీద గుద్దబోయింది.

ఆ చేతులని గట్టిగా బిగించిపట్టుకుని నవ్వేడు.

"అమ్మో! అపర సత్యభామ! తెలివి తేటలే కాదు. అన్యాయం జరిగితే షర్టు కాలరు పట్టుకుని నిలదీసేంత ధైర్యం కూడా వుంది నీకు"

"మీకు దూరమైపోవాలనే ఊహనే భరించలేను నేను" కన్నీళ్లతో అంది.

"దూరంగా వుంచి నన్నేడిపిస్తున్నావుగా"

"ఈ దూరం తాత్కాలికం. ప్రతిమ పెళ్లి గురించి గట్టి ప్రయత్నం చెయ్యండి. ఆమెని చూస్తే నాకు భయం వేస్తోంది. గది వదిలి బయటకి రాదు. తిన్ననాడు తింటుంది. లేని నాడు లేదు. ఆమెనలాగే వదిలేస్తే కొన్నాళ్లకి పిచ్చి దవడం ఖాయం" ఇందుమతి చుట్టూ బిగుసుకున్న అతని చేతులు వదులయ్యాయి. ప్రతిమ ప్రస్తావన రాగానే అతని ముఖం గంభీరమయింది.

"నాన్నగారితో ప్రతిమ విషయం మాట్లాడాలి" అనుకున్నాడు.

★ ★ ★

రాత్రి పదకొండు గంటలయింది. సుధేష్ణాదేవి చదువుతున్న పుస్తకాన్ని మూసి నిద్రకి ఉపక్రమించబోతున్నదల్లా ఎవరో తలుపు తట్టిన శబ్దం విని తలుపు తీసింది. గుమ్మం బయట నిలబడి వున్న భర్తని చూసి అప్రయత్నంగానే ఒక అడుగు వెనక్కివేసింది.

"షాక్ తిన్నావా? నేను ఈ రాత్రి నీ గది తలుపులని తడతానని ఊహించి వుండవు కదూ? నేను వచ్చే అవసరాన్ని నువ్వే కల్పించావు"

"నేనా" ఆవిడ అయోమయంగా చూసింది.

"అవును నువ్వే" ఆయన గదిలోకి వచ్చి మంచంమీద కూర్చున్నాడు.

"ఆ తలుపు వేసిరా"

"ఎందుకు"

"లోకం మనది చాలా అన్యోన్యమైన దాంపత్యమనే భ్రమలో వుంది. వాళ్లని నమ్మించాలంటే మనం నటించక తప్పదు"

ఆవిడ ఆయనకేసి చూడ్డానికి కూడా ఇష్టపడనట్టు నేల చూపులు చూస్తోంది.

ఆవిడ తలుపు మూసే ప్రయత్నమేమీ చెయ్యకపోవడంతో ఆయన నవ్వి అన్నాడు.

"తలుపు ముయ్యమంటే నువ్వేదో లేనిపోనివి ఊహించుకుంటున్నట్టున్నావు. నీ నుంచి ఒక రహస్యాన్ని తెలుసుకుని వెళ్లిపోతాను" అన్నాడు తలుపు మూసి వచ్చి మంచం మీద కూర్చుంటూ.

"రహస్యమా?"

"అవును రహస్యమే. నీకు, రామ్‌కి, వాడి భార్యకి మాత్రమే తెలిసిన రహస్యం"

"మీరేం మాట్లాడుతున్నారో నాకు అర్థం కావడం లేదు"

"కాదు అర్థం అయినా అవనట్టు నటిస్తున్నావు"

"నటించవలసిన అవసరం నాకు లేదు. నిజంగా మీరేం మాట్లాడుతున్నారో నాకు తెలియదు"

"పోనీ నేను అడిగిన దానికి జవాబియ్యి. ఇందుమతి మన కులం కాదని రామ్ పెళ్లికి ముందే తెలుసా?"

"తెలుసు" నిర్భయంగా చెప్పింది.

"తెలిసీ నాకెందుకు చెప్పలేదు?"

"చెప్పాలనిపించలేదు"

"ఎందుకని?"

"తెలిస్తే మీరు వాళ్ల పెళ్లికి ఒప్పుకోరు"

"వాడి పెళ్లికి పరోక్షంగా ప్రోత్సహించినది నువ్వేనన్న మాట! నా కళ్లు కప్పి మీరిద్దరూ ఎంత నాటకమాడారు"

"కులమతాలు మనం సృష్టించుకున్నవి. అయినా వాడు చేసిన తప్పేమిటి? వాడు మనస్ఫూర్తిగా ప్రేమించిన అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు. ప్రేమ ఒకరితో పెళ్లి మరొక రితో అనుభవం ఇంకొకరితో అన్నట్టు కంటికి నదురుగా కనిపించిన ఆడదానితో నల్లా పోలేదు"

"నీ కొడుకుతో కూడా ఇలాగే చెప్పావా? మీ నాన్న మాల, మాదిగ తేడా లేకుండా కంటికి ఇంపుగా కనిపించిన ఆడదానితో పోతాడు. నువ్వు మాలదాన్ని పెళ్లి చేసు కున్నా పర్వాలేదని వాడిని ఈ పెళ్లికి ప్రోత్స హించావా?"

"నేను ఎప్పుడూ మీ గురించి పిల్లలకి చులక నగా కాని, వ్యతిరే కంగా కాని చెప్ప లేదు. అందుకనే వాళ్లకి మీ మీద వున్న గౌరవం చెక్కుచెదరలేదు"



"నా గురించి వాళ్లకి చులకనగా ఎందుకు చెబుతావ్? వాళ్లని నాజూగ్గా రెచ్చ గొట్టి నాకెదురు తిరిగేలా చేస్తావు. ఇల్లలకగానే పండుగ అయిందనుకోకు. ఆ అంటరాని జాతిలో పుట్టిన పిల్ల ఈ ఇంటి కోడలై మన వంశా నికి వారసులని కని ఛీ ఛీ! తలచుకుంటేనే అసహ్యం వేస్తోంది. దాన్ని ఈ ఇంటికెలా దూరం చెయ్యాలో నాకు తెలుసు" ఆ క్షణంలో ఆయన కళ్లలో మెరిసిన ఎర్రజీరని చూసి ఆవిడ నిలువెల్లా వణికింది. మేక పోతు గాంభీర్యాన్ని ప్రదర్శిస్తూ అంది.

"వాళ్లిద్దరూ ఒకటయ్యారు. ఇంక భగవం తుడు కూడా వాళ్లని వేరు చెయ్యలేడు"

"మీరందరూ నన్ను తక్కువగా అంచనా వేస్తున్నారు. నా విశ్వరూపం చూపిస్తాను" క్షణం ఆగి అన్నాడు. "అవునూ నాకింత ద్రోహం చేసిన నీకు ఎలాంటి శిక్ష వెయ్యా లంటావు"

సుధేష్ణాదేవి చిరునవ్వు నవ్వింది. "నన్ను కొట్టడం మినహా ఏం చెయ్యగలరు మీరు?" అనే భావాన్ని ఆ నవ్వులో చదవగలిగాడా యన.

"నిన్ను కొట్టను" నవ్వేడు. "నీకు నేనంటే అసహ్యం కదూ? నా స్పర్శ గొంగళి పురు గులు పాకినట్టు వుంటుందికదూ నీకు?" ఆవిడని సమీపిస్తూ అడిగేడు.

ఆవిడ ముఖం అప్పటికే పాలిపోయింది. ఆవిడ మరోసారి రేప్ చెయ్యబడింది.

"ప్రతిమ విషయం మీతో మాట్లాడాలి నాన్నగారూ!" రామచంద్ర అనగానే హరిశ్చంద్రప్రసాద్ నిట్టూరుస్తూ అన్నాడు.

"ఏముంది మాట్లాడ్డానికి? డైవేచ్ఛ అలా వుంది. దురదృష్టవం తురాలు. మనం ఏం చెయ్యగలం?"

"దేముడు ప్రతిమ నుదుట రాసిన రాతని మనం మార్చవచ్చు నాన్నగారూ! చెల్లెలికి మళ్లీ పెళ్లి చేద్దాం"

"మన కుటుంబాలలోని వ్యక్తులెవరు ముందుకొస్తారు దాన్ని చేసుకోడానికి?"

"లోకం గొడ్డుపోయిందా? మనం ప్రయ త్నిస్తే సహృదయుడైన వ్యక్తి దొరక్కపోడు"

"చూద్దాం. ముందు ప్రతిమ మామూలు మనిషి అవనియ్యి. అసలే బాధలో వుంది. ఇప్పుడు పునర్వివాహ ప్రసక్తి తెస్తే మరింత బాధపడుతుంది"

"కాలమే అన్ని గాయాలను మాన్పు

తుంది. మీరాలోగా తెలిసి వున్న వాళ్ల ద్వారా ప్రతిమ కోసం మంచి అబ్బాయిని వెతకండి. నేనూ ప్రయత్నిస్తాను"

"అలాగేలే" అన్నారాయన ఏదో ఆలోచిస్తూ. "మరచిపోయాను. ఎల్లుండి ఎమ్. పిగారు వస్తున్నారు. సిటీలో గవర్నమెంటు కట్టబోయే కాలేజీ బిల్డింగ్ కాంట్రాక్టు మనకే వచ్చేలా చూస్తానన్నారు. రాత్రి ఎనిమిది గంటలకి మన గెస్ట్ హవుస్‌లో డిన్నర్ ఏర్పాటు చేశాను. నువ్వు కూడా రా"

"అలాగేనండి నాన్నగారూ" అన్నాడతను.

★ ★ ★

"నమస్కారమండీ" అంటూ లోపలకి వచ్చిన రవిని చూసి హరిశ్చంద్ర భ్రుకుటి ముడిపడింది.

"ఏమిటిలా వచ్చావ్? " అతని రాక తనకే మాత్రం ఇష్టం లేదన్నట్టు ముఖం చిట్లిస్తూ అడిగాడు.

"నేను హైదరాబాదులో ఉద్యోగం చేస్తున్నానండీ. ప్రతిమగారికి వచ్చిన కష్టం గురించి మొన్ననే తెలిసింది. ఆమెని చూసి వెళ్దామని"

"అవసరంలేదు. నీ పరామర్శ, సానుభూతి ఆమెకి అవసరంలేదు. నువ్వింక వెళ్లవచ్చు" మధ్యలోనే అడ్డుపడి అన్నాడాయన.

రవి అవమానాన్ని దిగమింగి ఆయనకి నమస్కరించి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

అతను వెళ్తున్నవైపే చూస్తున్న హరిశ్చంద్ర భ్రుకుటి ముడిపడింది.

"ఎక్కడో హైదరాబాదులో వున్న వీడికి ప్రతిమ గురించి ఎలా తెలిసింది? " ఆయన దండతాడిత భుజంగంలా కూతురి గదిలోకి వచ్చాడు.

అప్పుడు ప్రతిమ వీక్లీ చదువుతోంది. ఒక ప్రముఖ వారపత్రిక అది. ఆయన గదిలోకి వస్తూనే ఆమె చేతులలోని పుస్తకాన్ని లాక్కుని చూశాడు. 'వసంత సమీరం' అనే సీరియల్‌ని చదువుతోందామె. రచయిత రవిశంకర్! రవి ప్రతిమని చూడ్డానికి ఇంటికి రావడం, అదే సమయంలో అతను రాసిన సీరియల్‌ని ఆమె చదువుతుండడం యాదృచ్ఛికమే అయినా అగ్నిలో ఆజ్యం పోసినట్లు మండిపడ్డాడాయన. మరుక్షణం ఆ పుస్తకాన్ని చించి ముక్కలు చేశాడు.

తండ్రి ఆగ్రహాన్ని విస్తుపోయి చూస్తోందామె.

"ప్రతిమా!" మేఘగర్జనలా వుంది ఆయన స్వరం. "నిజం చెప్పు... రవికీ, నీకూ ఉత్తర ప్రత్యుత్తరాలు ఎన్నాళ్ళనుంచి సాగుతున్నాయి? నీ మొగుడు పోయిన సంగతి వాడికెలా తెలిసింది? పెద్దమనిషిలా పరామర్శకి వచ్చాడు"

"నాకు తెలియదు నాన్నగారూ! మీది కేవలం అపోహ మాత్రమే" ప్రతిమ వణికే స్వరంతో అంది.

"నటించకు. నా కళ్ళు కప్పి ఇద్దరూ పెళ్లి చేసుకుందామని ప్లాన్ వేసే వుంటారు. ఒళ్ళు కొవ్వెక్కి ఏడుస్తున్నావా ఏం? వెధవ ముండవి. నీకు పెళ్ళేమిటి? " రవి రాకకి ఏవేవో కారణాలని ఊహించుకుంటున్న ఆయనకి కన్నకూతురిని ఏం అంటున్నాడో ఒళ్ళు తెలియడంలేదు. కసితీరా ఆమెని తిట్టి నిష్క్రమించాడు.

ఏ ఆధారంతో రవితో తనని కలిపి ఆయన ఇన్ని మాటలంటున్నాడో తెలియని ప్రతిమ అవమానపూరితమైన ఆయన మాటలకి వెక్కివెక్కి ఏడుస్తోంది. పరదాచాటున నిలబడి భర్త అన్న ప్రతీ అక్షరాన్నీ పొల్లుపోకుండా విన్న సుధేష్ణాదేవి ఆయన నిష్క్రమించగానే, కూతురి దగ్గరకి వచ్చి ఓదార్పుగా ఆమెని గుండెలకి హత్తుకుంది.

హరిశ్చంద్ర ప్రతిమని తిట్టడం విన్న మరో వ్యక్తి రామచంద్ర. అతనికి భూమ్యాకాశాలను తలకిందులుగా చూస్తున్న అనుభూతి కలుగుతోంది. ఇన్నాళ్ళూ తండ్రి ధరించిన సంస్కారం అనే ముసుగు తొలగిపోయి ఆయన నిజస్వరూపం బయటపడింది.

అతను ఇది జీర్ణం చేసుకోలేకపోతున్నాడు.

నిండుసభలో జ్వాల నిర్భయంగా ఆయన్ని నిలదీయడం గుర్తుకొస్తోంది.

'వితంతు పునర్వివాహాలను ప్రోత్సహించే శ్రీ హరిశ్చంద్రగారు వితంతువైన తన కూతురికి పునర్వివాహం ఎందుకు చెయ్యలేదు? '

ఆదర్శాలను వల్లించే తండ్రి నోటివెంట చెల్లెల్ని గురించిన దుర్భాషలను విన్న అతనికి ఏమరుపాటుగా వున్నప్పుడు వెనుక నుంచి ఎవరో తలపై కొట్టినట్టుంది.

"వెధవ ముండవి. నీకు పెళ్ళేమిటి? " ఆయన స్వరం వికృతంగా అతని చెవులలో ప్రతిధ్వనిస్తోంది.

తండ్రిలోని మరో వ్యక్తిని చూస్తున్న అతను ఏదో చెయ్యాలనే కసి, ఆవేశం, ఉద్రేకాలతో రగిలిపోతున్నాడు. ఆ రాత్రి అతను తల్లిద్వారా చెల్లెలు రవిని ప్రేమించిన విషయం తెలుసుకున్నాడు.

★ ★ ★

"ఆ కాంట్రాక్టు నాకే రావాలి. మీరు దయ చూపించాలి" అన్నాడు హరిశ్చంద్రప్రసాద్.

"ఈ కాంట్రాక్టే కాదు. ఏ కాంట్రాక్టైనా మీకే కదండీ వచ్చేది. మీరు నిశ్చింతగా వుండండి" అన్నారు ఎం.పి.గారు.

"థాంక్ యూ వెరీమచ్ సార్. మావాడు అమెరికానుంచి తెచ్చాడు. షివాస్ రీగల్. ఓపెన్ చెయ్యమంటారా? " టీపాయ్ మీదున్న బాటిల్‌ని ఓపెన్ చేయబోతూ అడిగాడు.

"విందుతో సరిపెట్టేస్తారా లేక..." అర్థోక్తిలో ఆగి నవ్వారు ఎం.పి.గారు.

"అమ్మమ్మ... ఎంతమాట. ఇంత చక్కని వాతావరణంలో విందు, మందుతోబాటు అతివ పొందు కూడా వుంటే ఇంకా మజాగా వుంటుందని తెలియదా నాకు? వచ్చేస్తూ వుంటుందీపాటికి. మీరు కానివ్వండి" హరిశ్చంద్ర గ్లాసులోకి ద్రవాన్ని నింపి సోడా కలిపి ఐస్ క్యూబ్స్ వేశాడు.

"ఛీర్స్.." ఇద్దరి గ్లాసులూ తాకాయి. ఈ నేపథ్యంలో గెస్ట్‌హౌస్‌లోకి వచ్చాడు రామచంద్ర. ఎవరో ఫ్రెండ్‌కివ్వాలని తండ్రి అడిగితే తనుతెచ్చిన బాటిల్ అది. తండ్రి తాగుతాడని అతనికి తెలియదు. ఉల్లిపాయ పొరలు విడిపోయినట్లు తండ్రిలోని ఒక్కొక్క రంగే బయటపడుతున్నందుకు అతనికి బాధగా వుంది.

"రావోయ్ మాతో జాయినవ్వు" ఎం.పి. గారు అతన్ని చూసి పిలిచారు.

"నమస్కారం సార్!" బలవంతాన ముఖాన నవ్వు పులుముకుని నమస్కరించాడు అక్కడున్న కుర్చీలో కూర్చుంటూ.

"తీసుకో..." తండ్రి తనకి గ్లాసు అందించబోతుంటే తిరస్కరించాడు.

"నాకు అలవాటులేదు నాన్నగారూ!"

"నాకు అలవాటుందా? కంపెనీకోసం తప్పులేదు. తీసుకో"

"నన్ను బలవంతం చెయ్యకండి"

"మీవాడు పేరుకి తగ్గట్టు నిజంగా శ్రీరామచంద్రుడే" నవ్వారు ఎం.పి.గారు.

"ఎక్స్క్యూజ్ మి సార్" అనే పిలుపుతో తలలు తిప్పిచూశారు. ఎదురుగా సదాశివం నిలబడి వున్నాడు.

"సరుకు వచ్చింది సార్" వినయంగా అన్నాడతను.

"సరుకేమిటి? " అర్థంగాక అడిగాడు రామచంద్ర.

ఎం.పి.గారు ఫకాల్న నవ్వారు. "మీ వాడికి బొత్తిగా ప్రపంచాన్ని చూపెట్టలేదేమిటండీ? "

హరిశ్చంద్ర నవ్వుతూ "వాడికెందుకండీ ఇవన్నీ? మనం చెడిపోయాం అది చాలదూ? " అన్నాడు.

"డాక్టర్ సర్టిఫికెట్టు వుందా? " ఎం.పి. గారు సదాశివాన్ని చూస్తూ అడిగారు.

"ఉంది సార్"

"గుడ్‌నైట్ సార్" అన్నాడు హరిశ్చంద్ర. ఎం.పి.గారు బెడ్‌రూమ్‌లోకి నడిచాడు.

'గుడ్‌నైట్'

"ఇందుమతి నీకోసం ఎదురుచూస్తుం టుంది. నువ్వు ఇంటికి వెళ్ళు" అన్నాడా యన కొడుకుతో.

సరుకేమిటో, డాక్టర్ సర్టిఫికెట్ ఎందుకో ఏమీ అర్థంకాని రామచంద్ర తల ఊపి బయటికి వచ్చాడు. కాళ్ళకి తీగ చుట్టుకు న్నట్టు ఆగిపోయాడు ఎదురుగా వున్న యువతిని చూస్తూ.

"మీరు... మిమ్మల్నెక్కడో చూసినట్టుంది" అన్నాడు.

"మన శరణాలయంలోని అమ్మాయే అబ్బాయిగారూ. ఉద్యోగంకోసం వచ్చింది" వంకరగా నవ్వాడు సదాశివం.

"ఉద్యోగంకోసమా?"

"అదే ఎం.పి.గారి రికమండేషన్ లెటర్ కోసం"

రామచంద్ర భ్రుకుటి ముడిపడింది. ఆ యువతి లోపలికి వెళ్ళింది.

డ్రైవరు అతన్ని చూస్తూనే కారు డోర్ తెరిచాడు. అతను ఎక్కాడు.

"ఇంటికేనా అబ్బాయిగారూ?" అడిగాడు డ్రైవర్.

"అవును" అన్నాడు.

'ఎం.పి.గారు ఉద్యోగంకోసం రికమండ్ చేస్తారని ఆయన దగ్గరకి పంపితే ఆయన బుర్ర బద్దలుకొట్టింది' గతంలో సదాశివం జ్వాల గురించి చెప్పిన మాటలు గుర్తుకొ చ్చాయి. 'ఆమె ఎం.పి.గారి బుర్ర ఎందుకు బద్దలుకొట్టి వుంటుంది?' ఆలోచిస్తూ డ్రైవ ర్‌ని పిలిచాడు.

"డ్రైవర్! ఆమధ్య ఒక ఇన్‌స్పెక్టర్‌ని ఎవరో చంపేశారుకదా. అతని ఇల్లు నీకు తెలుసా?"

"తెలుసు సార్! మేం వుండే ఇంటిదగ్గరనే ఆయన ఇల్లు"

"నన్ను ఆ ఇంటికి తీసుకెళ్ళు"

"సరే సార్!" డ్రైవర్ రూటు మార్చి తీసు కెళ్తున్నాడు. రామచంద్రకి ఉద్విగ్నంగా వుంది. 'ఏం చెయ్యబోతున్నాడు తను? తండ్రి ఆధ్వర్యంలో నడుస్తున్న అనాథాశ్ర మంలోని లొసుగులని కూపీ లాగబోతు న్నాడా?'

కారు ఆగింది.

"కుడివైపు కొబ్బరిచెట్లు వున్న ఆ ఇల్లే సార్" చెప్పాడు డ్రైవర్.

అతను కారు దిగి ఆ ఇంటిని సమీపించి బజర్ నొక్కాడు. తను చేస్తున్న పని ఉచి తమా, అనుచితమా అని అతను ఆలోచిం చడం లేదు. జ్వాలనుంచి ఎలాంటి నిజా లను వినవలసి వస్తుందోనని భయపడుతు న్నాడు.

వరండాలో లైటు వెలిగింది. తలుపు తీసిన జ్వాల "ఎవరూ?" అని అడిగింది.

"ఎవరు కావాలి మీకు?"

"నేను రామచంద్రప్రసాద్... హరిశ్చంద్ర ప్రసాద్ గారబ్బాయిని"

"ఓ..." ఆమె కళ్ళు వెడల్పయ్యాయి. ఆశ్చ ర్యమూ, వ్యంగ్యమూ కలగలిపిన భావం ఆమె కళ్ళలో మెదిలింది.

"ఇంత రాత్రివేళ వచ్చారేం? బహుశా రాంగ్ ఎడ్రస్‌కి వచ్చారనుకుంటాను. మీకు కావలసినవాళ్ళెవరూ ఈ ఇంట్లో లేరు" ఆమె తలుపు మూసెయ్యబోయింది.

"జ్వాలగారూ! ప్లీజ్... నేను ఒక నిమిషం మీతో మాట్లాడాలి"

ఆమె ఒక్కక్షణం అతని కళ్ళలోకి చూసి "కూర్చోండి" అంది.

అతను వరండాలో వున్న పేము కుర్చీలో కూర్చున్నాడు.

"నేను ఒకరోజు అనాథాశ్రమంలో కొంత సేపు గడిపి వచ్చాను. మీరన్నట్టుగానే అక్కడ జరిగే అన్యాయాలను నా కళ్ళతో చూశాను"

"గుడ్!" నవ్వింది. "చీకట్లోనుంచి వెలుగు లోకి వచ్చారన్నమాట"

"మీరు ఉద్యోగ ప్రయత్నంలో ఎం.పి.గారి

రికమండేషన్‌కోసం గెస్ట్‌హౌస్‌కి వెళ్ళి ఆయన తల బద్దలుకొట్టి పారిపోయారని చెప్పాడు సదాశివం. ఆరోజు ఏం జరిగింది? "

"ఊహించలేరా? లేక నా నోటితోనే చెప్పించాలనుకుంటున్నారా" అంటూ జ్వాల ఆరోజు జరిగినదంతా చెప్పింది.

వింటున్న రామచంద్ర నెత్తురు మరిగిపోయింది.

కొద్దిసేపటికిందట ఎం.పీ.గారి దగ్గరకి ఉద్యోగం కోసం వచ్చిన అమ్మాయి కళ్ళ ముందు కనిపించింది.

"ఎం.పి.గారి కోరిక తీర్చాలని ముందుగా మీకు తెలియదా? "

"నాకైతే తెలియదు. మిగతావాళ్ళకి తెలుసనుకుంటాను. నేను ఆశ్రమంలో వున్నప్పుడు జయలక్ష్మి అనే అమ్మాయి రేప్‌కి గురయి చనిపోయింది. సుస్మితా సేన్, సిల్క్‌స్మిత తరచుగా రాత్రుళ్ళు బయటకి వెళ్ళి రెండేసి రోజులు ఆశ్రమానికి వచ్చేవారుకాదు"

"సుస్మితాసేన్, సిల్క్‌స్మిత? వాళ్ళు సినిమా యాక్టర్లుకదా? "

"సరోజ, మాధవి అనే అమ్మాయిలు. వాళ్ళలో ఆ సినిమా యాక్టర్ల పోలికలుండడంవలన అందరూ అలాగే పిలిచేవారు"

"అన్యాయం" ఆవేశంతో ఎర్రబడిపోతోందతని ముఖం.

"జరుగుతున్న అన్యాయాన్ని బయటపెట్టాలని సదాశివాన్ని, గెస్ట్‌హౌస్ వాచ్‌మెన్‌ని అరెస్టు చేసి మీ నాన్నగారిని అరెస్టు చేయాలనుకున్న మా బావని హత్య చేయించారు. బావ చనిపోయిన మూడు నెలలకే బెంగతో అత్తయ్య చనిపోయింది. నా ఒంటరి జీవితానికి రమ ఆలంబన అయింది"



"రమ ఎవరు? "

"మీ ఆశ్రమంలోని ఒక అనాథ. నేను ఆమెని పెంచుకుంటున్నాను" బొట్టులేని ఆమె నుదుటిని చూస్తూ అడిగాడు.

"మీ బావతో మీకు పెళ్ళయిందా? "

"లేదు... కానీ మనసా, వాచా బావనే నా భర్తగా ఆరాధించిన నేను అతని మరణంతో వైధవ్యాన్ని కోరి వరించాను"

"ఐ పిటీ యూ" సానుభూతిగా చూస్తూ అన్నాడు.

"మీ సానుభూతిని నేను ఆశించడంలేదు. ఇప్పటికైనా కళ్ళు తెరిచి మీ ఆశ్రమంలో జరిగే అవకతవకలను అడ్డుకోండి. మీ స్వార్థప్రయోజనాల కోసం అనాథలైన ఆడపిల్లలని ఆటబొమ్మలుగా వాడుకుని అంగడి బొమ్మలని చెయ్యకండి"

వెన్నుపోటు తిన్న వ్యక్తిలా వున్నాడతను. తండ్రిలోని మరో వికృతరూపం కళ్ళముందు సాక్షాత్కరిస్తుంటే విహ్వలుడయ్యాడు.

"మీకు జరిగిన అన్యాయానికి క్షమార్పణ కోరుతున్నాను. క్షమ కోరేందుకు కూడా నేను అర్హుడిని కాను. సెలవు... వస్తాను" అతను చేతులు జోడించి వెనుదిరిగాడు.

రామచంద్ర మనసు దెబ్బతిన్న పులిలా గాండ్రుమంటోంది. ఆదర్శాల ముసుగులో అరాచకాలకి, అకృత్యాలకి పాల్పడుతున్న తండ్రిలో ఎలా పరివర్తన తేవాలి?

"రామ్!" తండ్రి పిలుపుతో ఉలిక్కిపడి అటుచూశాడు. పెదవులపై అదే చిరునవ్వు,

అదే ప్రశాంత గంభీరవదనం. కానీ ఆయనలో మరో వ్యక్తి వున్నాడని, డబ్బు సంపాదించడంకోసం, అధికారాన్ని నిలుపుకోవడం కోసం ఎన్ని దారుణాలనైనా చెయ్యగలడని ఎవరికి తెలుసు? తండ్రి ముఖంలోకి చూడ్డానికి ఇష్టంలేనివాడిలా చూపు మరల్చుకున్నాడు.

"చెప్పండి"

"కాలేజీ బిల్డింగ్ కాంట్రాక్టుకి టెండర్ వెయ్యాలి. నువ్వు ఈ రాత్రికే హైదరాబాద్ వెళ్లాలి"

"అలాగేనండి" అతను గదిలోకి వెళ్ళిపోయాడు. తండ్రి ఎడల చిన్నప్పటినుంచీ వున్న ఆరాధనాభావం మటుమాయమై ఆయనపట్ల ద్వేషం కలుగుతున్నందుకు బాధ. ఇదివరకటిలా ఆయన్ని ప్రేమించలేకపోతున్నాననే వేదన.

గదిలో ఇందుమతి సోఫాలో కూర్చుని పుస్తకమేదో చదువుతోంది. రామచంద్ర ఆమె ఒడిలో తల పెట్టుకుని పడుకున్నాడు.

ఆమె పుస్తకాన్ని మూసి పక్కనపెట్టి అతని తలపై చెయ్యివేసింది.

"ఏమిటది పసివాడిలా? "

"మనసులో ఏదో తెలియని అశాంతిగా వుంది ఇందూ"

"ఏమయింది? " లాలనగా అడిగింది.

తండ్రిలోని వికృత రూపాన్ని ఆమెకి తెలియచెప్పాలనుకున్నాడు. కానీ అలా చెప్తే భార్యముందు తండ్రిని చులకన చేసినట్టే కదా?

"ప్రతిమ గురించి బెంగగా వుంది"

"మామయ్యగారితో మాట్లాడతానన్నారుగా? ఆమె పెళ్ళి విషయం ఏమన్నారాయన? "

రామచంద్రకి ఆరోజు తండ్రి చెల్లెల్ని తిట్టిన తిట్లు గుర్తుకొచ్చాయి.

'ఒళ్ళు కొవ్వెక్కి ఏడుస్తున్నావా? వెధవ ముండవి. నీకు పెళ్ళేమిటి? '



అతను కోపంతో పళ్ళు కొరకసాగాడు. ఆగ్రహావేశాలను అదుపులో వుంచుకోడానికి అతను చాలా కష్టపడవలసి వచ్చింది.

'హైదరాబాద్ వెళ్ళాక రవిని కలుసుకోవాల'ని నిశ్చయించుకున్నాడు. పైకిమాత్రం "ప్రతిమ పెళ్ళి బాధ్యతను నాన్నగారు నాపై పెట్టారు" అన్నాడు.

"మరింకేం? మంచి అబ్బాయిని చూడండి"

"హైదరాబాద్‌లో తెలిసినవాళ్ళ అబ్బాయి వున్నాడు. మన ప్రతిమకి ఈడూజోడూ. అతన్ని అడుగుతాను. అన్నట్టు ఇందూ, నేనీ రాత్రికే హైదరాబాద్ వెళ్లాలి"

"మళ్ళీ ఎప్పుడొస్తారు? "

"ఎల్లుండి రాత్రికి బయలుదేరుతాను"

"సరే"

"ప్రతిమకి నేను పెళ్ళి సంబంధాన్ని చూస్తున్నట్టు ఎవరికీ చెప్పకు. ముఖ్యంగా నాన్నగారికి తెలియకూడదు. సంబంధం నిశ్చయమయ్యాక ఒకేసారి ఆయన్ని సర్ప్రైజ్ చేస్తాను"

"అలాగే చెప్పనులెండి" నవ్వింది.

★ ★ ★

"దాన్ని ఈ ఇంటికెలా దూరం చెయ్యాలో నాకు తెలుసు" భర్త మాటలు గుర్తుకొస్తున్న సుధేష్ణాదేవి మనసులో ఏదో అలజడి. ఏదో జరగబోతోందని ఆవిడ సిక్స్త్ సెన్స్ హెచ్చరిస్తోంది.

ఆవిడ కోడలి గదిలోకి వచ్చింది.

"రండత్తయ్యా" ఇందుమతి లేచి నిలబడి చిరునవ్వుతో ఆహ్వానించింది.

"అబ్బాయి ఊళ్ళో లేడుకదా. ఒక్కర్తివీ ఇక్కడెందుకు పడుకోడం? నా గదిలోకి రామ్మా"

"ఫర్వాలేదత్తయ్యా. నాకు అలవాటే" మొహమాటంగా అంది.

"ఒక్కదానివీ పడుకోడానికి నీకు భయం లేకపోయినా నాకు భయం వేస్తోంది రామ్మా"

ఇందుమతి మరి తర్కించకుండా గది

తలుపు లాక్‌చేసి అత్తగారి వెంట గదిలోకి వచ్చింది.

ఇద్దరూ పక్క సర్దుకుని నిద్రకి ఉపక్రమించబోతుండగా తలుపు తట్టిన శబ్దమయింది. ఇందుమతి లేచి కూర్చుంది. సుధేష్ణాదేవి వెళ్ళి తలుపు తీసింది.

ఎదురుగా నిలబడి వున్న భర్తని చూడగానే ఆవిడ భ్రుకుటి ముడిపడింది. ఆయన గదిలోకి వచ్చాడు.

మామగారిని చూసి ఇందుమతి చప్పున మంచంమీంచి లేచి నిలబడింది.

"నువ్విక్కడ పడుకుందామని వచ్చావా? మీ ఆయన ఊళ్ళో లేడని ఒక్కర్తివీ వుండడానికి భయమేస్తోందా? " చిరునవ్వుతో అడిగాడు.

"కాదండీ... అత్తయ్యగారు నన్నిక్కడ పడుకోమన్నారు"

"ఓ... మీ అత్తగారు భయపడుతోందా? నా గదిలో ఏసీ పని చెయ్యడంలేదని నేనిక్కడ పడుకుందామని వచ్చానే! ఎలా మరి? "

"నేను నా గదిలో పడుకుంటానండి"

"ఒక్కదానివీ పడుకోడానికి భయమైతే పనిపిల్లని సాయం పడుకోమను"

"ఫర్వాలేదు మామయ్యగారూ" ఇందుమతి తిరిగి తన గదిలోకి వెళ్ళింది.

హరిశ్చంద్ర భార్యని చూసి నవ్వేడు. "తలుపు మూసి వచ్చి పడుకో. చాలా రాత్రయింది"

ఆవిడ ముఖంలోని అయిష్టతని చూస్తూ మళ్ళీ ఆయనే అన్నాడు.

"నేను ఈ గదిలో పడుకుంటానన్నది అందుకోసం కాదులే! నిజంగానే నా గదిలో ఎ.సి. పని చెయ్యడంలేదు"

"నేను ఇందుమతి దగ్గర పడుకుంటాను" ఆవిడ వెళ్ళబోయింది.

"నువ్వక్కడ నేనిక్కడ పడుకుంటే మనిద్దరి మధ్య ఏదో గొడవ జరిగిందనుకుంటుంది ఆ పిల్ల. నా నుంచి నీకే ప్రమాదం ఎదురవదని హామీ ఇస్తున్నాను పడుకో"

ఆయన మంచం మీద గోడవైపు తిరిగి పడుకున్నాడు.

సుధేష్ణాదేవి కార్పెట్ మీద తలగడ వేసుకుని పడుకుంది. కాని నిద్ర రావడంలేదావిడకి. అసహజమైన భర్త ప్రవర్తనని గురించి ఆవిడ ఆలోచిస్తోంది.

★ ★ ★

"నా పేరు రామచంద్ర ప్రసాద్. ప్రతిమ అన్నయ్యని" ఎందుకో హరిశ్చంద్రగారబ్బాయని చెప్పుకోడం నచ్చలేదతనికి.

"నమస్కారం. రండి కూర్చోండి" అన్నాడు రవి లేచి నిలబడుతూ.

"మీరు ప్రతిమని పెళ్ళి చేసుకుంటారా? " సూటిగా అడిగాడతను.

రవి ఎంతగా షాకయ్యాడంటే అప్రయత్నంగానే లేచి నిలబడ్డాడు.

"కూర్చోండి. ఎందుకలా కంగారు పడుతున్నారు? " రామచంద్ర చిరునవ్వుతో అతని భుజాల మీద చేతులువేసి అతన్ని కూర్చునేలా చేశాడు.

"నేను కొంచెం సూటిగా మాట్లాడానను కుంటాను" క్షణం ఆగి అన్నాడు "వున్నట్టుండి అలా అడిగితే మీరే కాదు ఎవరైనా కంగారుపడతారు. ప్రతిమ మిమ్మల్ని ప్రేమించిందని మా అమ్మగారు చెప్పారు. మా నాన్నగారు ఆమె నిర్ణయాన్ని వ్యతిరేకించి ఆమెకి మరో పెళ్ళి చేశారు. దురదృష్టవశాత్తూ ఆమె భర్త పెళ్ళయిన మూడవ రోజునే చనిపోయాడు. ఆ విషయం మీకు తెలిసినదేకదా? మీకు ప్రతిమ అంటే ఇష్టమేనా? మీరామెని పెళ్ళి చేసుకుంటారా? "

'ప్రతిమ మిమ్మల్ని ప్రేమించింది' అనే అతని మాటలపైనే కేంద్రీకృతమయింది రవి మనసు.

'రాజకుమార్తెలాంటి ఒక అమ్మాయి మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చి నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నానంటే ఏం

చేస్తారు?' ఆమెని చివరిసారిగా తను కలుసుకున్నప్పుడు ఆమె చిలిపిగా అడగడం గుర్తుకొచ్చింది.

"రాజకుమార్తె లాంటి ఆమె ఎక్కడ? నేనెక్కడ? నేనామెకి ఏవిధంగా చూసినా తగను"

"నా చెల్లెల్ని పెళ్లి చేసుకోడానికి మీరే తగిన వ్యక్తి అని నా అభిప్రాయం. ప్రతిమ ఇప్పటికీ మిమ్మల్నే ప్రేమిస్తోంది"

"మా పెళ్లికి మీ నాన్నగారు ఇష్టపడతారనే అనుకుంటున్నారా?"

"మా నాన్నగారు ఇష్టపడినా పడకపోయినా నా అండదండలు మీకెప్పుడూ వుంటాయి. ఇంతకీ మీరు నా ప్రపోజల్‌కి మీ అంగీకారాన్ని కాని, తిరస్కారాన్ని కాని తెలియచెయ్యలేదు"

"ప్రతిమని నా జీవితంలోకి సంతోషంగా ఆహ్వానిస్తాను. ఆమెను పూలబాట మీద నడిపిస్తానని వాగ్దానమివ్వలేను కాని నన్ను పెళ్లి చేసుకున్నందుకు ఆమె ఎప్పటికీ పశ్చాత్తాపపడదని మాత్రం మాట ఇస్తున్నాను"

రామచంద్ర ముఖం విప్పారింది. "థాంక్ యూ రవీ! నా చెల్లెలు కోరుకున్న మీతో ఆమె పెళ్లి జరిపించి ఆమె కళ్లలో వెన్నెలని చూడాలనే నా ఆశ నెరవేరబోతున్నందుకు ఆనందంగా వుంది" అన్నాడు.

★ ★ ★

సుధేష్ణాదేవికి హఠాత్తుగా మెలకువ వచ్చింది. సహజమైన మెలకువ కాదు. పీడకల కన్నప్పుడు కలిగే మెలకువ. ఆవిడ లేచి కూర్చుని చుట్టూ చూసింది. గదిలో బెడ్‌లైటు వెలుతురు మందంగా పరచుకుని వుంది. ఆ వెలుతురులో ఆమె మంచంమీద నిద్రపోతున్న భర్తకోసం చూసింది. మంచం మీద ఆయన లేడు. క్రిందటి రాత్రి ఇందుమతిని ఆమె గదిలోకి పంపి తన గదిలో పడుకున్న ఆయన ఈ రాత్రి కూడా తన గదిలోనే పడుకున్నాడు. ఆయన తన జోలికి రాకుండా నిశ్శబ్దంగా పడుకోడం ఆమెకి ఆశ్చర్యం కలిగించింది. ఇప్పుడాయన గదిలో లేకపోవడంతో ఆవిడకేదో తెలియని భయాన్ని కలిగించింది. ఆవిడ గది తలుపు తెరవబోయింది. అది తెరుచుకోలేదు. తలుపులని బయట లాక్ చేశారని అర్థమయిందామెకి. ఏ ప్రయోజనాన్ని ఆశించి తనని గదిలో బంధించాడాయన? ఆవిడ ఆలోచిస్తూ వరండావైపు వున్న కిటికీ దగ్గర నిలబడి బయటకి చూడసాగింది.

★ ★ ★

"ఇందుమతీ! అమ్మా ఇందుమతీ" ఎవరిదో పిలుపుతో బాటు తలుపు తట్టిన శబ్దం.

గాఢనిద్రలో వున్న ఆమెకి మెలకువ వచ్చింది. నిద్రలో చెదిరిన దుస్తులని సరిచేసుకుని లైటువేసి వెళ్లి తలుపు తెరిచింది. ఎదురుగా హరిశ్చంద్ర నిలబడి వున్నాడు. ఆమె టైము చూసింది. రాత్రి ఒంటిగంట కావస్తోంది. అంత రాత్రివేళ తన గదికి వచ్చి తనని పిలుస్తున్న మామగారిని ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది.

"ఏం కావాలి మామయ్యా?"

"చాలా సేపటినుంచి తలనొప్పిగా వుందమ్మా! వేడిగా ఒక కప్పు కాఫీ తాగి, టాబ్లెట్ వేసుకుంటే తప్ప తగ్గేలా లేదు. మీ అత్తయ్య నిద్ర మాత్ర వేసుకుని పడుకుంది కాబోలు ఎంతలేపినా లేవడం లేదు. నిన్ను లేపక తప్పలేదు. కొంచెం కాఫీ ఇస్తావా?"

"అదెంత పని మామయ్యగారూ! అయిదు నిముషాలలో కాఫీ ఇస్తాను" ఆమె గబగబా కిందకి వచ్చింది. డైనింగ్ రూమ్‌లో వున్న ఫ్రిజ్‌లో నుంచి పాలగిన్నె తీసుకుని మూసి వున్న వంటగది తలుపులని తీసి గదిలోకి అడుగు పెట్టింది.

గ్యాస్ వాసన ముక్కుపుటాలకి సోకింది. 'గ్యాస్ వాసన వస్తోందేమిటి? వంట మనిషి రాత్రి రెగ్యులేటర్ ఆఫ్ చెయ్యక లీకయివుంటుందా?' అనుకుంటూ లైటు స్విచ్ ఆన్ చేసింది. అదే ఆమె చేసిన

పొరపాటు.

★ ★ ★

ఆ ఇంట్లో విషాదం ఘనీభవించింది. అక్కడున్న అందరి కళ్లలో నీళ్లు.

హాలు మధ్యగా ఇందుమతి మృతదేహం పడుకోబెట్టబడివుంది. ఆమె శరీరం నల్లగా కమిలిపోయిన వంకాయలా వుంది. అక్కడ చేరిన జనం తమలో తాము మెల్లిగా చెప్పు కుంటున్నారు.

"గ్యాస్ లీకయి అంటుకుందిట"

"ఎంత ఘోరం! పెళ్లయిన నాలుగు నెల లైనా కానిదే",

"ముహూర్తబలం అలాంటిది. పెళ్లయిన మూడో రోజున అల్లుడు, ఇప్పుడు కోడలు"

వదిన పంచిన ప్రేమానురాగాలని తలచు కుంటూ ప్రతిమ గుండెలు బద్దలయ్యేలా రోదిస్తోంది. భార్య శవం పక్కన కూర్చున్న రామచంద్ర చేతులలో ముఖం దాచుకుని కుమిలిపోతున్నాడు.

కొడుకుని మించి ఏడుస్తున్నాడు హరి శ్చంద్ర. "ఇందుమతి నా కోడలుకాదు కూతు రయ్యా! ఆమెతోబాటు ఈ ఇంటి కళ కూడా పోయింది" అని పరామర్శించడానికి వచ్చిన వాళ్లందరి చేతులు పట్టుకుని ఏడుస్తున్నాడు. ఆయన దుఃఖం చూసిన ఎంతటి కఠినాత్ము లైనా కన్నీళ్లు పెట్టకమానరు.

సుధేష్ణాదేవి కళ్లలో మాత్రం నీళ్లు లేవు. ఆవిడ కళ్లలో అగ్నికీలలు ప్రజ్వరిల్లుతు న్నాయి.

★ ★ ★

కూతురి మరణవార్తను విని అమెరికా నుంచి వచ్చిన వాసుదేవరావు ఆ రోజు ప్రయాణమవుతున్నాడు.

"రామ్! నేను వస్తాను. అహ వెళ్తాను" రామచంద్ర భుజంపై చెయ్యివేస్తూ పిలి చాడు. అతను తల ఎత్తి మామగారి వైపు చూశాడు. ఎప్పుడూ నవ్వుతూ చలాకీగా వుండే వాసుదేవరావు గంభీరంగా మారిపో యాడు. ఆ కళ్లలో అనంతమైన శూన్యం. పూడ్చలేని వెలితి. ఈ పదిరోజులలోను హఠాత్తుగా పది సంవత్సరాలు పెద్దవాడయి నట్టున్నాడు.

రామచంద్ర తన భుజంపై వున్న ఆయన చేతిని పట్టుకుని బావురుమన్నాడు.

"రామ్! కంట్రోల్ యువర్ సెల్ఫ్! ఇందుకి ఆయుర్దాయంలేదు. ప్రాణంగా ప్రేమించే భర్తని, తల్లిదండ్రుల ప్రేమని మరిపించే అత్తమామలని పొందిన అదృష్ట వంతురాలు. స్వల్పకాలంలోనే మీ అందరికీ దూరమైన దురదృష్టవంతురాలు"

రామచంద్ర బలవంతాన దుఃఖాన్ని నిగ్ర హించుకున్నాడు.

"అయ్యగారు మిమ్మల్ని రమ్మంటున్నారు" పనివాడు వచ్చి చెప్పాడు. వాసుదేవరావు హరిశ్చంద్ర గదిలోకి వెళ్లాడు. మామగారిని అనుసరించి వెళ్లిన రామచంద్ర గది బయట నిలబడిపోయాడు.

హరిశ్చంద్ర వాసుదేవరావుకి ఒక బ్రీఫ్‌కే సుని అందిస్తూ అన్నాడు.

"మీ అమ్మాయి పెళ్లి సందర్భంలో మీరి చ్చిన కట్నం, నగలు ఇందులో వున్నాయి"

"నా కూతురే లేకపోయాక వీటితో నాకేం పని? " వాసుదేవరావు స్వరం గాద్గదికంగా వుంది. "వాటిని మీ అనాథాశ్రమానికి ఇందుమతి పేరు మీద విరాళంగా ఇవ్వండి' ' ఆయన చరచరా బయటికి వచ్చి బయట తనకోసం ఆగి వున్న కారులో కూర్చు న్నాడు.

యాదృచ్ఛికంగా ఆ సంభాషణను విన్న రామచంద్ర నెత్తురు మరిగిపోయింది. 'తండ్రి తన పెళ్లి సందర్భంలో కట్నం పుచ్చుకున్నాడన్నమాట' తండ్రి అతని దృష్టిలో మరింత దిగజారిపోయాడు.

★ ★ ★

ఇందుమతి చనిపోయి మూడు నెలలు. తనకి మళ్లీ పెళ్లి ప్రయత్నాలు చేస్తున్న తండ్రిని ఆశ్చర్యంగా, బాధగా చూశాడు రామచంద్ర.

"ఇందుమతిని మరచిపోవడం నాకీ జన్మకి సాధ్యపడదు. ఇంక ఈ జన్మలో పెళ్లి ప్రసక్తి లేదు"

"నీ భార్య మరణించడం దురదృష్టమే. ఒక వ్యక్తి నిష్క్రమణతో జీవితం ఆగిపోకూడదు. అయినా నీ వయసెంతని? ఈ వయసులో ఇంత వైరాగ్యమేమిటి? ఇందుమతిని మరిపించే మరో మంచి అమ్మాయితో నీ జీవితం ముడిపడితే" ఇంకా ఏదో అనబోతున్న తండ్రితో అన్నాడు.

"నా పెళ్లి మాటకేం? ప్రతిమ పెళ్లి సంగతేం చేశారు? "

"అది అంత సులువేమీ కాదు. వితంతువుని పెళ్లి చేసుకోడానికి ఎవరు ముందుకొస్తారు"

రామచంద్ర పెదవి బిగపట్టాడు. అతని చెవుల్లో ఒకప్పుడు "వెధవ ముండవి, నీకు పెళ్లేమిటి? " అని చెల్లెల్ని దూషించిన తండ్రి మాటలు మార్మోగాయి. వితంతువైన ప్రతిమకి పెళ్లి చేసే ఉద్దేశంలేని తండ్రి ఎంత నాజూగ్గా తప్పించుకుంటున్నాడు?

"సరే! మీ ఇష్టప్రకారమే నేను పెళ్లి చేసుకుంటాను. కాని నాకు కొంచెం టైము కావాలి"

"అలాగే? నీకు కావలసినంత టైము తీసుకో. కాని ఈసారి నీ పెళ్లి నిర్ణయించే బాధ్యతను మాత్రం నాకు వదిలిపెట్టు"

"అలాగే నాన్నగారూ!"

★ ★ ★

"మీరు నన్ను పెళ్లి చేసుకుంటారా? " రామచంద్ర ప్రశ్నతో ఉలిక్కిపడింది జ్వాల. క్షణకాలం నిరుత్తరంగా అతన్నే చూస్తుండిపోయిన ఆమె ఒక క్షణం తర్వాత తేరుకుని అంది.

"ఈ జన్మలో పెళ్లి ప్రసక్తిలేదు. బావతో పెళ్లి కోసం కలలు కన్న నేను మరెవరికీ నా జీవితంలో స్థానం ఇవ్వలేను. మూడు ముళ్ల బంధానికి మించిన మానసిక బంధం మాది. అతన్ని మరచిపోయి మళ్లీ పెళ్లి చేసుకోలేను"

"నేను కూడా ఇందుమతిని ప్రేమించే పెళ్లి చేసుకున్నాను. ఆమె మరణించినా ఆమె జ్ఞాపకాలు సజీవంగా నా మనసులో నిలిచే వున్నాయి. మిమ్మల్ని పెళ్లి చేసుకుంటానంటున్నది ఆమెను మరచిపోయి కాదు. ఒకసారి మీరు మా నాన్నగారి గురించి ఏమన్నారో గుర్తుందా? అవినీతి, అబద్ధం, అక్రమం రూపు దాలిస్తే అది హరిశ్చంద్ర అన్నారు. నేను ఆయనకి ఎదురు తిరగాలనుకుంటున్నాను. ఆయనలోని అవినీతిని అరికట్టాలనుకుంటున్నాను. అందుకు నాకు ఒక తోడు అవసరం. మీరు నాకు తోడుగా వుంటే తప్ప అది సాధ్యపడదు. మీలోని సాహసాన్ని, ధైర్యాన్ని, ఆవేశాన్ని ఆయుధాలుగా చేసుకుని మిమ్మల్ని నా సైన్యంగా చేసుకుని నా పోరాటాన్ని ప్రారంభించాలనుకుంటున్నాను"

"ఆ ప్రయత్నంలో నేను ఒకసారి ఘోరంగా ఓడిపోయాను. జీవితంలో మళ్లీ కోలుకోలేని చావు దెబ్బ తిన్నాను. నేనేమైనా ఫర్వాలేదు. కాని నాపై ఆధారపడి బతుకుతున్న రమ వుంది. ఆమె కోసమైనా నేను వీటన్నింటికీ దూరం కావాలి. ఎవరెలా పోతే నాకేం? ఈ సమాజంలో నేనూ ఒక మనిషిని. నిస్సహాయురాలైన ప్రేక్షకురాలిని"

"అలా ఎవరికి వారు అనుకుని చేతులు ముడుచుకుని కూర్చుంటే సమాజం మరింత కుళ్లిపోతుంది. దయవుంచి నా అభ్యర్థనని మన్నించండి. నా భార్యగా మీకు మా ఇంట్లోనే కాదు అనాథాశ్రమంపై కూడా సర్వాధికారాలూ వుంటాయి. ఆశ్రమంలో జరిగే అన్యాయాలను మీరైతేనే సమర్థవంతంగా అరికట్ట గలరనే నమ్మకం నాకు వుంది"

క్షణం అతని కళ్లలోకి చూసిన జ్వాల "సరే" అంది.

★ ★ ★

మెడలో పూలదండలతో ఒకరి చేయి మరొకరు పట్టుకుని లోపలకి వస్తున్న ప్రతిమ- రవి, జ్వాల- రామచంద్రలను చూస్తూనే హరిశ్చంద్ర నిటారుగా అయ్యాడు.

రవి నిర్భయంగా, ప్రశాంతంగా ఆయన్ని చూస్తుంటే ప్రతిమ మాత్రం తండ్రి చూపులని ఎదుర్కోలేక తలవంచుకుంది. ఆ ఇద్దరినీ ఆగ్రహంగా, వాడిగా, తీక్షణంగా చూస్తూ అడిగాడాయన.

"పూటకి గతిలేని ఈ దరిద్రుడిని పెళ్లి చేసుకుని సుఖపడగలననే అనుకుంటున్నావా? నీ అందంపై మోజు తీర్చుకుని నీ దగ్గరున్న నగలు, డబ్బు కాజేసి ఎలాగా పారిపోతాడు వీడు. అప్పుడు నీ బతుకు కేరాఫ్ ప్లాట్ ఫారమవుతుంది"



సంస్కారమనే ముసుగు పూర్తిగా తొలగిపోయి తండ్రి నిజస్వరూపం అర్థమయ్యాక ప్రతిమ ఆ క్షణం ఆగ్రహంతో, అసహ్యంతో వణికిపోయింది. తల ఎత్తి ఒకసారి ఆయన్ని చూసి చరచరా గదిలోకి వెళ్లి కొన్ని కాగితాలను తెచ్చి ఆయన చేతిలో పెట్టింది.

"ఇవి విష్ణువర్ధన్‌తో నా పెళ్లప్పుడు మీరు నాకు పసుపు కుంకుమలుగా రాసి ఇచ్చిన ఆస్తిపత్రాలు. నా నగలన్నీ బీరువాలో భద్రంగా వున్నాయి. పుట్టింటి నుంచి నేనేమీ పట్టుకెళ్లడంలేదు. నా ఒంటిమీద వున్న ఈ చీర కూడా రవి కొని ఇచ్చినదే. రవి సాహచర్యంలో నా జీవితానికి భద్రత కలుగుతుందనే నమ్మకం నాకు వుంది. ఆ నమ్మకం ఎప్పటికీ వమ్ముకాదు" అని దూరంగా నిలబడి తనని కళ్ల నిండుగా చూసుకుంటున్న తల్లి దగ్గరకి రవితో వెళ్లి ఆవిడ పాదాలకి నమస్కరించింది.

"పదండి వెళ్దాం" అని రవి చేతిని అందుకుంది. ఆమె ననుసరించాడు రవి.

ఆమె అడుగులు స్థిరంగా పడుతున్నాయి. రవిపై నమ్మకం తన నిర్ణయంపై నమ్మకం. భవిష్యత్తుపై నమ్మకం.

హరిశ్చంద్ర షాక్ తిన్నట్టు చూస్తున్నాడు. కూతురిలోని తెగింపుకి, ఆమె ధైర్యానికి వాళ్లు వెళ్తున్న వైపు చూస్తున్న ఆయన కళ్లలో ఎర్రజీరలు.

ఆయన ఆ స్థితిలో వుండగానే జ్వాల, రామచంద్ర వచ్చి ఆయన పాదాలకి నమస్కరించారు.

"ఒరేయ్! నువ్వు పెళ్లి చేసుకోడానికి ఇది... ఈ నీతిమాలినది తప్ప దొరక లేదా? మన గెస్ట్‌హవుస్‌కి ఎమ్.పిగారితో ఒక రాత్రి గడపడానికి వచ్చిందిరా ఇది" జ్వాలవైపు ఏహ్యంగా, తిరస్కారంగా చూస్తూ అన్నాడాయన.

"నాకు అంతా తెలుసు నాన్నగారూ! కాని ఒక విషయం గుర్తుంచుకోండి. ఈమె ఈ ఇంటికోడలు. నా భార్య. మీకు ఇష్టం వున్నా లేకపోయినా ఆమెని గౌరవించి తీరాలి"

కొడుకు జవాబుతో హరిశ్చంద్రకి వాగ్బంధనమై నిలువు గుడ్లు పడ్డాయి.

జ్వాలతో హుందాగా లోపలకి నడిచాడు రామచంద్ర.

"నన్ను అరెస్టు చేసిన ఇన్‌స్పెక్టర్ విజయ్‌ని చంపించారు అయ్యగారు. తన ఉనికికే ప్రమాదం కలిగించిన ఆ కుర్ర నా

కొడుకు అడ్డు తొలగించుకోగలిగారు. కాని వాడి మరదలు జ్వాల మాత్రం ఇన్నాళ్లూ నిశ్శబ్దంగా వూరుకుని ఇప్పుడు బాంబు పేల్చింది. అబ్బాయిగారికి మత్తుమందే పెట్టిందో లేక తన అందంతో వలవేసిందో ఆయన్ని పెళ్లి చేసుకుని ఆ ఇంటికి యజమానురాలయి కూర్చుంది. తంతే బూర్ల గంపలో పడ్డట్టు అయింది దాని పని" వార్డెన్‌తో చెబుతున్నాడు సదాశివం.

"నిన్ను తంతే ఎక్కడ పడతావో తెలుసా సదాశివం! ముందు గేటు అవతల. తర్వాత జైల్లో"

ఆ స్వరం వినవచ్చిన దిక్కుగా తలలు తిప్పి చూసిన అతను, వార్డెన్ ఖంగు తిన్నారు.

అక్కడ రామచంద్ర, జ్వాల నిలబడివున్నారు.

"నమస్కారం అబ్బాయిగారూ! నమస్తే అమ్మా" ఆ ఇద్దరి స్వరాలలో కంగారు, తొట్రుపాటు.

ప్రతి నమస్కారం చెయ్యకుండానే అన్నాడు, "ఎకౌంటు బుక్స్ బయటకి తియ్యి"

"నేను ఆశ్రమం అంతా తిరిగొస్తానండీ" అంది జ్వాల.

"వెళ్ళిరా" అన్నాడు చిరునవ్వుతో.

"రండి మేడమ్ నేను తీసుకెళ్తాను" అంది వార్డెన్. ఆమె స్వరంలో దాగని వ్యంగ్యాన్ని జ్వాల కనిపెట్టకపోలేదు.

"నాకు ఆశ్రమం కొత్త కాదు. నేను వెళ్ళగలను" హుందాగా ముందుకి నడిచింది.

ఎకౌంటు బుక్స్ రామచంద్ర ముందు పెట్టి ప్రార్థనకి వేళ కావడంతో సదాశివం ప్రేయర్ హాలుకి వెళ్ళాడు.

ప్రార్థన మొదలయింది.

"ఓ దయామయుడైన భగవంతుడా! తల్లి ఎవరో తండ్రి ఎవరో తెలియని మాకు కన్నవాళ్ళ ప్రేమని మరిపించే అయ్యగారిని ఇచ్చావు. వటవృక్షంలాంటి ఆయన నీడలో మా జీవితాలు సుఖంగా సాగిపోనియ్యి. మాకు తిండి, బట్ట, చదువు ఇచ్చే రాజాగారు సాక్షాత్తు నీ ప్రతిరూపంగా భావించి ఆయన చెప్పినట్టల్లా..."

"ఆపండి" బిగ్గరగా శాసిస్తున్నట్టుగా ఆ స్వరం వినిపించిన వైపు చూశారు అందరూ ప్రార్థన ఆపి. అక్కడ జ్వాల నిలబడివుంది.

"హరిశ్చంద్రప్రసాద్‌గారు మీరనుకుంటున్నట్టు భగవంతుడి ప్రతిరూపం కాదు. ఒక మామూలు మనిషి. మీకు తిండి, బట్ట ఇచ్చినంత మాత్రాన ఆయన్ని దేముడని పూజించడం అర్థం లేనిపని. ఈ సకల చరాచర ప్రపంచాన్ని సృష్టించిన భగవంతుడిని పూజించండి. హరిశ్చంద్రగారిని కాదు. మిస్టర్ సదాశివం! ఈరోజునుంచి మీరు ఆశ్రమవాసులచేత ప్రార్థన చేయించనవసరంలేదు. ఎవరి మతాలకి సంబంధించిన ప్రార్థనని వాళ్ళే చేసుకుంటారు"

సదాశివం పళ్ళు కొరుక్కుంటూ నేల చూపులు చూస్తున్నాడు.

"నేను చెప్పినది మీకు అర్థమయిందనుకుంటాను"

"అర్థమయింది మేడమ్"

"అర్థమయ్యాక కూడా మీరు ప్రేయర్ హాలులో నిలబడడం అవసరమా? "

మరుక్షణం సదాశివం బయట నిలబడ్డాడు. అక్కడి జనం ముఖాలలో రిలీఫ్.

"ప్రార్థన కానిచ్చి మీ పనులు చేసుకోండి" జ్వాల బయటకి వచ్చింది.

ఆరోజే ఆశ్రమంలోని పాత పద్ధతులకి స్వస్తి చెప్పింది. అందరికీ ఒకే భోజనం. వృద్ధులు మినహా అందరూ పనిచెయ్యాలి. స్పెషల్ క్వార్టర్సులోని అమ్మాయిలని అందరితోబాటు కామన్ హాలులో కలిసివుండాలని శాసించింది.

సదాశివానికి గుటక పడడంలేదు. "మేడమ్! అందరికీ ఒకే భోజనం అంటే ఖర్చు ఎంతవుతుందో ఆలోచించారా? " వినయాన్ని ప్రదర్శిస్తూ అడిగినా, అతని

స్వరంలో వ్యంగ్యం ధ్వనిస్తూనే వుంది.

"వారానికి ఒకసారి మటన్ లేదా చికెన్, ఒకసారి గుడ్లు కొనండి మిగతా రోజులలో ఆకుకూరలు, కాయకూరలు కొనండి. పెరుగు చిలికి మజ్జిగ చేస్తే అందరికీ సరి పోతుంది"

"అలాగే మేడమ్" సదాశివం వినయంగా అన్నాడు.

"నేను ఇవాళనుంచి రెండు పూటలా ఇక్కడే భోజనం చేస్తాను"

"తప్పకుండా చెయ్యండి మేడమ్!" అతనికి పచ్చి వెలక్కాయ గొంతులో ఇరుక్కున్నట్ట యింది. భోజనం విషయంలో పక్షపాతం జరగకుండా వుండడానికే ఆమె అక్కడ భోజనం చేస్తానంటోందని అతనికి తెలుసు.

తమ నివాసం స్పెషల్ క్వార్టర్సులోనుంచి కామన్ హాలులోకి మారడం అక్కడ వుండే కొందరు అమ్మాయిలకి నచ్చలేదు. పైగా పనిచెయ్యాలనే శాసనం వాళ్ళకి మింగుడు పడలేదు. అప్పటికప్పుడు మూట, ముల్లె సర్దుకుని బయలుదేరారు. వాళ్లలో సిల్క్ స్మిత ప్రథమురాలు.

"బయటికి వెళ్ళి ఏం చేస్తారు? ఎలా బతుకుతారు? " ఆశ్చర్యంగా అడిగింది జ్వాల.

"ఇక్కడ చేసే ఉద్యోగమే అక్కడా చేస్తాం" అంది సిల్క్‌స్మిత వెకిలిగా నవ్వుతూ.

"మీ జీవితాలకి ఒకదారి చూపించాలని నా తాపత్రయం. త్వరలో ఫినాయిల్ తయారీ, కొవ్వొత్తుల తయారీలో శిక్షణ ఇవ్వడానికి శిక్షణ బృందాన్ని ఇక్కడకి తీసు కొస్తున్నాం. మీరు బయటకి వెళ్ళాక ఫినా యిలు, కొవ్వొత్తులు తయారుచేసే కుటీర పరిశ్రమ ప్రారంభించవచ్చు అందుకు అవ సరమైన మూలధనాన్ని మేమే సమకూ రుస్తాం. బయట మీరు గౌరవంగా స్వతం త్రంగా బతకవచ్చు"

ఆ మాటలు వాళ్ళ చెవికెక్కలేదు. వెళ్ళి పోయారు. సుస్మితాసేన్ నలుగురైదుగురు అమ్మాయిలతో కలిసి తోటపనిలో నిమగ్న మవడం గమనించింది జ్వాల.

★ ★ ★

రాత్రి ఎనిమిది గంటలవేళ. ఆఫీసు రూమ్ తలుపు తాళంపెట్టి ఇంటికి బయలు దేరబోతున్న సదాశివం మెట్లమీద నిలబడి వున్న సుస్మితాసేన్‌ని చూసి ఆగిపోయాడు.

"ఏం కావాలి? "

"మీరే కావాలి" మత్తుగా ఒళ్లు విరుచు కుంది.

"నేనా? నాతో ఏంపని నీకు? "

"మగవాడి స్పర్శ కోసం అలమటించిపో తున్నాను. ఇదివరకటిలా మమ్మల్ని బయ టకి పంపడానికి మీకేమో భయం. జ్వాల బోడిరూల్స్ పెట్టిందిగా? ఆవిడకేం? యజ మాని కొడుకుని పెళ్ళిచేసుకుని సుఖంగానే వుంది. అలవాటు పడ్డ ప్రాణం. నాకెవరు న్నారు? అందుకని"

"ఊఁ! అందుకని"

"మీరు నాకు కావాలి!"

ఆమెనుంచి ఆ ప్రపోజల్ రావడంతో దిమ్మెరపోయాడతను.

"నేను మీకు నచ్చలేదా? అయినా పసి మొగ్గలలో మీకేం మకరందం దొరుకుతుం దని వాళ్ళకోసం వెంపర్లాడతారు? నాకున్న పొంకం, ఒంపుసొంపులు వాళ్ళకేం వుంటాయి? " జారిన పైటని పట్టించుకో కుండా నిర్లక్ష్యంగా నిలబడి అంది.

సదాశివానికి ఆమెని చూస్తే గుటక దిగ డంలేదు. స్పెషల్ క్వార్టర్సులోని అమ్మాయి లని కన్నెత్తి కూడా చూడ్డానికి వీల్లేదనే హరి శ్చంద్ర శాసనంతో వూరుకున్నాడు కాని, లేక పోతే వాళ్ళని ఎప్పుడో ఒకచూపు చూసివుం డేవాడు. తనలోని ఆడపిచ్చికి విసిగిపోయిన భార్య విడాకులిచ్చి వెళ్ళిపోయాక, తనకి అందుబాటులో వున్న శరణాలయంలోని చిన్న పిల్లలతో సరిపెట్టుకుంటున్నాడు.

"మీకిష్టమైతే రేపు రాత్రికి వస్తాను"

"అలాగే! ఎక్కడ కలుసుకుందాం? "

"ఆఫీసు రూమ్‌లో అయితే ఎవరికీ అనుమానం రాదు. రేపు రాత్రి పది గంటలకి వస్తాను"

"సరే!" సదాశివం ఆమె గుండెలకి అలవోకగా చేతిని తగిలించాడు.

"మీకు అన్నింటికీ తొందరే. రేపు రాత్రి దాకా ఆగలేరా? " ముద్దుగా విసుక్కుని వెళ్ళిపోయింది.

రాత్రి పదిగంటలయింది. ఆఫీసు రూమ్‌లో పచార్లు చేస్తున్న సదాశివం మనసు ఉద్విగ్నంగా వుంది. "సుస్మితాసేన్ నిజంగానే తను కావాలనుకుంటోందా? " ఆమెని తలచుకోగానే అతని మనశ్శరీరాలు తియ్యగా మూలిగాయి.



తలుపు తట్టిన శబ్దమయింది. అతను వెంటనే తలుపు తీశాడు. ఎదురుగా ఆమె. తెల్లని పైజమా, లాల్చీలతో ఫారిన్ పెర్ఫ్యూమ్ ఘుమఘుమలతో వున్న ఆతన్ని చూసి నవ్వింది.

ఆమె లోపలకి రాగానే అతను తలుపు మూసి ఆత్రంగా ఆమెని అల్లుకుపోయాడు.

"మిస్ యూనివర్స్‌లు, మిస్ వరల్డ్‌లూ నీ అందం ముందు దిగదుడుపే! నిషాగా వుందతని స్వరం. అతన్ని రెచ్చగొట్టేలా మత్తుగా నవ్వి చీర విప్పి దూరంగా విసిరేసింది. సదాశివానికి ఆత్రంగా వుంది. ఆమె శరీరసౌష్ఠవం పిచ్చెక్కిస్తోంది. అతనామెని నేలపై పడదోసి ఆక్రమించుకోబోతుండగా అతని గుండెలలో దిగబడింది ఆమె చేతిలోని కత్తి.

★ ★ ★

పోలీస్ కస్టడీలో వున్న సుస్మితాసేన్‌ని కలుసుకున్నారు జ్వాల, రామచంద్ర.

"అతన్ని ఎందుకు హత్య చేశావ్? " జ్వాల అడిగింది.

"అతను నన్ను చెరచబోయాడు, చంపేశాను"

ఆ ఇద్దరూ ఒకరి ముఖాలు మరొకరు చూసుకోవడం గమనించి నవ్వి అంది.

"ఎప్పుడో చెడిపోయిన నన్ను అతను చెరచడానికి ప్రయత్నించడమేమిటనా మీ ఆశ్చర్యం? ఇష్టంలేని సెక్స్ రేప్‌తో సమానమేగా మేడమ్? తులసిని ఆ దుర్మార్గుడు తన పశువాంఛకి బలిచేసి ఆమె చావుకి కారకుడైనప్పుడే వాడిని చంపాలనుకున్నాను.

జయలక్ష్మి హత్య కేసులో ఇన్వెస్టిగేషన్ కోసం ఆశ్రమానికి వచ్చిన ఇన్‌స్పెక్టర్‌కి అబద్ధం ఎందుకు చెప్పానో తెలుసా? నిజంగా సదాశివం అరెస్టయినా, చట్టం ఏమీ చెయ్యకుండా కొందరు ఘరానా పెద్ద మనుషులు అండగా వుంటారు. అందుకే వాడు చేసిన నేరాలకి ఏ చట్టమూ విధించని శిక్షని నేను విధించాను"

జ్వాల, రామచంద్ర అప్రతిభులయ్యారు.

★ ★ ★

హరిశ్చంద్ర బోనులో బంధింపబడిన పులిలా పచార్లు చేస్తున్నాడు. 'తన మాటని ఎప్పుడూ జవదాటని అపర శ్రీరామచంద్రుని లాంటి కొడుకు రెండుసార్లు తన ప్రమేయం లేకుండా తన పెళ్ళిని తనే నిర్ణయించుకున్నాడు. అదీ తన పరువు ప్రతిష్ఠలని దెబ్బతియ్యడమే ధ్యేయంగా పెట్టుకున్న

జ్వాలని పెళ్లిచేసుకున్నాడు. అది ఇంట్లో అడుగుపెడుతూనే ఆశ్రమం పెత్తనాన్ని గుప్పిటలోకి తీసుకుని అక్కడి పద్ధతులనే మార్చేసింది. ఎంత సాహసం? తనకెదురు తిరిగి బతకగలదనే అనుకుంటోందా? '

ఆ రాత్రి రమకి జ్వరంగావుండి జ్వాల గదిలో పడుకోవడం, కొడుకు వేరే గదిలో పడుకోవడం గమనించాడు హరిశ్చంద్ర.

ఇదే అదను దాన్ని చంపడానికి పూనుకున్నాడు. ఆ పనికి తననితాను సమాయత్తం చేసుకుందుకు అలమరలోనుంచి విస్కీబాటిల్ తీసి నీళ్ల కలపకుండానే సగానికి పైగా గడగడ తాగాడు.

"జ్వాలని చంపెయ్యాలి. అది బతికి వుండడానికి వీల్లేదు? " ఆలోచిస్తున్న ఆయనకి ఎదురుగా వరండాలో వున్న పెట్రోలు టిన్ను కనబడింది. ఆయన దాన్ని అందుకుని మేడ మెట్లెక్కాడు. జ్వాల గది ముందు ఆగి తలుపు తోశాడు. లోపల గడియ వేసుకోలేదేమో, వెంటనే తలుపు తెరుచుకుంది. విశాలమైన డబుల్ బెడ్ మీద జ్వాల, రమ పక్కపక్కనే పడుకుని నిద్రపోతున్నారు. ఆయన మంచం దగ్గరగా నడిచి, జ్వాలవైపు చూశాడు. ఆమె ఆదమరచి నిద్రపోతోంది. నిద్రలో చెదిరిన దుస్తులలో వున్న ఆమెని చూసేప్పటికి ఆయనలోని మృగం నిద్రలేచింది. విస్కీ మత్తు కోరిక కలిగించిన నిషా ఆయనలో యుక్తాయుక్త విచక్షణా జ్ఞానాన్ని నశింపచేశాయి. ఆయన పెట్రోలు టిన్నుని పక్కన పెట్టి ఆమెపైకి వంగి, ఆమె భుజాలను గుచ్చి పట్టుకుని ఆమె పెదవులని తాకబోయాడు.

ఆ స్పర్శ ఘాటైన విస్కీ వాసనకి తుళ్ళిపడి లేచింది జ్వాల. ఆయన్ని బెడ్‌లైటు వెలుతురులో చూసి కెవ్వుమంది.

హరిశ్చంద్ర ఆమెమీద పడ్డాడు. ఆమె ఆయన బాహుబంధం నుంచి తప్పించుకోవాలని గిలగిలలాడుతూ అరుస్తోంది.

"వదులు నన్ను పశువా! వదలరా!"

"నా కన్ను పడిన ఏ ఆడదీ నానుంచి తప్పించుకోలేదు" హరిశ్చంద్ర స్వరం నిషాగా వుంది.

ఆమె ఆయన నుంచి తప్పించుకోవాలని ప్రతిఘటిస్తోంది. నిస్సహాయతతో ఏడుపు వస్తోందామెకి.

హఠాత్తుగా వెనుకనుంచి ఎవరిదో చెయ్యి బలంగా హరిశ్చంద్ర భుజాన్ని గుచ్చి పట్టుకుంది.

ఆయన క్షణకాలం తలతిప్పి చూశాడు.

సుథేష్ణాదేవి! "ఆ అమ్మాయిని వదలండి" ఆవిడ స్వరం శాసిస్తున్నట్టుంది.

"నువ్విక్కడికెందుకొచ్చావ్? అవతలకి ఫో!" అరిచాడాయన.

"ముందు ఆ అమ్మాయిని వదలండి. మీ తుచ్ఛమైన కోరికలను తీర్చడానికి చీకటి సందులలో ఎందరో అభాగినులున్నారు. వెళ్ళండి. జ్వాల ఈ ఇంటికోడలు ఆమెను వదలండి"

"నోర్ముయ్!" ఒకచేత్తో జ్వాలని ఒడిసిపట్టుకుని మరో చేత్తో ఆవిడ చెంప ఛెళ్ళుమనిపించాడు.

సుథేష్ణాదేవి కళ్ళు ఎర్రబడ్డాయి. ఆమె చెవులలో ఎందరో అభాగినుల ఆర్తనాదాలు వినిపిస్తున్నాయి. సజీవంగా దహనమయిపోతూ ఇందుమతి వేసిన చావుకేకలు ప్రతిధ్వనిస్తున్నాయి. జ్వాల మరో ఇందుమతి కాకూడదు. ఆవిడ అక్కడున్న ఇత్తడి పూలకుండీని చేతులలోకి తీసుకుంది. మరుక్షణం హరిశ్చంద్ర వేసిన చావుకేకతో ఆ భవంతి మార్మోగింది. ఆవిడ మళ్ళీ మళ్ళీ ఆయన తలపై కొడుతూనే వుంది.

హరిశ్చంద్ర వేసిన చావుకేకతో ఆ భవంతి మేల్కొంది. గది మధ్యలో చేతిలో రక్తం అంటిన పూలకుండీతో నిలబడివున్న

సుధేష్ణాదేవిని రక్తపుమడుగులో అచేతనంగా పడివున్న హరిశ్చంద్రని భయవిహ్వలంగా చూస్తూ నిశ్చేష్టులయిపోయారు అందరూ.

నిద్రలోనుంచి ఉలిక్కిపడిలేచి ఈ దృశ్యాన్ని చూసి భయభ్రాంతురాలయిన రమని గుండెల్లో పొదువుకుంది జ్వాల.

పక్కగదిలో పడుకున్న రామచంద్ర ఏదో గొడవగా అనిపించి మెళకువ వచ్చి... తల్లి దగ్గరకి వచ్చాడు. "ఎంతపని చేశావమ్మా?" అన్నాడు అస్పష్టంగా. అతని కళ్ళలో నీళ్లూరుతున్నాయి.

"నేను చేసినది మంచిపని కాదా బాబూ? ఆయన కులద్వేషానికి ఇందుమతి బలి కాకుండా కాపాడలేకపోయాను. ఆయన కామదాహానికి జ్వాల బలి కాకుండా కాపాడగలిగానని తృప్తిగా వుంది నాకు"

"ఏమిటమ్మా నువ్వనేది? ఇందు..." షాకింగ్‌గా చూస్తూ అడిగాడు.

"అందరూ అనుకున్నట్టు ఇందుమతిది ప్రమాదవశాత్తూ సంభవించిన మరణం కాదు బాబూ! దాని వెనుక మీ నాన్నగారి హస్తం వుంది. ఇందుమతి మన కులం పిల్ల కాదని తెలిసి మీ నాన్నగారు ఆమె ఉనికినే భరించలేకపోయారు. ఆమెని ఈ ఇంటికి దూరం చేస్తానన్నారు. ఆ రాత్రి ఒంటిగంట సమయంలో నాకు మెళకువ వచ్చింది. గదిలో మీ నాన్నగారు లేరు. నా గది తలుపు బయట లాక్ చేసివుంది. నాకేదో అనుమానం వచ్చి కిటికీ దగ్గరకి వచ్చి నిలబడ్డాను. ఇందుమతి వంటగదిలోకి వెళ్ళడం చూశాను. మరుక్షణం ఆమె చావుకేక వినిపించింది. మీ నాన్నగారు దుర్మార్గులని తెలుసు కాని ఒక మనిషి ప్రాణం నిలువునా తీసేంత దుర్మార్గులని తెలియదు. ఆయన దుర్మార్గానికి ఇందుమతి బలయిపోయింది"

జ్వాల, రామచంద్ర స్థాణువుల్లా నిలబడి వింటున్నారు.

"మీ నాన్నగారు చేసిన హత్యకి ప్రత్యక్ష సాక్షిని నేను. ఒక మనిషిని చంపే అధికారం మరో మనిషికి లేదు. నేను ఏ పరిస్థితిలో మీ నాన్నగారిని హత్య చేసినా అది హత్యే! నన్ను పోలీసులు అరెస్టు చేస్తారు. న్యాయస్థానంలో నిలబెడతారు"

"నేను నిన్ను రక్షించుకుంటానమ్మా! నాన్నగారిని నేనే హత్య చేశానని పోలీసులకి లొంగిపోతాను" అతని స్వరం గాద్గదికంగా వుంది.

సుధేష్ణాదేవి చిరునవ్వు నవ్వింది. "ఇన్నాళ్లు నాదైన ప్రపంచంలో బతికే నేను ఒక మంచిపని చేసి కూడా అది తప్పు పనిగా సమాజంచేత, న్యాయస్థానంచేత ముద్ర వేయించుకో అక్కర్లేదు. మరోమాట. జ్వాల కేవలం మీనాన్నగారిని దోషిగా ప్రపంచానికి చెప్పడానికే నీతో చెయ్యి కలిపినా, నెమ్మదిగా నచ్చ చెప్పి ఆమె జీవితానికి భర్తగా ఓ అర్థాన్ని కల్పించు. ఇవన్నీ నేనెలా గ్రహించానా? అని ఆశ్చర్యపోకు. జ్వాల వచ్చినప్పుడే గ్రహించాను.

"నేను కోర్టులో దోషిగా నిలబడకుండా వుండాలని నాకేం లేదు. దానికోసం నేను చేసిన నేరాన్ని నీపై వేసుకోనవసరంలేదు. దానికి మరో మార్గం వుంది" ఆవిడ చప్పున మూడవ అంతస్థుకి వెళ్ళే మేడ మెట్లవైపు పరిగెట్టింది.

ఆవిడ మాటలలోని అంతరార్థం బోధపడి రామచంద్ర, జ్వాల గభాల్న ఆవిడ వెనుక వెళ్ళారు. అప్పటికే ఆవిడ పిట్టగోడ అంచుని చేరుకుంది. 'అమ్మా' రామచంద్ర పిలుపు ఆక్రందనలా వుంది. "అమ్మా! ఆగమ్మా!"

సుధేష్ణాదేవి పిట్టగోడమీదనుంచి కిందకి దూకేసింది. ఎర్రటి, చిక్కని రక్తపు మడుగులో ఆమె శరీరం అచేతనమవుతోంది.

**అంకితం**

నాకు ప్రోత్సాహాన్నిస్తున్న నా శ్రేయోభిలాషులు... శ్రీ విశ్వనాథం అమృత రామయ్యగారికి, శ్రీమతి విశ్వనాథం కామేశ్వరి గారికి నిండు మనసుతో

- పద్మిని




# చతుర కతలు

## నువ్వసలూ...

అయ్యేయస్ ఆఫీసర్ అభయాకర్‌కు తానో జీనియస్‌నని ప్రగాఢవిశ్వాసం. అతడి నమ్మకం అతడికుంటే ఏ నష్టమూ లేకపో యేది. కానీ తన సంతానాన్ని కూడా మేధా శక్తిలో తనంత వాళ్లను చేయాలనీ, తన



వంశాన్ని మేధావుల వంశంగా తీర్చిదిద్దిన ఘనత తనకే దక్కాలనీ ఆరాటపడ్డాడు. చాలాకాలం సంతానం లేకపోవడంవల్ల అత డికా అవకాశం కూడా ఆలస్యంగానే చిక్కింది. అందుకే కొడుకు పుట్టినప్ప ట్నుంచే వాడి మేధస్సుకు మెరుగుపెట్టేవి ధంగా ట్రెయినింగ్ మొదలుపెట్టాడు.

ఆ పిల్లవాడికి మూడేళ్లు వచ్చేవరకూ ఆగి మొదటిసారిగా వాడి తెలివితేటలకో చిన్న పరీక్ష పెట్టాడు.

రెండు పరీక్ష నాళికలు- ఒకటి సన్నటిది, ఇంకొకటి వెడల్పుది తీసుకుని రెండింటి లోనూ అతి జాగ్రత్తగా రెండేసి స్పూన్ల నీళ్లు పోసి దేంట్లో ఎక్కువ నీళ్లున్నదీ చెప్పమ న్నాడు. ఆ పిల్లవాడు అమాయకంగా సన్నటి నాళిక చూపెట్టాడు, దాంట్లో నీళ్లు ఎక్కువ లోతుగా వుండడం చూసి.

దాంతో ఆ మేధావి హతాశుడయ్యాడు. “నాలాంటి జీనియస్‌కు ఇలాంటి మందబుద్ధి కొడుకుగా పుట్టడం? వాటే షేమ్? వీడసలు నా కొడుకేనా? ఎందు కైనా మంచిది. డి.యన్.ఎ. టెస్ట్ చేయిస్తే అసలు విషయం తెలిపోతుంది గదా? ” అనుకున్నాడు.

డి.యన్.ఎ. టెస్టు చేయించడమా, మాన డమా అన్న డైలమాతోనే ఏడేళ్లు గడిచిపో యాయి. ఆ ఏడేళ్లు ఆ కొడుకు ఆలనాపా లనా వాళ్లమ్మే చూసుకుంది. ఆ తండ్రి ఆ డైలమాలోనే మునకలేస్తూ వుండిపో యాడు.

‘ఏమైనా సరే, చివరిసారిగా ఇంకోసారి

ప్రయత్నిస్తాను. ఫలితం అలాగే వస్తే డి.ఎ న్.ఎ. టెస్టు తప్పనిసరి!' అని దృఢంగా నిశ్చయించుకుని ఆ అయ్యేయస్ ఆఫీసర్ కొడుకును పిలిచి మళ్ళీ అవే పరీక్షనాళిక లతో అదే ప్రశ్న మళ్లీ అడిగాడు.

ఆ పిల్లాడు "నాలాంటి ప్రాడిజీని ఇంత పిచ్చిప్రశ్న అడుగుతున్నాడు. ఈయనసలు నా తండ్రేనా? వాటేషేమ్?" అనుకు న్నాడు.

– జి. త్రివిక్రమ్

## మేడ్‌ఫర్ ఈచ్ అదర్!

మౌనికి ముప్ఫయ్యేళ్లుంటాయి. లైబ్రేరియ న్‌గా పదేళ్ల సర్వీసుంది. వృత్తిరీత్యా అల వడ్డ కారణంగా రోజంతా పెదవి విప్ప కుండా మౌనంగా వుంటాడు. రీడర్స్‌తో సైతం సైగలతోటే వ్యవహరిస్తుంటాడు. అసలు పేరునుబట్టే అతనికి ఆ వుద్యోగం వచ్చుంటుందన్న అనుమానం వుంది చాలా



మందికి.

అయితే రోజంతా పెదవి విప్పని మౌని లైబ్రరీ ఆవరణ దాటగానే వసపిట్టే అవు తాడు. ఆగకుండా మాట్లాడుతూంటాడు. చిన్నప్పట్నించీ వాగుడుకాయే అయినా మౌనికి ఆ వుద్యోగం నోరు నొక్కేయడంతో మొదట్లో కష్టమనిపించినా ఆఫ్ డ్యూటీ టైమ్‌లో నాన్‌స్టాప్‌గా మాట్లాడుతూ కాంపె న్‌సేట్ చేస్తుంటాడు.

మౌనికి పెళ్లి సంబంధాలు వస్తున్నాయి. అయితే గలగలా మాట్లాడే అమ్మాయి అయితేనే పెళ్లాడుతానని షరతు పెట్టాడ తను. మితభాషి అయితే తన వాగుడు భరించలేక విడాకులిచ్చేస్తుందేమోనన్న భయమూ అందుకు ఓ కారణం. ఆ విష యంలో తామిద్దరూ మేడ్‌ఫర్ ఈచ్ అదర్ పెయిర్‌లా వుండాలన్నాడు.

పెళ్లిళ్ల పేరయ్యా ఓ సంబంధం తెచ్చాడు. అమ్మాయి జలజ ఉద్యోగస్తురాలేకాక గల గలా మాట్లాడుతుంటుందట. మౌనికి తగిన జోడీ అని చెప్పడంతో ఆనందంగా ఆ సంబంధం ఓకే చేసేశాడు మౌని. మౌనికీ, జలజకూ ఫెళ్లున పెళ్లయిపోయింది. అందరూ ముచ్చటైన జంట అని మెచ్చుకోవ

డంతో మురిసిపోయాడు మౌని.

అయితే మొదటి రాత్రే అవగతమయిపోయిందతనికి జలజ ఎక్కువగా మాట్లాడదనీ, మౌనంగా, ప్రశాంతంగా గడపడం తన కిష్టమనీ, నాన్‌స్టాప్‌గా మాట్లాడే భర్తంటే ఆమెకు చిరాగ్గా వుంటుందనీను! ఆమె కోసం తాను లైబ్రరీలోలాగా ఇంటి దగ్గరా నిశ్శబ్దం పాటించాలనేసరికి పిచ్చెక్కిపోయిందతనికి.

ఉక్రోషంతో ఆఫీసుకు సెలవుపెట్టి మరీ పెళ్లిళ్ల పేరయ్యను వెతికి పట్టుకుని కోపంగా రెండు పీకులు పీకాడు మౌని. "గలగలా మాట్లాడే పిల్లను చూడమంటే ముంగిలా, నోర్మూసుకుని వుండే మౌనపిశాచిని తెచ్చి నాకు అంటగడతావా? " అంటూ వి.ఆర్.రెహమాన్ ఆర్కెస్ట్రా స్థాయిలో అరిచాడు అతనిమీద.

విషయం తెలుసుకున్న పేరయ్య బోసి నోటిని ఎక్స్‌పోజ్ చేస్తూ నవ్వాడు "అమ్మాయి రైల్వే స్టేషన్లో ఎనౌన్సర్. రోజంతా మైకులో గలగలా మాట్లాడుతూంటుంది. అందుకే మీకు తగిన జోడీ అవుతుందనుకున్నాను. కానీ రోజంతా ఎడతెరిపి లేకుండా మాట్లాడి విసుగెత్తిపోయి ఇంటి దగ్గర నిశ్శబ్దం కోరుకుంటుందని నాకేం తెలుసూ? " అన్నాడు సాగదీస్తూ.

"రైల్వే జాబ్ అంటే వేరేదో అనుకున్నాను. ఎనౌన్సరా? " అంటూ నోరు తెరిచాడు మౌని.–

– తిరుమలశ్రీ

---

## 'పూర్ బుష్!'

అమల అమెరికా వెళ్ళి చాలా కాలానికి ఇండియాకి తిరిగివచ్చింది. ఫ్రెండ్స్ ఆమెని పలకరించటానికి వచ్చారు.

అమల స్నేహితురాలు రాగిణి- "అమ్మా! అమెరికాలో నిన్ను కరిగించిన దృశ్యం ఏదన్నా ఉంటే చెప్పవే? " అని అడిగింది.

"నీ బొంద. అదేం ప్రశ్న? తను కరిగిపోయి ఉంటే ఇండియాకి ఇలా వొచ్చేదా? " అంది లత తనో పెద్ద జోక్ వేసినట్లుగా. ఆ జోక్ పేలలేదు.

"మా స్టేట్స్ విషయాలేమున్నాయిలే. ఇండియా విషాయలేమైనా ఉంటే చెప్పండే ముందు" అంది అమల.

"బాబాలు బూడిద రాల్చటం, బొమ్మ గణపతులు పాలు తాగేయటం, ఇలాంటి వేగా ఇండియాలో మనకి వినిపించే పాచి కబుర్లు" అంది దీపిక ముఖం చిట్లించి అలాంటి న్యూస్ అమలకి వినిపించటం ఎందుకన్నట్లుగా.

"నువ్వే చెప్పవే సంథింగ్. ఏదైనా కొంచెం నవ్వు తెప్పించేలా ఉండాలి మరి" అంది అర్చన.

"ఓయస్ అలాగే! అయితే పూర్తిగా విన్నాకే నవ్వాలి. ఓకే!" అంది అమల. అలాగే అన్నట్లు తలలూపారు అందరూ.

తర్వాత ప్రొసీడైపోయింది అమల.

"ఇరాక్ వార్ ముగిసింది. ప్రెసిడెంట్ బుష్ న్యూయార్క్ నుంచి వాషింగ్‌టన్ ప్లేన్‌లో బయల్దేరారు. ఆయనతోపాటు మరో నలుగురు ప్రయాణీకులు కూడా ఉన్నారు ఆ ప్లేన్‌లో. ఆకస్మాత్తుగా ప్లేన్‌కి నిప్పంటుకుందనీ, పేలిపోయే ప్రమాదం ఉందనీ పైలెట్ మైక్‌లో చెప్పి ప్రయాణీకుల్ని 'అలర్ట్ చేశాడు'.

"ఆ ప్లేన్‌లో నాలుగు పారాచ్యూట్స్ ఉన్నాయి. ఐదుగురు ప్రయాణీకులున్నారు. అందులో ప్రయాణిస్తోన్న ప్రముఖ ఫుట్‌బాల్ ఆటగాడు "నాకు రేపు ముఖ్యమైన మ్యాచ్ ఉంది. నేను వెళ్ళకపోతే ఆ మ్యాచ్ ఆగిపోతుంది. జనం గగ్గోలు పెడతారు. నేను వెళ్ళితీరాలి" అంటూ ఓ పారాచ్యూట్ అందుకుని ప్లేన్‌లోంచి దూకేశాడు.

"నేను అమ్మెరికా సెనేట్‌లో ముఖ్యుణ్ణి. నేను వెళ్ళకపోతే కొంపలంటుకుంటాయి" అంటూ తనో పారాచ్యూట్ అందుకుని ప్లేన్‌లోంచి కిందకి దూకేశాడు సెనెటర్!

"నేను అమెరికా ప్రెసిడెంట్‌ని. మొన్న జరిగిన ఇరాక్ యుద్ధంలో పాల్గొన్న సైనికుల గురించి పాత్రికేయుల సమావేశంలో ప్రసంగించాలి. లేకుంటే అమెరికా ప్రజలు నన్ను ప్రెసిడెంట్‌గా రెండోసారి ఎన్నుకోరు" అంటూ హడావుడిగా చేతికందిన ఓ బ్యాగ్ తీసుకుని విమానంలోంచి దూకేశాడు బుష్"

తీసుకుని నువ్వు కిందికి దూకి ప్రాణాలు కాపాడుకో! మంటలు విజృంభిస్తున్నాయి. ఊc. త్వరపడు ప్లీజ్!" అన్నాడు మైఖేల్.

అందుకా కుర్రాడు. "డోన్ట్‌వర్రీ! పారాచ్యూట్ అనుకుని నా స్కూల్‌బ్యాగ్ తీసుకుని ప్రెసిడెంట్ బుష్ ఇందాక కిందికి దూకేశారు. ఇక మిగిలింది ఒక పారాచ్యూట్ కాదు, రెండు! ఈ రెండు పారాచ్యూట్స్‌లో మనం కిందికి దిగేద్దాం పదండి. హరీ అప్" అన్నాడు.

"బాగ్దాద్ యుద్ధంలో గెలుపొందేమన్న సంబరంలో స్కూల్‌బ్యాగ్‌ని పారాచ్యూట్



"ఇకపోతే ఓ స్కూల్ కుర్రాడు, ప్రఖ్యాత డాన్సర్ మైఖేల్ జాన్సన్ ప్లేన్లో మిగిలిపోయారు.

"హాయ్! మైడియర్ యంగ్‌ఫ్రెండ్! నువ్వు సాధించాల్సింది ఎంతో ఉంది. నేను చేసింది ఏదో చేశాను. నా గానంతో, నృత్యంతో ప్రజలను ఆనందపరిచాను. ముఖ్యంగా నేను చెప్పేది ఏమిటంటే ఇక మనకు ఒకే పారాచ్యూట్ ఉంది. అది

అనుకుని అది పుచ్చుకుని కిందికి దూకేశాడా పూర్‌బుష్? " అంటూ కుర్రాడితోపాటు ప్లేన్‌లోంచి ప్యారాచూట్‌తో కిందికి దూకేశాడు మైఖేల్!

అంతా చెప్పి- "ఇది కేవలం అమెరికాలో ప్రచారంలో ఉన్న ఒక జోక్ మాత్రమే!" అని నవ్వేసింది అమల.

ఆమెతోపాటు అందరూ...

– అంపేరాయని
వెంకటచంద్రశేఖరరావు

*

# 'వారసుడు' పై సమీక్షలు

డిసెంబర్ 'చతుర'లో ప్రచురితమైన ఎ. అన్నపూర్ణ నవల
'వారసుడు' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## తూర్పు-పడమరల సంగమం




*(మొదటి బహుమతి రూ. 100/– పొందిన సమీక్ష)*

ప్రేమలూ, పెళ్ళిళ్ళ ఇతివృత్తంతో అమెరికా, ఇండియాల సాంప్రదాయాలను, కట్టుబాట్లను తెలియజేస్తూ తూర్పు-పడమరలను కలిపే ప్రయత్నంలో ఎంతో పకడ్బందీగా కాస్త కష్టమైనా ఇష్టంగా నేటి యువతరపు పోకడల్ని, మనస్తత్వాల్ని అంతర్లీనంగా పరీక్షించి పరిశోధించి, రాసిన డిసెంబర్ నెల చతుర నవలే 'వారసుడు'.

ఈ నవలకి ఈ టైటిల్ అంతగా సూట్ కాలేదనే చెప్పాలి. ఓ కుటుంబపు వారసుడని కాకుండా ఓ కంపెనీ నడిపే వారసుడంటూ చివరివరకు తేల్చకుండా అల్లావుద్దీన్ అద్భుతదీపం మాదిరిగా ఓ పాత్రను సృష్టించి ఇతడే వారసుడనడం ఏం బాగాలేదు. మొత్తానికి కథాపరంగా చక్కని శైలిలో చాలా బాగా రాశారు రచయిత్రి. ప్రేమా, పెళ్ళికి సంబంధించిన టైటిల్ పెట్టి ఉంటే ఇంకా బాగుండేది.

నవలలోని అన్ని పాత్రలకి ఓ ప్రత్యేకతని సృష్టించి ఎవరి పోకడలు వారివైనా సహజసిద్ధంగా ఉండి చివరి వరకు విడువకుండా చదివేలా చేశారు. ప్రేమించి పెళ్ళిచేసుకోవడమనేది చాలా గొప్ప విషయంగా చెబుతూ చివరికి లూసీ పెళ్ళిని ఫెయిల్ చేయడం, మన దేశపు కొందరి వక్ర బుద్ధుల్ని ఉదహరిస్తూ అమెరికన్ సాంప్రదాయరీతిలో కార్తీక్‌తో రెండో పెళ్ళి చేయడం కొంతవరకు ఫరవాలేదు.

నీలూ, లూసీ, కార్తీక్‌లు ఒకరికొరకు ఒకరు తమ ప్రేమని త్యాగంచేసే రీతిలో సాగిపోతూ పెళ్ళిళ్ళ విషయంలో తప్పటడుగు వేశారు. చివరికి ప్రేమకుగాక పెళ్ళికే

పెద్దపీట వేసినట్లు కథను ముగించిన విధానాన్ని చూస్తే అర్థమౌతుంది. ప్రేమించి పెళ్ళిచేసుకోవడం తప్పు కాదుకానీ మరీ గల్య పరీక్షకు పోకుండా 'నాకు నువ్వు నీకు నేను' అనే మనస్తత్వాలు కలిగిఉంటే చాలు పెళ్ళి వ్యవస్థ మూడు పూవులు ఆరు కాయలుగా విలసిల్లుతుందనే నగ్నసత్యాన్ని విప్పి చెప్పిందీ నవల.

అందరి హితవుకోరే జనార్ధనం, జానకి పాత్రలు చాలా బాగున్నాయి. పంకజం, అరవిందల కథ చదివినంతసేపు కన్నీళ్లు పెట్టించింది. అవిటిదైన అర్చన ఔదార్యం, ఆపదలో ఆదుకునే కార్తీక్ మనస్తత్వం, తన దైన నిండుదనంతో హుందాగా సాగిపోతూ అందర్నీ తనవారుగా భావించే జయచంద్ర, సుచిత్రల పాత్రలు నవలకే హైలైటు. ఏ దేశంవారైనా మరోదేశపు సాంప్రదాయాల్ని, రీతుల్ని కించపరుస్తూ స్వార్థానికి ఉపయోగించుకుంటే అభిరాంలాగే రెంటికి చెడ్డరేవడిలా మిగిలిపోవాల్సి వస్తుందనే పాయింటు బాగుంది.

అమెరికాలో చూడదగిన ముఖ్యమైన ప్రదేశాలు వాటి ప్రాముఖ్యతని రచయిత్రి సందర్భించి నవలా రూపంలో పాఠకుల కళ్లకు గట్టినట్లు మలచి అందజేయడం మరోవిధంగా అభినందించదగిన విషయమే.

ఏదిఏమైనా రచయిత్రి అన్నపూర్ణ ఓ మంచి నవలని చతురకు అందించినందుకు హ్యాట్సాఫ్.

**– అవుసలి ఆంజనేయులు,**
మూసాపేట

# రోమ్‌లో రోమన్‌లా...

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

వారసుడు నవల అమెరికాను గురించిన సమగ్ర సమాచారాన్ని మన కందిస్తుంది. రచయిత్రి ఇండియాలోని వివాహాల గురించి రాస్తూ అతి తక్కువ కాలంలో పెళ్లి చూపులు, వివాహం, విడిపోవడం, స్త్రీ స్వాతంత్ర్యం లేకపోవడం గురించి తెలియజేస్తారు. అయితే ఎంతో ఆలోచించి, చాలా సమయం తీసుకొని వివాహం చేసుకున్న లూసీ అమెరికన్ యువతేగదా! అభిరామ్‌ని చేసుకున్న కొద్దికాలానికే ఎందుకు సెండాఫ్ చెప్పినట్లు? ఎంతో తెలివైన వాళ్ళు మనుకున్న అమెరికాస్థితి సెప్టెంబరు 11 తరువాత ఏమయ్యింది? జయచంద్ర, సుచిత్రల సంస్కారం, ఏ విషయాన్నైనా తేలికగా తీసుకోవడం అదే పిల్లలకు నేర్పడం వారి కుటుంబ జీవితాన్ని సాఫీగా ఉంచేందుకు తోడ్పడింది. 'రోములో ఉన్నప్పుడు రోమన్‌లా ఉండాలన్నట్లు ఏ దేశంలో ఉన్నప్పుడు ఆ విధానాలు పాటించాలిగాని ఒక దేశపు కల్చర్‌తో మరొక దేశాన్ని పోల్చడం అవివేకం. ప్రతీ ఆచారంలోనూ, వ్యవస్థలో కొన్ని లోపాలుంటాయి. ఫిలిప్స్, నందితల వివాహం విషయంలోనూ, అంగవైకల్యంగల అర్చనను కోడలిగా చేసుకోవడంలో జయచంద్ర, సుచిత్రల విశాల హృదయం వ్యక్తమౌతుంది. తనకు ఎంతో మేలుచేసిన స్నేహితురాలే కార్తీక్‌ను పొందడానికి అర్హురాలని కార్తీక్‌ను పొందే అవకాశం తనకున్నా లూసీకి వదలిపెట్టడం నీలిమ సంస్కారానికి చిహ్నం. అలాగే తనకో మంచి జీవితాన్నిచ్చిన లూసీ, తప్పుచేసినా హృదయ వైశాల్యంతో తన అర్థాంగిగా చేసుకోవడం కార్తీక్ మంచితనం. లూసీ తీసుకురావడంతో కార్తీక్ నీలిమపట్ల మొగ్గుచూపుతాడో లేదో అనుకొని నీలిమకోసం సందీప్‌ని సిద్ధంచేసిన సుచిత్ర మేధస్సు అపూర్వం. సమస్యలొచ్చినా తనకు అనుకూలంగా పరిష్కరించుకోవడం సుచిత్రలాంటి వారికే సాధ్యం. సంస్కారం, విశాల భావాలు, కృతజ్ఞత మేళవించిన పాత్రలతో రాసిన నవల పాత

కులకు ఎంతో తృప్తినిస్తుంది.

– నరెడ్ల అచ్యుతరామం,
అల్లిపూడి 533 407

## కాలానికి తగిన కథ

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

అమెరికాలో స్థిరపడిన భారతీయ కుటుంబాల వారు అక్కడ ఎదుర్కొంటున్న సమస్యలను, వాటి పరిష్కారాలను చక్కటి కథా నేపథ్యంతో వివరించారు రచయిత్రి అన్నపూర్ణ. కథాకథనంలో నైపుణ్యం ప్రదర్శించారు కాని అక్కడక్కడా కథను సాగదీసారనిపిస్తుంది. జయచంద్ర స్నేహితుల మనస్తత్వాన్ని విపరీతంగా చెప్పినట్లనిపిస్తుంది. జయచంద్ర స్నేహితుల కుమారుల్ని ఎందుకూ పనికిరాని వాజమ్మలుగా చేసి సుచిత్ర చూసిన అబ్బాయిని చివరకు వారసుడుగా నిర్ణయించటం కథలో పటుత్వం దెబ్బతిన్నట్లనిపించింది.

నీలిమ, కార్తీక్‌లు పరస్పరం ఆకర్షణకు లోనైనట్లు రాసి చివరకు వాళ్లెందుకు ఒకరినొకరు వద్దనుకున్నది రాయలేదు. స్నేహితురాలికోసం త్యాగం చేసినట్లు భావించాలేమోమరి. ఏది ఏమైనా అమెరికాలో స్థిరపడిన భారతీయ సంతతి వారు ఎంత సిరిసందపదలున్నా వారికి మనశ్శాంతి వుండదని ఈ నవల చదివిన పాఠకులకు అర్థమవుతుంది. రాకేష్‌ని మంచి బుద్ధిమంతుడుగా దిద్ది, చివరకు తల్లిదండ్రులను లెక్కచేయని వానిగా చేసి, అదేమి విచిత్రమో అర్చనను చూడగానే అతడు మార్పుకు లోనవటం అంతా సినిమాకోసం అన్నట్లుగా అనిపిస్తుంది. మనుషుల్లో అక్కడక్కడా మంచివారు ఉంటారన్న నానుడికి నిదర్శనంగా నవలలో జనార్ధనం, జానకి, పంకజంగారు, రంగనాథగారి పాత్రలను మలిచారు. అమెరికాలో స్థిరనివాసం చేసుకొన్న భారతీయుల జీవితంను కళ్లకు కట్టినట్లుగా వర్ణించడంలో కృతకృత్యులయ్యారు రచయిత్రి. ఇప్పటి కాలానికి తగిన కథను ఎన్నుకొని విభిన్నమైన ప్రవృత్తుల కల వ్యక్తుల మనోభావాలను చక్కటి రచనా శిల్పంతో మలిచిన రచయిత్రి అభినందనీయురాలు.

– ఎన్. విజయలక్ష్మి,
ఒంగోలు

## జననీ, జన్మభూమి

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

'ఏదేశమేగినా ఎందుకాలిడినా నిలుపరా నీ జాతి నిండు గౌరవం' అన్నట్లుగా, జయచంద్ర అమెరికాలో స్థిరపడినా తన మాతృదేశం మీద అచంచలమైన భక్తి విశ్వాసాలు ఉన్నాయి. పెద్ద కూతురు నందిత ఫిలిప్స్‌ని వివాహం చేసుకోవడాన్ని, అతను ఆనందంగా అంగీకరించాడు. నీలిమ మాత్రం సున్నిత మనస్కురాలు కావడం వలన తనకు భర్తను వెతికే బాధ్యత జయచంద్ర, సుచిత్రలు తమమీద వేసుకొన్నారు. ఒక భారతీయుడినే నీలిమకి భర్తగా తేవాలనే వారి తపన వాస్తవికతను గుర్తు చేసే విధంగా ఉంది.

అందరికీ పెద్ద దిక్కుగా జనార్ధనం, జానకీ దంపతుల పాత్రలు కథకి నిండుదనాన్ని ఇచ్చాయి. పార్వతమ్మగారే పంకజంగారని తెలిసి జయచంద్ర మనసు ఆర్ధ్రతతో నిండిపోవడం మమ్మల్ని కదిలించింది. కార్తీక్‌లాంటి మహోన్నతమైన వ్యక్తి ఆదరాభిమానాలు చూరగొన్న అర్చన, వారి కుటుంబ సభ్యులు చాలా అదృష్టవంతులు. 'ఎవరికివారే యమునాతీరే' అన్నట్టుగా ఉన్న ఈ రోజులలో ఒక కుటుంబాన్ని ఆదు

కోవడానికి కార్తీక్ చేసిన సహాయం అతని సహృదయతకి ఒక నిదర్శనం. కుంటితనం శరీరానికేగాని, మనసుకి లేదు అన్న నిజాన్ని అర్చన పాత్ర వలన తెలిసింది. కుటుంబం కోసం తన సుఖసంతోషాలని త్యాగం చేసిన తీరు మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది. ఈ కథలోని పాత్రలు మల చిన తీరులో, రచయిత్రి ఎంతో నేర్పును కనపరిచారు. చివరికి నీలిమ ఒంటరిగా మిగిలిపోవలసిందే అన్న సమయంలో సుచిత్ర సందీప్‌ని నీలిమకి పరిచయం చేసి వారిని ఒకటి చెయ్యడంతో మా మనసులు తేలికపడ్డాయి. తల్లితండ్రులు లేనిపోని ఆంక్షలు విధించి పిల్లల స్వేచ్ఛను హరించే కంటే వారికి తగినంత స్వేచ్ఛను ఇచ్చి, స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకొనే అవకాశం ఇచ్చి జీవితంమీద సరి అయిన అవగాహన ఏర్పడేటట్లు చెయ్యాలి. అలా చేసిన నాడు వారి జీవితాలు గతి తప్పకుండా ఉంటాయి. ఇంత మంచి కథను పాఠకలోకానికి అందించిన 'చతుర'కి మా ధన్యవాదాలు తెలుపుతున్నాం.

– దూసి మహాలక్ష్మి,
శ్రీకాకుళం

## అడుగడుగునా త్యాగాలే

*(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఇండియానుంచి అమెరికా వెళ్ళి స్థిరపడిన వాళ్లు కేవలం పెళ్ళిళ్లకోసం ఇండియా వచ్చి లక్షాధికారులను, కోటీశ్వరులను ఎంచుకొంటుంటే జయచంద్ర కుటుంబ పరిస్థితి ఇందుకు పూర్తిగా విరుద్ధం. జయచంద్ర బెంగాలీ అమ్మాయి సుచిత్రను పెళ్ళి చేసుకోవటంతోనే కథ కుల, మత, ప్రాంతీయభావాలకు అతీతంగా మొదలైంది. ఆ తర్వాత నందిత ఫిలిప్స్‌ని చేసుకోవటం దేశీయతకు అతీతంగా సాగింది. అత్యంత సహజమైన కథలో రాకేష్ అర్చనను చేసుకోవటం కృత్రిమంగా వుంది. కార్తీక్ నీలిమను, అర్చనను కాదని లూసీని రెండోపెళ్ళి చేసుకోవటం ఊహించని పరిణామం. నీలిమకు అన్యాయం చేయకపోవటంతో కథ సుఖాంతమైంది. ప్రేమకు కుల మతాలు, ఆర్థికస్తోమతలు అడ్డురాకపోవటం ఇప్పటివరకు కథా వస్తువులయితే దేశీయతకూడా అడ్డుకాదని రచయిత్రి చక్కగా వర్ణించారు. ఇద్దరు వ్యక్తులు కలసి జీవించాలని నిర్ణయించుకొంటే వారికి ఏదీ అడ్డురాదని రచయిత్రి స్పష్టంగా చెప్పారు. ఒక స్థాయికి చేరుకొన్న కుటుంబాలలో పెళ్ళిళ్ల దగ్గరకు వచ్చేసరికి పిల్లల ఇష్టాలకు పెద్దవారు తలవంచటం జరుగుతూనే వుంటుంది. అది వారి అనుభవానికి, సంస్కారానికి నిదర్శనం. అయినా ఒక కంట కనిపెడుతూనే వుండటం తల్లితండ్రుల బాధ్యత. పరిపక్వత కల్గిన ఈ ప్రేమ కథలో అడుగడుగునా త్యాగాలే. మంచి కథను అందించిన రచయిత్రికి మంచి కథను చదివించిన 'చతుర'కు కృతజ్ఞతలు.

– అప్పారావు,
మలికిపురం

✦

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-RN1/32186/78



ఈసారి వెజిటేరియన్, నాన్ వెజిటేరియన్, ఏ వంటకమైనా వండాలనుకున్నప్పుడు సంసిద్ధంగా ఉండే 'ప్రియ' వారి శ్రేష్ఠమైన అల్లం, వెల్లుల్లి, చింతపండు పేస్ట్‌లను వాడండి. అత్యంత పరిశుభ్ర పరిసరాలలో అత్యుత్తమ పదార్థాలతో తయారు చేసిన పేస్ట్‌లు ఇవి.

మీ ఇంటి రుచులను మైమరపించే ఈ ప్రియ రుచుల్ని ఆస్వాదించండి.

**priya**
*Culinary Pastes*

## అత్యుత్తమ పదార్థాలు నోరూరించే రుచులు!

priya Tamarind Paste

priya Ginger & Garlic Paste

priya Ginger Paste

priya Garlic Paste

• అల్లం మిశ్రమం • అల్లం-వెల్లుల్లి మిశ్రమం • వెల్లుల్లి మిశ్రమం • చింతపండు మిశ్రమం